# వి జ్ఞ ప్తి

---

తే. గీ. వ్యాసవిరచిత సంస్కృత ♦ భారతమ్ము
దెలుగుజేసిరి తిక్కనా ♦ దులు; శివాజ్ఞ
ణమ్ముగానది యతఁడగా ♦ న్ప్రబంధ
సరణిరచియింతు నాజన్మ ♦ సార్థకముగ.

ఉ. తప్పులకుప్ప నాకయిత ♦ దానికిదోడుగ గొప్పసాములే
జెప్పగబోనిమేటి కత ♦ జెప్పగబూనితి నెక్కసక్కెమా,
జప్పనగాదె బాసబిగి ♦ చాలనియల్లిక, నాకొలందికిన్
బప్పునగాలు వేయకసె ♦ బాసపించుట నోటిచూటలే.

చ. పెదవులజాఱుచేతడవు ♦ చిన్నలుసైత మెఱుంగగా రసం
బొదవ నొకొక్క పద్దెమున ♦ కొక్కొక సెత్తురుచుక్క నోడ్చుచుం
బదనుగ పేలవంబు గను ♦ పట్టగనీక చరిత్రమంతయుం
బదిలముగా రచించిచెలు ♦ వంబిడుచుం గవితాకుమారికిన్.

తే. గీ. భారతముదెనిగించిన ♦ వారిలోన
విచుతి పాత్రులుగాన ♦ కవిత్రయమ్ము
సరస తిరుపతి వేంకటే ♦ శ్వర సుకవులు
చెలఁగి యవ్వారిననుసరిం ♦ చితినినేను.

సీ. వరలు హేలాపుర ♦ ప్రాంతమందేను కా
పురముందు పోతునూ ♦ ర్పురవరమున
పరిమితంశజుడ, నా ♦ పస్తంబసూత్రుడ
హారితసగోత్రుడ ♦ ధరణిసురుడ
సుబ్బరాయడుతాత ♦ సుందరరాముండు
జనకుండు, జననిత్రి ♦ కనకమాంబ

యిందీవరాక్షి స ◆ న్నెలనొసంగిన తల్లి
తనరారు మహాలక్ష్మి ◆ ధర్మపత్ని
గురువరేణ్యుడు గుడి ◆ గుంట లక్ష్మీపతి
హనుమదే వసుమ్మకో ◆ న్నట్టి వేల్పు

తే. గీ. సుతుడౌకంఠమున్న, కలహాత్మ ◆ సుదగిరియవ్వరు
పయను ముప్పదిరెండవ ◆ వత్సరంబు
హరికథలు సెప్పజాలిన ◆ యుక్తి సుకి
నఖిలజనులు సుబ్రహ్మణ్య ◆ దంపతు సన్ను.

సీ. జమునరయొద్దనకోరి ◆ ...తీగె
కన్న్యప్రాయంబునం ◆ గన్న కాన్పు
నాల్గువేదములంది ◆ న్నగవిభాగించి వ

ల్గాథలల్లినమేటి ◆ కంబునయ్య
చవులూరభారతి ◆ చరితమెల్లరు విన
హాయిగాబాడిన ◆ కోయిలదొర
తొలుకారుమబ్బులం ◆ దులకించు సొబగైన
తనుకాంతినొప్పారు ◆ తపసిమిన్న

తే. గీ. వెన్నునవతారమనువాసి ◆ గన్నసామి
పరమభాగవతాగ్రణి ◆ బ్రహ్మవేత్త
కాలవేది సార్థక చిర ◆ కాలజీవి
యగు పరాశరసుతు వ్యాసు ◆ నభినుతింతు.

ఉ. ఎన్నడు నాడిబొంకడు స ◆ మిద్ధగుణుండు ప్రశాంతమూర్తి, పే
రన్నికగన్న సత్కథకు ◆ డెంతయు గన్నకుమారుపోల్కిన
న్నన్నివిధమ్ము లంగనుద ◆ యాంబుధిగావున సన్నుతింతు వి
ద్వన్నుతు వెంటపాటికుల ◆ వార్ధిశశాంకుని సుబ్బసాఖ్యునిన్.

శ్రీ

# మహాభారతము

## భీష్మప్రతిజ్ఞ

శ్రీవిఘ్నేశమిభాభాస్యం । సేవకాభీష్టదాయకం
ఏకదంతముమాపుత్రం । నమామి గణనాయకం॥

భైరవి — రూపకము

ప॥ ఆనందం భానందం - భావింప మహాభారత ॥మా॥
అ॥ నానావిధ పుణ్యఫలన - సంచిత పంచమవేదం ॥భా॥

చరణము

మోదితధర్మార్థకామ - మోక్షములకు సాధనంబు
వేదవ్యాసోరుధీవ - రాధిజనిత దివ్యామృత ॥మా॥

సీ. తొల్లికల్మాష పా ♦ దుండను ఱేడు, వి
శ్వామిత్రు పంపున ♦ జని వసిష్ఠ
నందనులంగూల్చ ♦ నందుశ క్తిమునీంద్రు
వనితయదృశ్యంతి ♦ యనులతాంగి
నిండుచూలాలు పం ♦ డ్రెండువత్సరములు
మోసిగర్భమ్ము, ప ♦ రాశరుగని
వేదవేదాంగసం ♦ వేది బుధాగ్ర గ
ణ్యుండు, పరాశరమౌని ♦ యొక్కనాడు

తే. గీ. యమునలోనోడ గడపు తొ ♦ య్యాలినొకర్తు
గనిమనంబు చలింప, డ ♦ గ్గరి యభీష్ట
మెఱుకపఱుప లజ్జించి, యా ♦ క్కాంత దొలగి
ముత్తియము లొల్కబల్కె నా ♦ ముద్దుగుమ్మ.

మోహన—ఆది

ప॥ పల్లెతేనికూతుర సామీ నా - పై నీకింతటి వలపేమినే ॥పల్లె॥
అ॥ తల్లిదండ్రులున్నారు నాకస్వ - తంత్రురాల వేగిరపడదేలా ॥పల్లె॥

చ ర ణ ము

తనువుమీల దుర్గంధమయము, రో - తంబుట్టింపదె నాతోకూటమి
అనఘ! కన్యకను కన్యకావ్రతం - బంతరింప నలువురగుబాటగు ॥ప॥

తే. గీ. ఎల్లవేదమ్ము లెఱుఁగు జి ♦ తేంద్రియుడు, ప
రాశరమహామునీంద్రుడా ♦ దాశరాజు
పట్టితో గంగయొడ్డున ♦ పట్టపవలు
గలసె ననుసడి నిలచు లో ♦ కముస జిగము.

వ అనిన నమ్మునివరుఁడు తనతోడి కూటమింగన్యాత్వంబు సెడకుండ వరంబిడి నీవు వసువను రాజర్షి వీర్యంబునం బుట్టిన దానవుగాని సూతకుల ప్రసూతవు కావని చెప్పి శరీర సౌగంధంబు యోజనపరిమితంబగునట్లు ప్రసాదించి, యోజనగంధియనియు, గంధవతి యనియు బిలువం బడెదవు గాక యనుచు దానేయ సుద్యోగించిన చీకటి త ప్పారు లెఱుంగకుండ.

మ ం జ రు లు

తపోమహిమ నమ్మౌని బయలెల్ల ♦ తమోమయము గావించె
తపోధనుం డా పరాశరుడు స ♦ త్యవతింగూడి రమించె
పరమేష్ఠికల్పుఁడగు పరాశరు స ♦ మాగమమున సత్యవతి
వర సద్యోగర్భంబున వేద ♦ వ్యాసుంగనియె స్తుతమతి
తనకోరినవరములిడి మౌనియుం ♦ జనియెనట తనూజుండు
పనిగల్గిన ననుదలపుమా వత్తు ♦ ననిచనియెను వ్యాసుండు.

వ. ఇది యిట్లుండ,

చ. భరతకులాగ్రగణ్యుడు, నృ ♦ పాలవరేణ్యుడు, పుణ్యమూర్తి, సు
స్థిర విభవాభిరాముడు, ప్ర ♦ తీప కుమారుడు శంతనక్షమా
వరుడొకనాడు వేటకని ♦ వచ్చి వనాంతర భూములెల్ల గ్రు
మ్మరి, తుది గాంగసైకత స ♦ మంచిత చారుధరాతలమ్మునన్.

సీ. నల్లనౌ మునుకురుల్ ♦ నాచుదీవలు గాఁగ
లలిమేసి ముదుత తే ♦ యులలు గాఁగ
వెడద వాల్గన్ను లో ♦ క్కేడ గండు మీల్గాఁగ
మురిపెంపు చిఱునవ్వు ♦ నురుగు గాఁగ
తోరంపు దిటవు కు ♦ తుక వలమురిగాఁగ
పాలిండ్లు మేటి గు ♦ బ్బలులు గాఁగ
నెనఁగు పిఱుందులే ♦ యిసుక తిన్నెలు గాఁగ
మేలిసరాల్ ♦ రతనాలుగాఁగ

తే. గీ. పిక్కలు మొనళ్ళు ♦ లోతైన పొక్కిలినుడి
గాఁగ లావణ్య జలరాశి ♦ గాదనర్చు
చివురుబోడి నౌకరుగాం ♦ చి సుమశరుడు
సంభ్రమము గొల్పఁడగ్గఱి ♦ శంతను డనె.

శహాన - ఆది

ప॥ ఎవరిదాన విం దేలవచ్చితి - వేకతంబ యిట్లున్న హేతువే ॥ఎవ॥
అ॥ చివురుబోడి రాచిల్క రౌతుపై - మిన్నులపగిలి వచ్చినదతివో సీ ॥వె॥

చరణము

మోహనాంగి పాంధుడ నే డస్సితి - మోవిపానకం బిమ్మా
బావులూరాలమునసదిమి నాతాప - భారము డిపి పాలింపు మొకతూరి ॥ఎవ॥

చరణము

ఏపు దీవులైన లేనివిభవమున - నేలువాడనో కాంతా శాంతనుడ
వేడుకొందు నన్గూడుమా శంక - వీడినేడు మూరాడపాడిగా ॥ఎవ॥

చ. అనవిని యత్తలోదరియు ♦ నా జననాయకు సాభిలాషయై
కనుగొనునంత నొండొరుల ♦ గాటపుజూడ్కులు సాయకాళిగా
గొని వెడవింటిదంటయును ♦ గొబ్బున వారల ధైర్య వల్లులం
దునియలుగా నొనర్ప నృపు ♦ తో గడకిట్లనె సమ్మృగాక్షియున్.

మ. విను మేనెవ్వతెనైన నేమి ♦ సకలోర్వీనాథ, నన్నాశ్లిగా
గన నీకుం దలపున్న నప్రియము వ ♦ ల్కంబోక వారింపరా

కనుమోదింపుము నా యొసర్చ్వపను లి ♦ ష్టిఁన్. భవత్కామితం
బెనఁచుంతున్ బ్రతికూల మెప్పుడగు న ♦ ప్లెబోను నిచ్చాభరతిన్.

అ. వె. అసిన శంతనుండు ♦ నిని యొడంబడి దాని
బ్రేమమీర దగ బ ♦ రిగ్రహించె
నెలమి గంగ వాని ♦ కిష్టోపభోగముల్
సలుపుచుండు నంత ♦ శాపవశత.

సీ. వరుణాదివసువు లా ♦ వనితకు బుత్రులై
పుట్టుచునుండ న ♦ ప్పొలతి వారి
పుట్టినప్పుడె గొని ♦ పోయి సిర్ధయయై జ
లంబులవైవ గ ♦ డంగ న్నృపతి
గని దాని వారింప ♦ గా నోడు జెలువ త
న్నెడబాసి పోవును ♦ పెద దలంచి
యంత గొన్నాళ్ళ క ♦ శ్కాంత యిమమతిన
యుం పొదయూర్క తే ♦ జుండు బుట్ట

తే గీ. బుడుత నెప్పటియట్ల జలం ♦ బులవైవ
బోవగని శంతనుం డతి ♦ పుత్రమోహ
మున నివారింప దలకొని ♦ మునుపొనర్చు
సమయభంగంబుగా నిట్లు ♦ చానకనియె

సాకేరి—అది

ప॥ కొడుకుల నేడ్వురి మడియించితివి
ఘోరమేమి సుతఘాతినివై తివి ॥కొ॥

అ॥ కడుపారగన్న బుడుతల జలముల
బడవైవగ నీచేతులెట్లాడె ॥కొ॥

చ ర ణ ము

సమయ భంగమునకోడి నీ చేయు - సాహసము నివారింపగానై తి
భ్రమరవేణి బాలార్కతేజు నీ - బాలునై న బ్రతికింపుమానేడు ॥కొ॥

క. సంతతికై గావింతురు
కాంతలు పుణ్యవ్రతాది ♦ కములెంతయు నీ

శంతనున గన్నకుమారుల
నంతముగావింతురే? జ ◆ లాంతరమందున్.

వ. అన విని జాహ్నవియు,

మంజరులు

సమయభంగముగ నడ్డుజెప్పితివి - జనెద నిన్నింకవీడి
కుమారమణ నేగంగను నేడే - నరి కూటమి నీతోడి
అష్ట వసుపుత్రులు వసిష్ఠశాపమున - నాత్మభవులైరి మనకు
నష్టమవసు వీపుత్రకుండు దీ - ర్ఘాయుష్కుండై బ్రదుకు.

తే. గీ. అనుచు జాహ్నవీదేవి ధ ◆ రాధిపునకు
స్వస్వరూపంబుజూపి దే ◆ వవ్రతుం డీ
తండు నాకడ బెరుగును ◆ తను వసించు
నని సుతుంగొనిచనె, భూపు ◆ డరిగె పురికి.

ఉ. వేద చతుష్టయంబు సది ◆ సెం బ్రియమార వసిష్ఠునొద్ద, ధ
ర్మాది సమస్తశాస్త్రవిదు ◆ డై గురుశుక్రుల పోలికన్ ధను
ర్వేదము నభ్యసించె వర ◆ విన్ భృగురాముకడన్ సనత్కుమా
రాదులవోలె తత్త్వవిదు ◆ డయ్యె నృపాలతనూజు డెంతయున్.

ద్విపదలు

అంత గొన్నిదినంబు ◆ లరిగినయంత
శంతనుండును తనూ ◆ జాతు డున్నడకు
జని సమస్తకళా వి ◆ శారదుండైన
రసము దోషాకృని గ్రహం ◆ బున కేగుదెంచి
సకల భూవర సమ ◆ క్షమున గాంగేయు
బ్రకటితంబుగ యౌవ ◆ రాజ్యాభిషిక్తు
గావించి యొకనాడు ◆ ఘన యమునాన
దీవారిలో నొక్క ◆ తెఱవ తానొడ
గడపుచో జని దాని ◆ గని యబ్బురముగ
నెడవింటి దొరబారి ◆ బడి మెచ్చె నిట్లు.

నమ్మెటకి నామమెయ్యదో? యొ ♦ సంగమిదే తనివార రాచసుం
కమ్మగ మోవిపానకము ♦ రాజుజాశాసన మిద్ది ముద్దియా!

వ. అనిన విని తొయ్యలిపల్కుల సద్భావసూచకములనెంతయుం బొగడి.

మోహన — చతురశ్ర

ప॥ నేను పల్లెదాన - నీ కేలనాపై మనసీసుధాన

అ॥ సూనశరుని క్రొవ్వాడికోలలకు - నసక్కుగునేల తగునేయిదిమేల ॥నే॥

చరణము

దాశరాజు కూతురను నాకు - నాసనముదిలెను కనుమూభదయాతురను
నేనీయుడు నీకని నాజనకుని - శాసనమున నా పేరుసత్యవతి ॥నే॥

చ. పరవర రాచసుందరి ముగ ♦ నా మనసిచ్చెద కామినీమనో
హరుడవు, యనస్వతంత్రనుగ ♦ బా తెలిసి స్త్రీలచాటుదాన, నీ
వరుగుము దాశరాజునడ ♦ తాతడు నమ్ముదిజూవు, నాపయిం
బరిణయము మా గాక సన ♦ దాని నపాయమునసాక్షిగానమున్.

ఆ. వె. అనినవిని నృపాలు ♦ డతిమోదముండ, తత్
క్షణము దాశరాజు ♦ కడకుజని ము
నోభిమతము దెలుప ♦ నత్యంతభక్తి బూ
జించియతడు సంత ♦ సించె పలికె.

ఉ. పాయక కల్పకంబుం దగిన ♦ దానికొసంగుట లోకవర్తనం
బేమొడ దల్లిదండ్రులక ♦ దృష్టమెకా నిను బొంట్లకిచ్చుటల్
ఈ యలివేణి నాలిగ గ్ర ♦ హింపవలెం పుదయించునేని భూ
నాయక! నీపరోక్షమున ♦ నా మనుమండె నృపుండుగావలెన్.

తే. గీ. అనిన గాంగేయు యువరాజు ♦ నాత్మ దలచి
వసుమతీపాలు డెద్దియుం ♦ బాలుపోక
చని నిరుత్తరుడై నిజ ♦ సదనమునకు
నెంతయుంగుందె నిట్లు మ ♦ రంతచింత.

నాదనామక్రియ — ఆది

ప॥ నేనేటికి వేటకై పోయి యను - నాసదీ తీరముం జేరితి తుది ॥నేనే॥

అ॥ ప॥ మానుగా సత్యవతినేలగంటి-దానిపై తగని వలపేలగొంటి ॥నేనే॥

చ ర ణ ము

దాశరాజు తన దౌహిత్రుని భూ - మీశుగాఁజేయుమని గోరనేల
దోసమనక గాంగేయునేరీతి - ద్రోసిరాజందు గాంతాలోలత ॥నే॥

ఉ. బాహుపరాక్రమాంచితుఁడు ♦ పౌరవవంశవివర్ధనుండు, ఘో
రాహవదోహలుండు నిఖి ♦ లాస్త్రవిదగ్రణియైన వీత సం
దేహుని జాహ్నవీతనయు ♦ నేటికి నే నొక పల్లెదానిపై
మోహముచే నధర్మవిధి బోలునె ♦ రాజవిహీను జేయుటల్ ?

చ. నలువురు గేలిసేయ నిజ ♦ నందనుఁడుండఁగ పెండ్లియాడి ని
ర్మలగుణు నాపగాతనయు ♦ రాజ్యవిహీనునొనర్పఁజాల, న
య్యలికులవేణిపై గలుగు ♦ నగ్గలపుం దమి పైపజాల, నూ
యెలవలె నూగులాడు మన ♦ మెద్దియుదోచ ద కేమిసేయుదున్.

గీ. అనుచు వలవంతగుందు శం ♦ తనుఁడు రాజ్య
పాలనముసేయ డాహార ♦ పానముల గ్ర
హింప డొక్కింత నిదుర వో ♦ డీ విధాన
మరసి గాంగేయుఁ డొక్కనా ♦ డనియెనిట్లు

కన్నడ—రూపకము

ప॥ ఈవిచారమునకు హేతు - వేమో యెఱిగింపు తండ్రి ॥యీ॥

అ॥ ప॥ దేవేంద్ర విభవమున ధా - త్రీవలయంబేలు వాడ ॥ఈ॥

1. అభిధేయులుగారు పౌరు - లారయ శాత్రవులు లేరు
భవదీయంబగు నాజ్ఞకు - ప్రతికూలములేదెన్నఁడు ॥ఈ॥

2. ప్రాకటముగ నీ కెందును - జేకూరని కోర్కెగలదె
నాకనదీసంభవుండ - నందనుండ నేనుండఁగ ॥ఈ॥

ఉ. వాడిమగండ, వా దివిజ ♦ వర్గము సైతము దేరి చూడఁగా
నోడు, నిరంకుశుండవు; స ♦ ముద్గత చాపకళాధురీణతన్
జోడిమి గన్నవాఁడను త ♦ నూజుఁడ, లోఁగలవాంఛితంబు మో
మోడక దెల్పు మీక్షణమ ♦ పోయి మనోభిమతంబు దీర్చెదన్.

వ. అని పల్కు-దేవవ్రతు గౌగిలించుకొని,

కేదార — రూపకము

ప॥ నాయనా గంగానందన - నలినవైరికుల భూషణ ॥నా॥

అ॥ ప॥ సాయక విద్యాధరవాస్య - నంపేదివి నీకెనురేది ॥నా॥

చరణము

1. ఏకపుత్రుడనపత్యుడు ♦ సెంతే నోకరూపటంబ్రుడు
నీకుదోడుగా బుత్రుల ♦ నేబడయ దలంచినాడ ॥ని॥

2. ఎనమండ్ర గుమారులగని ♦ యనిమిషనది నిను నా కిడె
తనలోనే గలిపికొనియె ♦ తక్కిన కొమరులనవుడే ॥ని॥

చ. మగటిమిగల్గువాడ వరి ♦ మర్దన సాహసి కుండ వౌదు వె
న్నగ నటుగాన నీకునికి ♦ నమ్మగరాదు, వివాహమయ్యెద
దగిలెను వామనం బౌక ని ♦ తంబినిపై నది దాశిపుత్రి, య
మ్మగుదను నాకొనంగ దల ♦ పోయుచు తానని నడ్డవిడ్డముల్.

వ. అనవిని గాంగేయుండు,

పూర్వకల్యాణి — త్రిశ్రగతి

ప॥ నీమనోభిమతము దీర్తు - నిక్కమిదియె నా ప్రతిజ్ఞ ॥నీ॥

అ॥ ప॥ యీామెయి నాపల్లెతేని - నెటులో సమాధానపరచి ॥నీ॥

చ॥ వ్రతములు తపములు జపములు - పితృసేవకు సాటిగావు
"పితృదేవోభవ" యటంచు - వేదము వాకొనుగాదే ॥నీ॥

క. అనివల్కి గంగకొడుకొ
య్యన బయనంబయ్యె నంత ♦ యమునకడను శం
తనుని వియోగమునై వమి
వనజాయతనేత్ర సత్య ♦ వతి వనరునిటుల్.

పున్నాగతోడి — మిశ్రగతి

ప॥ అందరానివండ్లు - కాశివ ఫలమేమి
యుల గాలిలో మేడ - లల్లసార్థకమేమి ॥అం॥

అ॥ కందర్పశతకోటి - సుందరుడౌ తేని
పొందు నాకెటులబ్బు - మందభాగ్యరాలి ॥కం॥

చరణము

నమ్మి నాన బోసుకొంటి - పేర్మి
నాటి రాచవాని మాటలు నిజమని
యెమ్మెయిరాడేమిసేతు బేలనైతి
నీవియోగజలధి - నెట్లు గడచుదాన ||న||

చ. పురుషులసమ్మరాదు, పువు • బోడుల నిర్మల చిత్తవృత్తులం
దఱచి, ప్రమోహబీజములై • దన పెదజల్లి యసత్యవాక్యయో
ధగ జలధారలం దడిపి • దర్పకతాప నిదాఘతీవ్రదు
ష్కర కిరణప్రసారముల • గాల్తు రభీష్టనవాంకురంబులన్.

తే. గీ. సత్యవతి యీవిధంగుండు • సమయమందు
సురనదీ సూను డాపల్లె • ద్వారను జేరి
జనకు నభిమత మెరిగింప • నతండు
తొంటియ ట్లంతి దేవవ్ర • తుండుబలికె.

ఉ. అక్కరలేదునాకు పర • మాత్మునిసాక్షిగ రాజ్య మింతయు
న్నిక్కము మేదినీవరుడు • నీవునుమండగుగాత; యేను న
ల్దిక్కు లగెల్చి [illegible]తనికి • దేజము పెంపును గూర్తు గావునన్
దక్కము సంశయం బభిమ • తం బొడగూర్చుము నాదుతండ్రికిన్.

వ. అనిన విని దాశరాజును.

తే. గీ. ఆడితప్పు వెఱుంగుదు • నవి యటుండ
నీ కొమరులేని మనుమలే • నియు వివాద
మునకు ముందెన్నడే వత్తు • రని తలంతు
దీనికేమి చెప్పెదు సమా • ధాన మనఘ!

వ. అని పల్కు దాశరాజుంగని దేవవ్రతుం డిట్లనియె.

ఉ. ఆరయ పెండ్లియాడిన గ • దా మరి సంతతి గల్గు చేరికే
దూరక బ్రహ్మచారినయి • యుందును పెండిలి మానుకొందు నా
సారసమిత్ర చంద్రముల • సాక్షిగ నమ్ముము; నీకు శంతన
క్ష్మారమణుండె యల్లుడగు • కన్నను కొండొకభాగ్య మున్నదే.

వ. ఇట్లు రాజ్య పరిత్యాగంబును, బ్రహ్మచర్య వ్రత పరిగ్రహంబును జేసిన దేవవ్రతుని భీష్ముండని పొగడుచు సురలు సుమవృష్టిం గురిసిరంత దాశరాజు సంతసిల్లి యొసంగిన సత్యవతిం దోడ్కొని కరిపురి కరుగ శంతనుండును గాంగేయు నాలింగనం బొనర్చె.

తోడి—ఆది

ప॥ కురుకుల వర్ధన - గంగానందన - కొమరుడవన నీవే - నాకోర్కె
దీర్చినావ ॥కురు॥

అ॥ సరిలేరీ ముజ్జగముల నీకున్ - సంభావ్య జితేంద్రియత్వముననో ॥కురు॥

చరణము

రామ పూరు నరపతులుదక్క గల - రా! పుత్రులటోసన్ - పితృ
భక్తిరతులు ॥రామ॥

నామనోభీష్ట మీడేర్చితివా - నాతండ్రీ స్వేచ్ఛాజీవివి గమ్మునో ॥కురు॥

శా. ఆలోచింపగ నాకు మాత్రము వివా ♦ హంబేల? నీయట్టి స
చ్ఛీలుం డాత్మజుడుండ; నింద్రియము లెం♦తే చంచలంబుల్; కుమా
రా! లోకుల్నను గాముకుండనుచు దూ ♦ రం జూతు రిప్పట్టునన్
జాలింపందగు నీవొనర్చిన ప్రతి ♦ జ్ఞల్మీవ దేవవ్రతా!

వ. అన విని భీష్ముండును.

సీ. పలికె బొంకని మహా ♦ త్ములకాలవాలమై
కొమరారు వంశంబు ♦ కురుకులంబు
విష్ణుపాదమున నా ♦ విర్భవించిన లోక
పావనిగంగాభ ♦ వాని తల్లి
ధర్మతత్పరుడవై ♦ ధరణి బాలించు శం
తనుడవు నన్నన్న ♦ తండ్రివీవు
పరశువుం గయిబూను ♦ పరమ మునీంద్రుడా
యగ్ని తేజుడు జామ ♦ దగ్ని గురుడు

తే. గీ. ప్రకట సత్యవ్రతుండ దే • వవ్రతుండ
నట్టి నేనిట్లు పట్టిన • పట్టువీడి
యమృతకిరణాన్వయఖ్యాతి • నగ్గిగల్పి
ప్రతినగావించి తీరుదు • ప్పగిది తండ్రి !

తే. గీ. ఆయురారోగ్యములు హెచ్చు • నాశబడగు
యశము వ్యాపించు, నశుభంబు • స్వార్థపరత
విడలు హైన్యంబు తనుకాంతి • పెచ్చు పెరుగు.
నలరు బ్రహ్మచారులకు నా • త్మైక్యమవల.

వ. ఇట్లు పల్కు తనూభవు మనోనిశ్చలత్వంబునకబ్బురపడి శంతనుండు సంతసింప నంత నమాత్యవరులెల్ల కరిపురం బలంకరింప నొక్క శుభ ముహూర్తంబున.

కళ్యాణి—ఆది

ప॥ సత్యవతీ శంతనుల వివాహము- జరిగె మహావైభవముగనయ్యెడ॥స॥
అ॥ ప॥ నిత్యసత్యవ్రతుడు గాంగేయుడు-నిరుపమానందవార్నిధిదేలగ ॥స॥

చ ర ణ ము

ధరణింగల రాజన్యులెల్లరును - పరికింపగ కన్నులపండువుగా
మురిపెంబుననామజపురమునగల - ముగుదలెల్లపేరంటముసేయగ ॥సత్య॥

తే. గీ. లలితసత్యవతీ శంత • నుల వివాహ
వైభవము గాంచి యానంద • వార్ధిదేలి
యెల్లవారు దంపతుల దీ • వించి రంత
చేడెలు స్మంగళారతుల్ • బాడిరిట్లు.

శ్రీ

# మహాభారతము

## భీష్మవిజయము

కాంభోజి - ఆది

ప॥ గురుశిష్యుల సంగ్రామ కథవినుడు
గురుతరానందమందు డానాటి ॥గురు॥

అ॥ ప॥ నిరతధర్మతత్పరుడు భీష్ముడా
పరశురాము గయ్యమున జయించిన ॥గురు॥

చరణము

చిత్రాంగదుడు విచిత్రవీర్యుడన - పుత్రులనిర్వుర గనియెనాదాశ
పుత్రినారయయావసులుగాకుండ - పోయెదివికిశంతనుమహీవరుడు ॥గు॥

చ. జనకుడు కురురక్షకులు ♦ సల్పి పదంపడి దేవవాహినీ
తనయుడునిల్పె బేర్మి పెద ♦ తమ్ముని సింగపుగద్దెపై; నతం
డును సురసిద్ధసాధ్య గరు ♦ డోరగ దానవ మానవావళిం
గొనకొని చీరికింగొనడ ♦ కుంఠిత ఘోర రణాభిలాషియై.

మంజరులు

చిత్రాంగదుడను గంధర్వవిభుడు - చెలగి మహాసమరమున
చిత్రాంగదు నొకనాడు పోరాడి - చెనకె కురుక్షేత్రమున
ఆపగేయుడు విచిత్రవీర్యు రా - జ్యాభిషిక్తు గావించి
యాపై గాశీరాజకూతుల స్వ - యంవర మాకర్ణించి
తమ్మునకు వివాహమ్మునేయుగా ♦ దలంచి యా ధనుర్ధరుడై
శీఘ్రమున్నన రథమెక్కి యొక్కరుడు వా ♦ రాణసీపురోన్ముఖుడై
చని యందు స్వయంవరమున మూగిన ♦ జననాథులు వెఱగుపడ
గొన కన్యల రథంబెక్కించు ♦ కొనిపల్కె పిడుగులుబడ.

శంకరాభరణము - త్రిపుట

ప॥ మానమున్న సన్నద్ధుడు - మీరో శూరమ్మన్నలు ॥మా॥

అ॥ ప॥ నానవహోదరుప కల్లాం - ప్రతం జేసెద నీముప్పార ॥మా॥

చ॥ జగమున గాంధర్వనామకున - వివాహమొకటి తమ్ములు
జగతీనాథులకుగాన - మగటిమి గెల్చి యిపుడె ॥మా॥

సీ. అనిపల్కి కాశీవి ♦ భునకు జెప్పి బిరాన
సరుగుచో రాజులె ♦ ల్లరును దాక
నోడించి పెక్కుర ♦ నుగ్గాడి యోక వీ
రుండయి పోవ సా ♦ ల్వుండు గదిసి
పటుసాయకమ్ములం ♦ బ్రహారింప బ్రళయ రు
ద్రునివోలె భీష్ముండు ♦ క్రుద్ధుడగుచు
విరథు గావించిన ♦ విమనోరథుండు సా
ల్వుండును నిజపురం ♦ బునకు జనియె

తే. గీ. నంత శాంతనవుండు క ♦ న్యకల ముగుర
తమ్మునకు బెండ్లి సేయ య ♦ త్నపడుచుండ
నందు బెద్దదియగు నంబ ♦ యనియె నను వ
రించె సాల్వుండు సాల్వు వ ♦ రించితేను.

క. అనవిని గాంగేయుం డం
బను సాల్వుని కొఱకు విడిచి ♦ వర శుభలగ్నం
బున తన యనుజాతున కొ
య్యన బెండిలి జేసె నంబి ♦ కాంబాలికలన్.

వ. అంత నంబయు సాల్వునికడకేగి తా వచ్చిన విధ మెరింగింప నతండును "భీష్మచే నంటబడి రథంబున నుంచబడితివి గాన నినొల్ల" ననుచు మందిరము వెడల నడిచిన నాపెయు భీష్ముని కడ కేతెంచి తన యవస్థ నివేదించుకొన శాంతనవుండును "నీవ న్యాయమ రక్తచిత్తవు గాన నిన్ను నా తమ్మునకు వివాహంబు

నేయనొల్ల' ననిన నంబయు నుభయభ్రష్టయై కొనకు మున్యాశ్రమం
బుల కేగి తపం బొనర్ప నుద్యోగింప నామె మాతామహుం డగు
హోత్రవాహనుం డను రాజర్షి వచ్చి తద్వృత్తాంతంబు విని యంబను
పరశురాము నాశ్రయింపజేయ నమ్మహనీయుండు నంబను వెంట
నిడుకొని కురుక్షేత్రమ్మునం గల సరస్వతీతీరంబున విడిసి దేవవ్రతుం
బిలువనంప నతండు నయ్యెడకుం జని జామదగ్ని వర్ణించుచు,

శ్రీరాగము — ఆది

ప॥ గురువరేణ్యా తావకపల్లవమృదు - చరణంబులకివె నానమస్కృతులు॥
అ॥ప॥ శరణాగత వత్సలుడవు కరుణా - శరధివంబుజాసనతుల్యుండవు ॥గు॥

చ ర ణ ము

విత్తమందున నిరాశయున్ సమర - విజయంబును సత్యవ్రత దీక్షయు
చిత్తశుద్ధియున్ బ్రహ్మచర్యవం - సిద్ధిగలుగ నాశీర్వదింపుమో ॥గు॥

సీ. మిక్కిలికంటిసా ♦ మింగొల్చి కలశజు
మ్ములవిద్య కడముట్ట ♦ దెలిసినావు
బిరుదురామగల నం ♦ బరము లొక్కెడ మాపి
కేలగాజులు దొడి ♦ గించినావు
తూలించి మన్నీంద్ర ♦ నేలనాల్గుచెఱంగు
లొంగి బాపలకు దాన ♦ మొనగినావు
ఱెకిమీంద్ర రక్తంపు ♦ టేఱులం బాఱించి
పితరులం దృప్తిగా ♦ వించినావు

తే. గీ. తపసిమిన్నవు నాల్గు వే ♦ దములెఱుంగు
దిట్ట వాత్మైక వేద్యుండ ♦ వట్టి నీకు
దిన్నసగుభక్తి భాగీర ♦ ధీసుతుండు
శిష్యవరమాణు విదె నమ ♦ స్కృతియొనర్చు.

వ. అనవిని జామదగ్ని దేవవ్రతుం జేరదీసి బుజము దట్టుచు,

ఉ. నీసుగుణంబు లన్నియును ♦ నేవిని సంతసమందుచుంటి నెం
డే నరిరాజు నీకొరులు ♦ నేరిచి రిష్వాసవిద్య నాకడన్

భూసుర భూమిపాన్వయులు ♦ బోలరె నిన్నువరై నగాని శా
బానుః భవన్ని మిత్తమున ♦ భవ్యయశం బొనగూడెనాకుమన్.

ఉ. తమ్ముని పెండ్లి కంబను వ్వ ♦ ధాగోని తెచ్చి పరిత్యజించినా
విమ్మెయి తా ననాథయ ♦ యేద్భుచు నాశ్రయమందె, నన్నపా
యమ్మగు నాడుదాని యును ♦ రంటివి, దుర్యశమబ్బు, గావునన్
దమ్మునకిచ్చి పెండిలిరొు ♦ నర్చుచు నం పాఖ కాలకింపుమా.

వ. అనవిని యూపగేయుండును.

సాలయమారుతము - చతురశ్రగతి

ప॥ తెలియనిదేమున్నది సర్వజ్ఞులు-కలితధర్మవేత్తలు గురువర్యులు ॥తె॥
అ॥ ప॥ వలపుగలదుసాల్వుపై తనకని - పలికినందునపరిత్యజించితిని ॥తె॥

చరణము

చనువుమాలి కోపించినం జెప్ప .. జాలగాని కాలాహివిధంబున
ననను రాగ దాంపత్యము కుల నాశన కారణమగుగాదే తలపగ ॥తె॥

తే. గీ. సమధి కాశ్రితవత్సపా ♦ తముస నిట్టు
లంటిరేకాని వాసు జే ♦ వాంశజులు భృ
గూత్తములునైన మీాకు శి ♦ ష్యుడను నాకు
తప్పవనినేత గల్గునే ♦ యెప్పుడైన ?

వ. అనవిని జమదగ్ని కుమారుండును కోపించె.

ఉ. ఈ వనితాలలామయెడ ♦ నించుక లోపము గల్గబట్టియే
యీా విషయంబు మాాకు ♦ నిట్టుల వచ్చుట, మేముసెప్పుటల్,
నీవు తృణీకరించుటయు ♦ నేడు ఘటస్థములయ్యెః మూర్ఖ యెం
తేవిదు మింతమాత్రమున ♦ కీపె నధోగతిపాలు జేసెదే ?

బిలహరి - చతురశ్రగతి

ప॥ నాదయానతి జవ దాటెదవా - నన్ను నీవెఱుగవా శాంతనవా ॥నా॥
అ॥ ప॥ సాయకాగ్నిపాల్జేసి నిన్ను నీ
సహజన్ముని సమయింతు నిప్పుడే ॥నా॥

చరణము

వీరుడవని గర్వించితివా నను - భీరువుగా భావించితివా ।।వీరు।।
పోరి నాపరశుధార తెలియువా - రౌరా నెనిమిన మాత్రమున పొలియుదవ ।।నా।।

తే. గీ. ఈపెకీవద్దియే గతి ♦ జూపవేని
యెవ్వడేని మజ్జోక డావ ♦ రింపడేని
దురిత మీయుమ యూావవ ♦ దుర్మదమున
నేయు, తద్దురితంబు ని ♦ జ్జైందుజామ్మ.

తే. గీ. సహజవైరంబు క్షత్రియ ♦ జాతియందు
నాకుగలదది మూసు క్షో ♦ న్నాడ కొంత
కాలమునుండి ఛాత్రులు ♦ గా గొని మిము,
కానటివై రొండల్ రగుల జే ♦ సితిగి మగల.

వ. అని పల్కు జామదగ్న్యుంగని భీష్ముండిను.

ఉ. అంటివిగాని సేయుగల ♦ నా సమరమ్ము గుణాకరుత్రోడ, ను
క్కంటికి సాటివచ్చు మొన ♦ గాడవు నీ కెరుకేది? పోర న
న్నంటిన నీకు గల్గునొకో కీరితి? ♦ నేను జయంబునంది పే
ర్గాంటినయేని యూపయిపు ♦ లోకులు కాకులు గేలినేయరే?

తే. గీ. అనినవిని జామదగ్ని కో ♦ లానలంబు
వోలె మండుచు మొనలేర్చి పో ♦ ర గమ్మ
వేగ వాక్పూరతల్ గట్టి ♦ పెట్టు మనగ
కనలి యిట్లనె గురునితో ♦ గంగకొడుకు.

కేదారగౌళ - ఆది

ప।। నీకఱపినయానాటిమేటి విలు - నేరువుజవిజూచెదవో గురువ ।।నీ।।

అ।। ప।। భూసురుడవు, గురుడవు, పూజ్యుడవని - నే సందేహించితి సింతద
నుక నీ సమరము తప్పక వచ్చెగాన - నిదె తెల్పితి నీతోనని నేయగ ।।నీ।।

చ. ఇరువది యొక్కమారు ధర ♦ నేశుల గెల్చితినంచు సారెకున్
గరువము లాడుచుందు వట ? ♦ నా దరి కుంజరవార వీరికే

సరి సురవాహినీసుతుడు ♦ శాంతనవుం డుదయింప కుంటచే
బిరుదము సెల్లె; జెల్లవిక ♦ బీరము, లీవును నన్నెఱుంగ వే.

తే. గీ. నేనటేటికి మున్ను మీ ♦ సేవజేసి
నే గడించిన విద్యయే ♦ నేడు నాకు
సమరతలమందు నిలుచు శా ♦ సనగ, విజయ
కరము తావక పదభక్తి ♦ గురువరేణ్య!

కం. అనిపల్కి సర్వమయ్యది
చనుదెంచియు విన్నవించి ♦ సత్యవతికి; నో
య్యనవచ్చి రథముడిగి వా
కొనియెన్ గాంగేయుడిట్లు ♦ గురువర్యుని తోన్.

సీ. భృగుకుల క్షీరవా ♦ ర్నిధి పూర్ణచంద్రాయ
పరశురామాయ తు ♦ భ్యం నమోస్తు
సజ్జన స్తుతిపాత్ర ♦ జమదగ్ని పుత్రాయ
పరశురామాయ తు ♦ భ్యం నమోస్తు
సమరశోషిత సమ ♦ స్త ధరాధి నాథాయ
పరశురామాయ తు ♦ భ్యం నమోస్తు
అఖిలాస్త్ర శస్త్ర వి♦ ద్యా రహస్యజ్ఞాయ
పరశురామాయ తు ♦ భ్యం నమోస్తు

తే. గీ. పుణ్యశీలాయ భూరిత ♦ పోధనాయ
సచ్చిదానంద రూపాయ ♦ శాశ్వతాయ
గురువరేణ్యాయ ధారుణీ ♦ సురవరాయ
వాసుదేవాంశజాయ తు ♦ భ్యం నమోస్తు.

తే. గీ. నేను రథమందు మీరలు క్షో ♦ ణీతలమున
నిలిచి యుద్ధంబుసేయుట ♦ నీతిగాదు
మీరరద మెక్కుదురొ? నన్ను ♦ దేరువాయు
మందురో సెలవిండు మ ♦ హానుభావ.

వ. అనిపల్కు గాంగేయుంగని సంతసించుచు నత్తపసితే డిట్లనియె.

బాగు — ఆది

ప॥ కరమానందించితి నీ భక్తికి - గాంగేయా భువనత్రయగేయ ॥క॥

అ॥ ప॥ నెఱినమస్కారమొనరుపను న్నెడ - నను శపించి చంపుమనీ పాటికి॥క॥

చ॥ భళిభళిరా భారతవీరుండవు - భాగ్యమేమనుదు నా శిష్యుండవు
బలునోములు దానేమినోచినో - భాగీరథి కన్గంట కబ్బెయి ॥క॥

క. అనివల్కి జామదగ్న్యయు
మునుకొని రథమెక్కి సమర ♦ మున ముంగల భీ
ష్మునిపై శరవర్షము గురి
సిన నయ్యవి రథము చెంత ♦ చేరకయుండన్.

తే. గీ. శంతనుసుతుండు వారించి ♦ సరగనొక్క
భల్లమున భృగురాముని ♦ విల్లు విఱుగ
గొట్ట నొండొక విలుగొని ♦ కుపితుడగుచు
రాము చేసెను దీవ్రమా ♦ ర్గణశతంబు.

క. సాయక నికరమ్మున గాం
గేయుడు గురుసంగరమున ♦ గిఱిగొని నేయన్
గాయమ్ము సుడివడన్ మూ
ర్ఛాయుతుండగుచు సోలె ♦ నరదమ్ము పయిన్.

వ. అంత గొంతతడవునకు మూర్ఛదేరి,

నాట — చతురశ్రగతి

ప॥ వీరుడవగుదువు గాంగేయా నా - విల్లు నుసిమి మూర్ఛిల్ల జేసితివి॥వీరు॥

అ॥ప॥ లేరునీకన్న ముల్లోకమ్ముల - పోరి వనొన్నెర్చు శూరమ్మనుష్యులు॥వీరు॥

చరణము

బాగుబాగు, గర్వింపవలదునీ - పడుచుతనపు బింకమ్ములు మానుము
సాగవింక నీయాటలునాకడ - సరి నేటికోడనే నీయాయువు ॥వీరు॥

తే. గీ అనుచు మరుదస్త్రమేయ గు ♦ హ్యాకశరమున
దానివారించె శంతనా ♦ త్మజుడు మఱియు
పావకాస్త్ర ప్రయోగంబు ♦ వారుణాస్త్ర
నిహతిభంగించె దానమా ♦ నియును గిసిసి.

తే. గీ. సాయకంబొందు భీష్ముడప ♦ త్కుష్ఠలమున
నాటసేయగ నొచ్చినకెం ♦ తనుమతుండు
నరదమూప సోలిపడియెనం ♦ తంతనున్న
తపను తంబయు నార్ద్ర చె ♦ తస్కుముడిగి.

తే. గీ కురుబలుడగు మూర్ఛదేతెచ్చి ♦ గున్నవరుసి
మగిడి సాయకధారాసి ♦ మగ్న జేసి
కదిసిపోరాడ నిట్టు లి ♦ ర్వురయు రెండు
దివసములు సెల్లె మఱునాటి ♦ బవరమందు.

మంజరులు

గంగకొడుకు మూర్ఛిల్లజేయ భార్గవుం డొగిసి ధృతిమించి
గాంగేయున్ మూర్ఛిల్లజేసె భార్గవుడునూతున్ వధించి
తెలిసిరొక్కింత పౌరిభాగీరథీసుతుడు నాటిరేయి
కలలోవసువులు మోహనాస్త్రమిడ గన్న దెలిచి దళవాయి
మఱునాటి కయ్యమున దదస్త్రముగా గురునిపై నేయగడగ
దరికేగుదెంచి నారదుండుత్తరమునం బల్కెవడిగ.

భైరవి—రూపకము

ప॥ ఏయకుమేయకుమో గాం - గేయమోహనాస్త్రంబిటు ॥ఏయ॥
అ॥ ప॥ ఓయన్నా గురుడుదీని - కుపసంహారమ్ము దెలియు ॥ఏయ॥
1. గురునవమానించు టెపుడు - కూడనివని నీకోట్లకు
కురుకుల వర్ధనుడ వస్త్ర - కోవిదుడవు నీతివిదుడ ॥ఏ॥
2. పరశురాముకడ నేర్చిన - శరవిద్యరొ చూపుకునని
స్మరియించితివస్త్రదత్త - శరమీవిధి సత్యరతుడ ॥ఏ॥

ఉ. మీరిన కౌతుకంబునను ♦ మీగురుశిష్యుల సంగరంబు గ
న్నారగన వ్విమానచరు ♦ లై సురలోకనమందు నిల్వగా
వీరుడవై, ధనుర్నిగమ ♦ వేత్తలకెల్లను మిన్నవై వను
స్మారితమోహనాస్త్రమున ♦ సత్యముదప్పిగురున్ జయించెదే.

వ. అనవిని కురుప్రవరుండును.

తే. గీ. 'గురుని తో నాపగేయుఁ డెంతొ ॥ గర్వములాడె
నన్నమాట సేయక ॥ నటు మోహా
నాత్రమేయక మాన నే ॥ కైన గాని,
శంతనుసుతుండు రాముచే ॥ జావవలయు
కానిచో లోంగవలయు భా ॥ర్గవుడ నాకు.

క. అనిన విని నారదుఁడు గ
న్నన వసువులచేత భీష్ము ॥ నకు జెప్పింపన్
వినెనాతడు; జమదగ్నియు
బనివడి నందనున కిట్లు ॥ వాకొనె నంతన్.

కాంభోజి - ఖండగతి

ప॥ చాలింపుమా పోరు - శాంతనవపుత్రు నేడు
సామాన్యుడితడు గాడు - భువనత్రయవీరుడు ॥చా॥

అ॥ ప॥ పోలదీ దీర్ఘవైరము విప్రజాతికి
యాలింప లేదెనీవు బ్రా - హ్మణన్యతుణాం కోపమన ॥చా॥

చరణము

విసివి వేసారితివి - వసుమతీనాయకుల
గసిమసంగిరణంబుల - నిరువదియొక్క మారు ॥వి॥
వసుమార్తి నితని నీ - వశముగాదు వధింప
స్వచ్ఛందజీవి యతడు సా - టండీ నామాటలు విని ॥చా॥

తే. గీ. శాపమును చాపమును ముఖ్య ॥ సాధనములు
శత్రువధకునై బ్రాహ్మణ ॥ క్షత్రియులకు;
శాపలము తాపసులమందు; ॥ పాపకృత్య
మేటి కీయని సేత శాం ॥ తింపుమయ్య!

క. జమదగ్ని పరశురాముని
సమరము మానుమని చెప్ప ॥ సమయంబున న

య్యమరనదీసుతుఁడుం జని
నమస్కృతి యొనర్చి గురునకు ♦ సలిపి యనెనిటులన్.

ఉ. అంచిత బాహువిక్రమున ♦ బోరసినట్టి పవమానాస్త్ర మా
ర్గించి ననున్‌జయించితి 'వౌ ♦ కెంచుక బంటుతనమ్మునన్ గురు
స్మించెను శిష్యుఁడంచు' నను ♦ మింటను మేదిని సన్నుతింప నా
లించుచు గర్ణపేయముగ, ♦ నే మనుజుం జిరకాలజీవినై.

వ. అని పల్కి యంబం గని.

ఉ. వాఁడిమగండు వీనిగెలు ♦ వందరి మేరికి నైనగాదు, పో
రాడితి శక్తికిన్మిగిలి, ♦ యంతయు నిష్ఫలమయ్యె, పొమ్ము నీ
వేడకుఁబోయెదో యచటి, ♦ కె తయు బ్రజ్ఞకు బెన్గులాడితిం
బోడిమితప్పె గార్య మిఁక ♦ బోదుపరాభవ మెన్ని భంగులన్.

వ అని పల్కినంబయు దపంబు పెంపున జన్మాంతరంబున నైనను భీష్ముని వధింతుననుచు యత్నేచ్ఛం జనియె నంత బరశురాముండును గాంగేయుని వీడ్కొలిపి మహేంద్రశైలంబునకుం జన భీష్ముండు నిల్లునేఁగి తద్వృత్తాంతంబెల్ల సత్యవతికి నివేదించి సంతసంబుననుండె.

శ్రీ

# మహాభారతము

## పాండవజననము

యమునా కళ్యాణి—ఆది

ప॥ పాండవ జననకథవినుడు శ్రుతి-పర్వముగా వినిపింతునేను-కురు ॥పా॥

అ॥ప॥ పుండరీకాక్షు బావమరందులు భండనపండితులగ్ని తేజులౌ॥పాం॥

చరణము

కామినీ భోగరసలాలసుడై - కాశీరాజ తనూజలం దగిలి

కాముకేళి మితిమీరి దేహముం - గలసె పెద్దల విచిత్రవీర్యుడున్॥

సీ. అంత సత్యవతి శో ♦ కార్ణవ మగ్నయై

యని నొక్కనాడు శాం ♦ తనవుతోడ

నాయనా! గాంగేయ ♦ నీయెఱుంగని దెద్ది

నీ సోదరుల్ మర ♦ ణించిరట్లు;

కురువంశమునకు నొ ♦ క్కరుడవే మిగిలి యు

న్నాడవు, ముగియు నీ ♦ తోడసదియు

కువలయాప్తుడు మొద ♦ లొక్కని నేటివఱకు వ

చ్చిన వంశ మింక వి ♦ చ్ఛిన్నమగును

తే. గీ. తల్లిదండ్రులనుడి జవ ♦ దాటవెపుడు

మత్ప్రియంబుగ ధారుణీ ♦ మండలంబు

నీవ చేకొని యేలుమో ♦ యీ కుమార!

తగ వివాహమ్ముగమ్ము నం ♦ తతిని గనుము.

వ. అన విని భీష్ముండును

తోడి—త్రిపుట

ప॥ ఆడితప్పుట దోసముగద - అమ్మరో! నీవే యెఱుంగుదు ॥నాడి॥

అ॥ ప॥ నాడు రాజ్య పరిత్యాగముగా - బ్రహ్మచర్య వ్రత దీక్షయున్
జరుప బ్రతినఁబూనినన్ని నేడీ - జాడ నడచిన బరిహసింపరె ॥అ॥

చరణము

హిమకరుడు శైత్యమర్కుడు తే - జము వాయుతాళను దుష్టత్వమును
క్రమత విడిచిన విడుతునేనా - గైకొనిన వ్రతమెన్నడేనియు ॥నాడి॥

క. నాదగు శపథంబూరక
పోదు, పృథివ్యాది పంచ ♦ భూతమ్ములు గం
ధాదిగుణమ్ముల విడువని
మాదిరి మత్కృత ప్రతిజ్ఞ ♦ మానను తల్లీ!

ఉ. హైహయ కారణంబున ధ ♦ రాధిపులన్ వధియింప నెల్లరన్
బాహుపరాక్రమాంచితుడు ♦ భార్గవరాముడు లోకమంతయున్
బాహుజశూన్యమై వెలయు ♦ నట్టున సంతతినిల్పి రంచితో
త్సాహ మెలర్ప బ్రాహ్మణులు ♦ తన్మృతరాజకులాంగనాళికిన్.

సీ. కావున నుత్తమ ♦ క్షత్రియక్షేత్రము
లందుజనించి బ్రా ♦ హ్మణులవలన
గలరనేకులు వంశ ♦ కరులగు క్షత్రియుల్;
మహితాత్మ పనఘు ధ ♦ ర్మస్వరూపు
విప్రోత్తము 'విచిత్ర ♦ వీర్యక్షేత్రము
లందు సంతతి నిల్పు' ♦ మని నిలుపుద
మనిన వాలించి స ♦ త్యవతి పారాశర్యు
జననంబు దెల్పి భీ ♦ ష్మునకు నమ్మ

తే. గీ. నింద్రుడీవంశముం బ్రతి ♦ ష్ఠించునంచు
వ్యాసభట్టారకుం దలం ♦ పగ నతండు
పింగళజటాభరంబు వె ♦ లుంగ, నీల
విగ్రహారాభరుచులు దీ ♦ పింపవచ్చె.

వ. వచ్చిన వానింగని

ధన్యాసి—రూపకము

ప॥ అక్క అగల్గి తలంచితి - నన్నా నిన్దపసిమిన్న ॥అ॥

అ॥ ప॥ నిక్కపుమాసినివి గాన - నీవరుడెంచితివి మంచి ॥అ॥

1 అవిధి గంధర్వనిహతు - డై చన చిత్రాంగదుండు
జీవమ్ముల్ద్రొరగినావి - చిత్రవీర్యుడున్ క్షయచే ॥న॥

2. వినుమీవంశము నేటికి - విచ్ఛిన్నము కానయ్యెను
నినుదలంచితింగావున - నీవీకుల ముద్ధరింపు ॥మ॥

ఉ. ఆయతకీర్తి దండ్రికి బ్రి ♦ యంబొనరింప బ్రతిజ్ఞజేసి గాం
గేయుడు పెండ్లి మానుకొనె, ♦ కేవల మీకురువంశ మాగి పో
నాయెను, శాస్త్రసమ్మతమె ♦ యాగద! యంబికయందు దేవర
న్యాయముమై నపత్యజన ♦ నం బెలయించి కులంబు నిల్పుమా.

వ. అనవిని వేదవ్యాసుండును.

ఉ. ఆకలముల్గ్రసించుచు న ♦ నాంతర భూపుల చక్రదేంద్రియో
ద్రేకము రూపుమాపి నియ ♦ తిన్ విషయాన్యలపొంతబోక దూ
రీకృత పాపులౌ మునిప ♦ రేణ్యుల కీతగులమ్ము లేల? కాం
తాకనకాభిలాష జడ ♦ దారులకుం గడుదూర మమ్మరో!

ఉ. తాలిమి తన్ను గన్న తలి ♦ దండ్రులుజెప్పినయట్లొనర్చుచో
నాలుగువేదము ల్చదివి ♦ నంత ఫలమ్ము చిత్తజ్ఞులాల వా
వేలుపుటవ్వ బోలుచువు ♦ వెన్నెలరేని కులంబునిల్పుడు
న్నీలలితోక్తులం బరిగ ♦ ణించి మునీశులు మెచ్చునట్లుగన్.

తే. గీ. అనినవిని నాటిరేయి స ♦ త్యవతి యంపె
ఋతుమతియు శుచిస్నాతయు ♦ మతిమతి యగు
నంబికన్ వ్యాసుకడకు గు ♦ లంబునిల్ప
నగు తనూభవు గనుమంచు ♦ నవ్వనితయు.

మంజరులు

మునినాథుని కపిలగడ్డమ్ము జడ - లును గన్నులుబరికించి
కనుంగవ మొగిచి తెలివకయుండెన్ - మనమ్మున సేవగించి

దానికిం బుత్రదానంబుసేసి - తపసియునెప్పటి తపసకేగి
దీనికంధుఁడగు కొడుకుఁబుట్టు మా - తృదోషముననని యువిదకి
మఱునాడంబాలికనంప నా పె - వెఱచి తెల్లనై యున్న
బరికించి పాండురోగి పుట్టునని - పలికె న తపసిమిన్న
అంబికకున్ ధృతరాష్ట్రుండుదయించె - నంధుఁడై మహాబలుఁడై
యంబాలికకుం బాండురా జుదయ - మయ్యె బాండుదేహుండై.

క. సత్యవతి మనమ్మున
వనరఁ బరాశరతనూజుఁ • బ్రార్థించి సుల
క్షణ యుక్తుఁడైన పుత్రుని
గనుమని నియమించె నంబి • కను తా మరలన్.

ఉ. రోసిమునీంద్రు నవ్వికృత • రూపమునారసి నెమ్మనమ్మునన్
దాసినలంకరించి జడ • దారికడన్ శయనింప బంచినన్
వ్యాసున కిష్టభోగము ల • వారిగ గూర్చిన దాసి త్వపుసిన్
జేసి తనూజు నొక్కనిఁ గ • నెన్ విదురున్ సమవర్తి సన్నిభున్.

వ. అంత ధృతరాష్ట్ర పాండుకుమారులు భీష్మరక్షితులై పెరుగుచు నుపనయనానంతరంబున నధ్యయనం బొనరించి సర్వవిద్యాపరిపూర్ణులై యున్నంత గాంగేయుం డాంబికేయుని రాజ్యాభిషిక్తుం గావించి, విల్లును విదురుబుద్ధియును సహాయంబులుగా రాజ్యంబు రక్షించుచున్నంత హాస్తిపురంబు రాజధానిగా ధృతరాష్ట్రుండు రాజ్యంబుసేయుచు నారూఢయౌవనుండగు నంత శాంతనవుం డతనికి గాంధారపతియగు సుబలుకూతు గాంధారియను సుందరీమణిం బరిణయంబు గావింప నా గాంధారియుం బరపురుష సందర్శనంబు పరిహరించి నేత్రపట్టంబు గట్టుకొనియుండె నంత నాంబికేయుండు శ్యాలకుండగు శకునిసహితంబుగ గజనగరంబున కరుదెంచి యేకలగ్నంబున నధికసంతానంబును గన సత్యవ్రతమున్నగు మరదండ్రం బదుండ్రను మఱియు నూర్గురుకన్నియలను వివాహం బయ్యె నింతలో యాదవ విభుండగు శూరుండనువాఁడు తన పెద్ద కూతురగు వసుదేవు చెలియలిం బృథయనుదాని నపుత్రకుండగు

కుంతిభోజునకు గూఁతురై నొసంగ నాపెయు దండ్రియింటఁ బోషించు
నతిథిజనులకుఁ బ్రియముగాఁ బెట్టుచు నొక్కనాఁ డతిథియై వచ్చిన
దుర్వాసమునకుఁ గోరిన యాహారంబు పెట్టిన నమ్మునీంద్రుం డప్పుడే
యొక్క మంత్రం బుపదేశించి 'యీ మంత్రంబున నే వేల్పు
నారాధింతువో యా వేల్పు నీకోరినపుత్రకుల నొసఁగునని' యెఱింగించి
యథేచ్ఛం జనియె నంత నాకన్నియ తన్మంత్రశక్తి యెఱుంగఁ దలఁచి
యొక్కనాఁ డేకాంతంబున గంగకడకుఁ జని మంత్రపఠనం బొనర్చుచు
నాదిత్యుం బోలు కుమారుంగనఁ దలంచుచు భాస్కరున కర్ఘ్యమ్మెత్తి
యిట్లు వినుతింపఁదొడఁగె.

ఝంఝూటి.—చతురశ్రగతి

ప॥ దేవదేవ శరణాగతరక్షక - దీనపోషణ ప్రభో నమోనమో ॥దేవ॥
అ॥ ప॥ సేవితాశేష దేవనికర - జీవబాంధవ ప్రభో నమోనమో ॥దేవ॥
1. ఆదిదేవ సకలాగమసన్నుత - వేదవేద్య పరమాత్మా నమోనమో
మోదితాఖిలచరాచర భూతసముదాయ దినేశా నమోనమో ॥దేవ॥
2. సారచండకర ఛాయామనోహర - సుప్రసన్న పరంజ్యోతి నమోనమో
ఘోరపాతకనిదూరభంజన - పారిజాతభవదూర నమోనమో ॥దేవ॥

క. అని ప్రార్థించిన కుంతి
వనజాయతనేత్రుఁ డకట • వచ్చి నిలుండఁగన్
గని ఘనలజ్జాభయములు
పెనఁగొనఁగేల్మోడ్చి పలికె • పృథ భానునితోన్.

చ. నిలువుము కొంతదూరమున • నీకిది ధర్మముగాదు, బాల్య చా
పలమున మందరాగమున • పాయ మెఱుంగక మంత్రమున్ బిగిం
చెలిమిననున్ స్మరించితిని • తేకువమాలి, దయామయుండ వీ
యలజడిమాన్పు మోతపసియమ్మెయి? మహాత్మ! క్షమింపుమానసున్.

ఉ. మాటికి 'కుంతిభోజుని తొ • మ్మారిత పెండిలిగాకమున్నె తా
జేటును బాటెఱుంగక యి • నీ! చెడుదారి జరించె' నంచు గ
న్నాటుగ నమ్మలక్కలు ప • జాడున బెన్పఁగొనంగ జూతు రీ
లాటిపి నూరునోముఁబొక • అంతున బోవుగదా దివాకరా!

ఉ. చాలి నిజానిజస్థ్రుల వి ♦ చారణసేయగలారు లేరు, క
ల్లోలముబెంచి తప్పుపట్టి ♦ లోకులనైజనుల; గడ్డిపోచకుం
బోలనివారునైతమను ♦ ముంగలనీడ్తురు కాలుద్రువ్వి క
య్యాలకు, నాడువాండ్ర తగ ♦ వాదరు దిద్దగ పెద్దలేజుమీ.

గీ. ఇంతయేటికి లోకులే ♦ మే మొసూడి
పోనుకొందురటంచు నా ♦ పోవనేల ?
గంగలో దానమాడగా ♦ గదలివచ్చి
యింటికిం జంక బిడ్డతో ♦ నెట్లుపోదు ?

భూపాల—రూపకము

వ॥ ఏమానవజాతి దాన - నీవో బృందారకుండ ॥వే॥
వ॥ వ॥ యీమాదిరి తగులంబెం - దేనిగలదె సర్వజ్ఞుడ ॥వే॥
1. సకలజగంబులకు నీవ - సాక్షీభూతుడవుగావ
ప్రకటకన్యకాప్రతమ్మ - భంగింతు నీ యీగాధమ్మ ॥యే॥
2. నాయపరాధము సైపుము - నాకీయులజడి బాపుము
నీయంతటివానికెట్లు - సేరుతు నీతి విధింపగ ॥నే॥

తే. గీ. తాసయై తలనిడుకొని ♦ కాసిమాట
కన్నవారికి దలవంపు ♦ గా జిరమ్ము
బ్రతుకుకన్నను నభిమాన ♦ వతియటన్న
పేరువడి యొక్కవూట జీ ♦ వింప మేలు.

వ. అనవిని భానుండును,

సీ. పొలతిరమ్మనవచ్చి ♦ పొమ్మనబోవ నీ
యింటిబంటని యను ♦ కొంటివేమొ ?
యూరకేబోవ్వ న ♦ న్నారసి దేవతల్
పరిహాసింపరో ? మంత్ర ♦ పటిమ చెడదొ ?
దేవమానవుల కిం ♦ దేనిట్టి సంబంధ
మున్నట్టి దృష్టాంత ♦ ములును గలవు
కను మహాల్యాశచీ ♦ కాంతులకూటము
కన్యకాత్వమ్ముభం ♦ గమ్ముగాదు

తే. గీ దాశకన్యకతోడ బ ♦ దాశరుండు
తగులొనర్పడా ? తెలియుకుం ♦ డంగ నోరుల
కీడు హాస్యమ్ము గాపాడు ♦ భారమెల్ల
నాయదియె, సంశయింపకు ♦ తోయజాక్షి !

క. అనిపల్కి కన్యకాత్వం
బనపాయస్థితి వహించు ♦ నట్లు వరంబి
చ్చి సహాంభోజహితుండు
స్వనజాయుతదారులోచ ♦ నం గరుణించెన్.

కళ్యాణి - ఆది

ప॥ సద్యోగర్భంబున బుత్రుండొకడు - జననమయ్యె గుంతీవనితామణికి ॥స॥

అ॥ప॥ ఖద్యోతసమానతేజము నహజ - కవచకుండలయుగమ్ము దీపింప ॥స॥

చరణము

చెన్నుమీరు నెమ్మోమున సొంపైన - కన్నుదోయి బంగరుమైచాయయు
పున్నమవెన్నెలనేలు నునుపాల - బుగ్గలున్ సన్ననాసికనుగల్గి ॥స॥

క. అంతనొకంతకు గుందుచు
సంతోషమ్మును విచార ♦ సంభ్రమ భయముల్
వింతగ దన్నలముకొనం
గొంతవడికి బాలునెత్తు ♦ కొని తలపోయున్.

సీ. శిశువు నెత్తుకయిల్లు ♦ జేరుదునా ? తల్లి
దండ్రులు నన్నన్య ♦ థాతలంతు
రీతనూజాతునిం ♦ దే డించి పోదునా ?
కరమ పుట్టు నేయుగా ♦ గాళ్ళురావు
మంత్రప్రభావనం ♦ భవుడీతడందునా ?
నామాట లెవ్వరు ♦ న్నమ్మబోరు
మఱియీ రహస్యమె ♦ ల్లరెఱింగిరా ? యువి
వాహితనై యుండ ♦ వలసివచ్చు

తే. గీ మానినాకేటి కీపాడు ♦ మంత్రమిచ్చె
నిచ్చెబో దీని నేబరి ♦ క్షింపనేల ?

వ. ఇట్లు విచారించుచు గులసతు లూరడింప నూరడిల్లి కొనకు శత శృంగంబున కుత్తర భాగంబున దపంబు సేయుచు నొక్కనాడు బ్రహ్మలోకంబున కేగు మహర్షులం గని తానసపత్యుం డగుటచే వారలతో బోనేగమికిఁ గడుంగడు జింతించి, దుర్వాస ప్రసాదిత మంత్ర ప్రభావంబున సంతానంబు వడయుననుగునని కుంతివలన నెరింగి ధర్మదేవత నారాధించి క్షేత్రజుం బడయుమని కుంతికి నియోగింప నాపెయు మంత్రంబు విధిమంతంబు జేసి ధర్ముని నారాధించి గర్భంబుదాల్చి సంవత్సరంబు పరిపూర్ణంబైన.

తే. గీ. సకల శాత్రవ విజయ తే ♦ జమున నిఖిల
దిశలు వెలుగంగ, భాస్కరా ♦ ద్యగ్రహమ్ము
లొప్పమేలుగ నాభిజి ♦ త్తోదయమున
గురుకుల విభూషణున్ యుధి ♦ ష్ఠిరుని గనియె

సీ. ఆవార్త దెలిసి తా ♦ ననహానమ్మునను గాం
ధారియు నుదరసం ♦ తాడనమున
గర్భ పాతంబును ♦ గావించుకొన వ్యాసు
డెఱిగి చయ్యన నట ♦ కరుగుదెంచి
యొగి మాంసపేశి నే ♦ కోత్తర శతఖండ
ములుగా విభాగించి ♦ పోరె నంత
పాండుభూపతి గంధ ♦ వహునంశమున నొక్క
తనయుని గలిగింపు ♦ మనిన గుంతి

తే. గీ. యనిల దేవు నారాధించి ♦ యతుల వీర్య
విక్రమానూను గనియె నా ♦ భీమసేను
నా దినమ్మున గాంధారి ♦ కగ్రనంద
నుండు కరిపురి దుర్యోధ ♦ నుండు వుట్టె.

రాగ—చతురశ్రగతి

ప॥ కలియంశంబునదుర్యోధనుడా-గాంధారికి సుతుడై జన్మించెను. ॥కలి॥
అ॥ప॥ జలదమ్ములుపిడుగులజడిగురియగ - జలజహితుడు తేజోహీనతగన॥

చరణము

కాక ఘూక జంబుకరాసభగణ - క్రవ్యాద రవములు పిక్కటిల్ల
భూకంపముగా నాదిశేషుండు - చీకాకున భీతిలి సొమ్మసిల్ల ॥గలి॥

తే. గీ. అటజనించె వైశ్యాపుతు ♦ డగు యుయుత్సు
డొక్క-క దినమ్మున వారగా ♦ నుద్భవించి
రంధనృపతికి దుశ్శాస ♦ నాది సుతులు
శతము, నొక్క- పుత్రికయు ♦ దుస్సల యనంగ.

వ. అంత నొక్క-నాడాంబికేయుకడకు భీష్మ విదురాది బంధుజనంబు లరుదెంచి.

కాఫీ—చతురశ్ర

ప॥ దుర్యోధనుజన్మంబున బెక్కు-లు-దుర్నిమిత్తములుతోచెంగావున ॥దు॥
అ॥ప॥ ఆర్యసమ్మతంబతనిదూషించి - యనపాయస్థితినుండుటెల్లరకు ॥దు॥

చరణము

కులమునకు జగమ్మునకపాయమ్ము-సలుపు పూరుషాధముని దూషించి
కులము జగముసెటులేని గావాడు-కొంటయే ధర్మమగుకురునాథా ॥దు॥

చ. అనవిని పుత్రమోహమున ♦ నాధృతరాష్ట్రుడు మిన్నకుండె; కా
ననమున బాండురాజొక ది ♦ నమ్మున వాసవుబోలు పుత్రకున్
గనుమన గుంతియున్ దివిజ ♦ నాథుదలంచి మునీంద్రదత్తమం
త్రవిధుతి దత్ప్రసాదమున ♦ దాగనె నర్జును బాపవర్జునన్.

తే. గీ. ఇంద్రునోడించి ఖాండవ ♦ మందహించు,
రాజసూయిగా జేయు న ♦ గ్రజుని, రిపుల
గెలుచు సురలచే దివ్యాస్త్ర ♦ ములగ్రహించి
వాసవియటంచు నాకాశ ♦ వాణి పలికె.

వ. ఇట్లు పాండునరపతి పుత్రత్రితయంబువడసి త్రిభువనరాజ్యమ్ము వడసి నంతగ సంతసిల్లి కుమారులతోడి వినోదంబుల దగిలియున్నంత నొక్క-నాడు మాద్రి యేకాంతమున నిట్లనియె.

సావేరి — త్రిపుట

ప॥ బ్రతికిసార్థకమేమి యీగతి - ప్రాణనాథ యుష్మత్పతిన్నై ॥బ్ర॥

అ॥ ప్రతికిబరువుగ నిహవరిమ్ములకు - జెడి సతంబు సరర్థకంబుగ ॥బ్ర॥

చరణము

కనియె ముగ్గుర గుంతి, నూర్గుర - గనియెనా గాంధారిపుత్రుల

కనుగొనన్ గొడ్రాలిపుట్టుక - కన్న మరితమములేదు సతులకు ॥బ్రతి॥

చ. కొడుకుల ముగ్గురి గనియె • కుంతి మహా త్తర మంత్రశక్తి పెం

పడర యమానిలేంద్రుల కృ • పానిలభ్యాతి ధర్మపద్ధతిన్

గడగి తదీయ మంత్రి మన • కంప వహించి యనుగ్రహించుచో

గొడుకుల గాంచగల్గుకు న • కుంతిత ధర్మపథ ప్రవిష్టనై.

ద్విపద

అనవిని పాండురా - జట్లు సేయింప

వనిత వేవేగ మా - శ్వినులదలంప

జననమొందిరి నకుల - సహదేవులనగ

తనయులు కవలవా - రినతేజులనగ

విని వసుదేవు డ - వ్విధమెల్ల కడకు

తన పురోహితు గశ్య - పుని బంపె నటకు

చౌలోపనయనములు - సలిపి యుధ్యయన

లోలురంజేసె బా - లుర గశ్యపుండు.

శ్రీ

# మహాభారతము

## కురుపాండవాభ్యుదయము

ఆనందభైరవి — ఖండగతి

ప॥ కురుపాండవాభ్యుదయ - చరిత మాకర్ణించి
నిరుపమానందవిమలవా - ర్నిధిం దేలుడు తలంపుడు ॥కురు॥

అ॥ ప॥ పరమాస్త్రశస్త్ర సం - పన్నులా ధృతరాష్ట్ర
పాండురాజకుమారులు - వీరులునధీరులు ॥కురు॥

చరణము

కాంతారమున పాండు - శోకనాడు మాద్రితో
గలసి పంచత్వమందె - మునిశాపము దీపక ॥కురు॥
శాంతుతో మాద్రి సహ - గమనముం జేసె తన
సంతాపమా కుంతికి - నప్పగించుధృతిమీరి

సీ. అచటిమానులు కుంతి • నాపె పుత్రకుల నా
రార్చి గొంపోయి రా • హాస్తిపురికి
దివిజసన్నిభుల శాం • తవుల నా ధార్త రా
ష్ట్రశతంబు విదుర భీ • ష్మ ప్రభృతులు
గాంచి యెంతయు బ్రమో • దించి రొక్క తపస్వి
జరిగినవృత్తాంత • మెఱుకపఱచి
మునుల నెల్లరను దో • డ్కొని చనె, నంత సా
త్యవతేయముఖ్యాల • యనుమతమున

తే. గీ. నెలమి బరలోకవిధుల జే • యించె పాండు
విభున కాధర్మనిధుడగు • విదురుడప్పు
డన్నియుం దీఱినంత నే • కాంతమునగను
వ్యాసభగవానుడసియె స • త్యవతితోడ.

చ. తనువులు బుద్బుదంబుల వి ◆ ధాన సహాక్షణభంగురంబు లెం
దును సిరులెండమావులటు ◆ యుర్వి సుఖోక్తులు దురంత దుఃఖ భా
జనమగు ఘోరసంసృతి ◆ సాగర సిస్తరణంబు, మేర మీ
రినయది పాపమెల్లెడల ◆ తేపటికిన్ననుసేడె మేలగున్.

మ. దురితారంభు లధర్మమార్గచరు లీ ◆ దుర్యోధనాదుల్ ప్రియం
బటి గాటింతురు పాండవేయుల ననూ ◆ యాగ్రస్తులై, యంధరా
జు రయం బింకిట తత్ఫలంబనుభవిం ◆ చున్ మీరలీదారుణం
బరయం బోక తపోవనంబు వనుడ ◆ మ్మా! నేడె మున్ముందుగన్.

వ. అనిన విని సత్యవతి యంబికాంబాలికలం దోడ్కొని వనంబునకుం జని ఘోరతపం బొనర్చి కొండొక కాలంబునకు శరీరమ్ము విడిచి పుణ్యగతికిం బోయె నిట పాండవులు ధృతరాష్ట్రు నియ్యాంబునం గురుకుమారులతోపాటు పెరుగుచు నొక్కనాడు క్రీడారతులై యున్నడనాగాయుతబలుండగు భీముండు కురుకుమారులందఱితోని.

సీ. ఆటలో నరటిపం ◆ డని మీఁదబడి పిండి
పిండిగా నెముకలు ◆ విఱుగగొట్టు
నదయుడై పెక్కండ ◆ నవనిపై బడద్రోసి
రొక్కపెట్టుగ వీపు ◆ లొలియ నీడ్చు
భుజముపై నిడుకొని ◆ పోయి కను ద్దేల
వైవ నీట న్ముంచి ◆ లేవ నెత్తు
తరువులం బట్టి యూ ◆ దళ్ళ గదల్చ పై
నున్న బాలకులు వం ◆ డ్లూడి పడగ

తే. గీ. డాసి కఱువలిపట్టి దు ◆ శ్శాసనాది
కురుకుమారుల కిట్టు లె ◆ గ్గులు నటలపగ
గని సహింపక కౌరవా ◆ గ్రజుడు దున్న
సేన సౌబలముఖ్యుల ◆ తో ననె నిటు.

పూర్వీకళ్యాణి—మిశ్రగతి

వ॥ నేల నాల్గుచెఱంగు లిమ్మగ - నేలువాడ నపాండవమ్ముగ ॥నేల॥
అ॥ వ॥ కూళ నా కౌంతేయమధ్యము - గూలనేసి బిరానతథ్యము॥ నేల॥

చరణము

రిపులవలె ధర్మజార్జునులగూ - డ్రేషుకులం జెఱసాలలో నిడి
యెపుడు దేవేంద్ర వైభవముగ - నిభపురం బిడి రాజధానిగ ॥నేల॥

తే. గీ. అని వితర్కించి యొక్కనా ♦ డనిలజాతు
నిద్రితుం దాట బంధించి ♦ నీట ద్రోయ
నతడు మేల్కని నిల్కు డ ♦ య్యావిసము ద్రెస్సె
మత్తకంధంగి నతిజేగ ♦ మరుపు వెడలి.

తే. గీ. పన్నగంబుల గఱపించె, ♦ పన్నమందు
విషము బెట్టించె; కోఱలు ♦ విఱిగె ఫణుల,
కమృతమై జీర్ణమయ్యె గ ♦ య్యన్న మిట్లు
నిష్ఫలములయ్యె జేతల ♦ న్నియు జివరకు.

వ. మఱియు నా దుర్యోధనుండు వెండియు బాండవుల కపాయంబు సేయ నుపాయంబు జింతించుచుండె నంత భీష్మ నియోగంబున గురుపాండవులు కృపద్రోణులకడ విలువిద్య గఱచుచుండిరి. మఱియునూతపుత్రుండగు రాధేయుండును ధనుర్విద్యాకౌశలంబున నర్జునునితోడ మచ్చరించుచు దుర్యోధనాభిమానియై యుండె. శిష్యులం దెల్లర నర్జునుం డస్త్రశస్త్రవిద్యాధికుండై భారద్వాజున కనుగ్రహపాత్రుండయ్యె నయ్యర్జునుతోడి విద్యామత్సరంబున జీకటి నాతం జేయనేరకుండునట్లు సేయు ద్రోణపుత్రుం డగు నశ్వత్థామ రహస్యంబుగ నన్నసాధకుం బిలిచి నరున కెన్నండు నంధకారంబున గుడువబెట్టకు మని చెప్ప నతండు నట్లు సేయుచుండ నొక్కనాటి రాత్రియం దింద్రనందనుం డన్నంబు దినునెడ గాలితాకున దీపంబు వోవ నభ్యాసవశంబునం గుడిచి యిట్లుపో విద్యలన్నియు సాధింప నగునని నిశ్చయించి నాటిరేయి జీకటియం దమ్ముల్లేయ నభ్యసించు చున్నంత వింటినారిపడి విని ద్రోణుం డయ్యెడ కరుదెంచి యర్జునుం గౌగిలించుకొని.

కేదారగౌళ — ఖండగతి

ప॥ నీకన్న విలుకాండ్రు - లేకుండ జేతు నా
గైకొన్న శపథమిదె - నాకు దగు శిష్యుడవు ॥నీ॥
అ॥ ప॥ నాకమునగాని భూ - లోకమునగాని లో
కైక వీరాగ్రణీ - దేవమానవులలో ॥నీక॥

చ ర ణ ము

అరయ నీవిలువిద్య - నభ్యసించితినిసే - నగ్ని వేశుని జామదగ్ని నారాధించి
చరితార్థమయ్యె నా - శరవిద్య నీకిడుట - పరివత్తువా రామచంద్రునకు వేయేల

ఉ. కన్నకుమారు నందయిన ♦ గల్లదా నీపయిగల్గు కూర్మి, నా
కన్న ధనుర్ధరుండవను ♦ ఖ్యాతివహింతువు, చల్లనయ్యె నా
కన్నులు, దానపాత్రుడవు ♦ గావున నిన్న ఖిలాస్త్రశస్త్ర సం
పన్నుని జేసి నావడిన ♦ బన్నము వాయుదు నింద్రనందనా!

క. అనిపల్కి కుంభసంభవు
డనిమిష రాట్తనయునకు బ్రి ♦ యమ్మున నెఱిగిం
చెను సంగ్రామమ్ముల తె
న్నును వివిధ వ్యూహభేద ♦ నోపాయములన్.

సం జ రు లు

కురుపాండవు లొకనాడు వేటకై - యరిగి మహారణ్యమున
దిరుగుచో దారిదప్పి వారికు - క్కురం బానమీపమున
శరము వేయు నేకలవ్యుడను నొక - యెఱుకుంగనుగొని మొఱుగ
బరికించి దానిముఖమునం దేడు - బాణమ్ములక్కజముగ
నేయునాసారమేయముం బాఱ - నీక్షించి రాకొమరులు
రోయుచున్ వచ్చి బోయనిగని రా - ద్రోణశిష్యులెల్లరును
గురుడెవ్వం డెవ్వనివాడవనగ - గురుడు నాకు ద్రోణుండు
హిరణ్యధన్వుండనువాడు తండ్రి - కిరాతాధినాధుండు.

క. అనినవిని కురుకుమారులు
వనమును వెడలి మగిడివచ్చి ♦ భారద్వాజున్

గని యయ్యాది తెల్పిరి, య
ర్జును డేకాంతిసుగనిట్లు ♦ ద్రోణున కనియెన్.

శ్రీరంజని—ఖండగతి

ప॥ నేటితో దీజ కుం - తీపుత్రుడు డర్జునుడు
మేటి విలుకాడన్న - మాట పలుమ్మాటికిని ॥నే॥

అ॥ ప॥ బూటకముగా దోకవ - నాటు గనుగొంటి ఘో
రాటవిం ద్రిజగ దే - కధనుష్మద్రగణిని ॥నే॥

చరణము

నాకన్న మీకన్న - నధికుండు చేత విలు
గైకొన్న వారిలో - గణనీయుడాతడే
నా కబ్బురముగొల్పె - నలిని శరలాఘవం
బేకలవ్యుండంట - మీకు శిష్యుండంట ॥నే॥

తే. గీ. ధనువుచేకొన్న వారిలో ♦ న నను మేటి
జేతునంచు బ్రతిజ్ఞ జే ♦ సితివి, వితథ
మయ్యె సత్యప్రతిజ్ఞుండ ♦ వలఘుచరిత!
ధరణిదేవాగ్రగణ్య! స ♦ ద్గురువరేణ్య!

చ. అనవిని కుంభసంభవుడు ♦ నాతని జూతమటంచు నర్జునుం
గొని చని యేకలవ్యుకడ ♦ కున్ దనకుం బ్రణమిల్లి శిష్యుడం
బనివడనభ్యసించితి భ ♦ వత్కృప నీయిషువిద్యనన్న యా
తనిగని యట్టులేని గురు ♦ దక్షిణయిమ్మన బోయడిట్లనెన్.

మధ్యమావతి—ఆది

ప॥ భళిభళీ! సుదినమయ్యె నేడునా-భాగ్యమేమందు మిముజూడగంటి॥
అ॥ ప॥ తలపమూర్తిత్రయస్వరూపులెంత - యుస్మీరుగురువర్యులుగావున॥

చరణము

ఇదెనాదేహం బిదెనాయర్థం - బిదియే నా పరిజన సమూహంబు
నదయా మీకిందేది కావలయు-నమ్ముదమునగైకొనుడానంగెదన్॥భ॥

తే. గీ. గురుఁడు కుడిచేతి పెనువ్రేలు ♦ గోసియిమ్ము
టన్న నయ్యేకలవ్యుండు ♦ నట్ల సంగె
వాని కడ్డాన బాణసం ♦ ధానలాఘ
వమ్ము చెడె, పార్థునకు మనో ♦ వ్యాధియుడిగె.

వ. ఇట్లు కుంభసంభవుండు జంభారినందను నద్వితీయధనుర్ధరుం డను యశంబు సార్థకంబు చేసి మఱియు మహాస్త్రంబు లెన్నియేని యుపదేశించి యొక్కనాఁడు కృతాస్త్రశస్త్రులయిన కురుకుమారుల విద్యాకౌశలంబు కృపగాంగేయ విదురశల్యశకుని సోమదత్త ధృతరాష్ట్రాదుల సమక్షంబునం జూప సమకట్టి ప్రేక్షాగారంబున సుందరీ బృందం బధివసించియుండ, గాంధారి ప్రక్కన కుంతీదేవి కూరుచుండి యుండ, బ్రాహ్మణ బృందం బొక్కెడ, భీష్మాది కురువృద్ధు లొకవంక, మంత్రిసామంతాదు లొకచక్కి, కవిగాయక వైతాళిక ప్రకరం బొక్కయెడఁ బరివేష్టించియుండ నాచార్యుండు ధర్మజప్రముఖశిష్యులు ధనుర్ధరులై వెన్వెంటరా శుక్లాంబర ధరుండై రంగమధ్యంబునం బ్రవేశించి విద్యాప్రదర్శనం బొనర్ప శిష్యుల కాజ్ఞాపించి యొక్కెడ నాసీనుండై యుండ కౌరవపాండవులు వివిధాయుధ విద్యాపరిశ్రమలం జూపుచు, గజాశ్వరథారోహ దక్షతం జూప కొంతసడికి భీమదుర్యోధనులు గదాధరులై రంగ మధ్యంబుం బ్రవేశించి

శా. ఉత్తుంగాచలయుగ్మముంబలె మహా ♦ హుంకార శబ్దమ్ములా
యత్తంబై పదఘట్టనధ్వనులు భూ ♦ మ్యాకాశముల్ నిండ, రే
కెత్తన్ స్వీయజయాభిలాష పటుశ ♦ క్తిం బోరుచో, సభ్యులున్
జిత్తస్థైర్యము దక్కి ప్రమాన్పడిరి స ♦ ప్తీభూతచైతన్యులై.

తే. గీ. ద్రోణతనయుండు భీమదు ♦ ర్యోధనుల నొ
కంత కిర్వుర వారించె ♦ నస్త్రగురుఁడు
కనుఁడు నాప్రియశిష్యుఁడ ♦ ర్జును డితండు
ఘనధనుకౌశలంబు జూ ♦ పుననుసంత.

పవనాస్త్రంబున తత్ప్రయోగధరములన్ • వారించి నివ్వెచ్చు డా
హవరంగంబున నిల్చి యుంతట గృపుం • డాకర్ణుతో నిట్లనెన్.

క. వియ్యంబును నెయ్యంబును
కయ్యంబు సమానులకు జ • గంబునఁ దగు నీ
యయ్యం బేరోఁ గని వంశం
బెయ్యది యిపరించి పోరు • మింతని కోడన్.

వ. అనవిని రాధేయుండు సిగ్గువడి తలవాంచి యూరకున్నం జూచి దుర్యోధనుండు కృపున కిట్లనియె

చ. కులముగలాడు శౌర్యమున • గొంతితనేసగలాడు మువ్వురీ
యిలపయి రాజనాముము ప • హింపగ సర్హులు; కావయేని మీ
రలు గన నంగరాజ్యమిడి • రాజుగజేసెద నేడె చూడు డీ
య్యలఘుపరాక్రమక్రము న • టంచు సుయోధనుడట్లొనర్చెనన్.

తే. గీ. భూరిమణిమయమకుటకే • యూరముఖ్య
భూషణాలంకృతానంద • మూర్తియగుచు
దీనికేమి ప్రత్యుపకార • మేనొనర్తు
ననిన కర్ణుడు, కోరె స • ఖ్యము కురుపతి

వ. అంతకొమరుని రాజ్యాభిషేకోత్సవము సూచి యానందపరవశుండై సూతుండు రథంబు డిగ్గి కర్ణునొద్దకుం జని కౌగిలించుకొని తదీయ మూర్ధాఘ్రాణం బొనర్చెం గని భీముండు కర్ణుని సూతకుల సంభవుం గా నెఱింగి యెకసక్కెముగ నిట్లనియె.

సారంగ—మిశ్రగతి

ప॥ చాలుజాలింక నీబోటికి - సమరమేటికి పొమ్మ్యాపాటికి ॥చా॥

అ॥ప॥ మేలైనగుఱ్ఱాలతో కళ - కోలగొని యరదమ్ము దోలుము ॥చా॥

1. జాతికొలది దలంపకీగతి - క్షత్రియులతోడనా జగడము
పాతకి! తగుదునని సభకిటు - వచ్చితివి సిగ్గువడి పోవక ॥చా॥

2. అర్హమగునెటు మంత్రపూత - బగు పురోడాశమది కుక్కకు ॥చా॥

తే. గీ. అనిన గర్ణుండు వెలవెల్ల • నై విశీర్ణ
వదనుడై యుండ గురుపతి • పడసుడై కనె
పుట్టునే లేడికడుపున • పులి పొదనె
యధమకులమున సట్టితే • జోధికుండు ?

సీ. అమరేంద్రుచేతి నా • టంచులబాకు గ
క్కుముగ దధీచి వె • న్నుముకగాదె ?
తారకాంతకు డాకు • మారుండు జేజేల
దళవాయి శరవణో • ద్భవుడుగాడె ?
సర్వజ్ఞు డీ కృపా • చార్యుండు లోకమా
న్యుడు శరస్తంభ జ • న్యుండుగాడె ?
యరయ భారద్వాజు • సకలాస్త్రశస్త్ర మ
ర్మవిదుండు కుంభ సం • భవుడుగాడె ?

తే. గీ. మఱియు మీ జన్మములతీరు • మరచినావె ?
లలిత సర్వాంగలక్షణ • లక్షితుండు
పుట్టు కవచంబు కుండల • మ్ములు గలాడు
సూతజుడుగాడు కర్ణుడో • తాతజాత !

తే. గీ. అని సుయోధను డాదిత్యు • డస్తమింప
గర్ణు దోడ్కొనిచనియె; నా • ఘటభవుండు
తెల్లవారిన శిష్యుల • నెల్ల బిలిచి
సంభృతోత్సాహుడగుచు నీ • సరణి బలికె.

కమాచి - ఆది.

ప॥ గురుదక్షిణగా ద్రుపదు బంధించి
కొనిరం డియ్యెడకు - ప్రాణమ్ములతో ॥గు॥

అ॥ప॥ కరము రాజ్యగర్వాంధకారమున
కన్నుగాన కతడు నను పరాభవించెను ॥గు॥

చరణము

అతడు నేను బాల్యమున విలువిద్య
నభ్యసించినాము - ఒకగురువునొద్ద ॥న॥

కతిపయదినముల కా ద్రుపదుడు పాం
చాలపతియయ్యెను - జనకుడు పరోక్షమగుట

సీ. నేనంత విద్యనూ • న్య విద్యా మైన తెనూ
భవ్యసాంగ భేదవుం • బాలకాలకు
ద్రుపదుని బాల్య సఖు • త్రుడుగా నేర సాతండు
ప్రబల రాజ్యాంధతా • రి ంన కన్ను
గానక చాలునో • పేర్మి సమాగ్రాభిషి
క్తుడ సీ., పేదవా • యడప్రు మనకు
మైత్రియేరీతి నం • భవమా నటంచు వ
న్న వమానానపరిచెనో • యన్నలార !

తే. గీ. తత్పరాభవ మూాత్మకో • దలచి మిమ్ము
వివిధశస్త్రాస్త్ర మర్మకో • విదుల జేసి
నాడ గావున గురుదక్షి • ణాగ రయంబ
గదలి ద్రుపదక్షితీంద్రుని • గట్టి తెండు.

చ. అనవిని ధార్తరాష్ట్రి శత • మా ద్రుపదక్షితినాథు గెల్వగా
జని పెనుబీరముల్బలికి • సంగర రంగమునందు నిల్చి త
జ్జనపతి నోంపలేక రిపు • సంతతి పై బడ గాండిశీకులై
వనరుచనెల్లరు న్మగిడి • వచ్చిరి, వచ్చినజూచి పార్థునన్

సీ. సత్యసంకల్పుడౌ • సమవర్తి తనయు నా
సతిరమ ణతాబంధ • నమ్ముగాగ
గురు కటాక్షమున నై • కొన్న దివ్యాస్త్రసం
తానమే విజయ సా • ధనముగాగ
సుత్రామజనక వా • యుకుమార గంధసిం
ధుర విహారంబె చే • దోడుగాగ
మహితపరాక్రముల్ • మాద్రీకుమారులే
సవ్యాపసవ్య భు • జములుగాగ

తే. గీ. గదలిపాంచాల విభుని సం ♦ గ్రామసీమ
నెదిరి సింగమ్ము వోలె లం ♦ ఘించి యొడిసి
పట్టి తనరథమున కంట ♦ గట్టి తెచ్చి
ద్రోణు ముంగటబెట్టె నా ♦ గ్రాసపదు గ్రీడి.

వ. అంత ద్రోణుం డర్జునపరాక్రమంబునకు వెఱగంది ద్రుపదుంజూచి నగుచు నిట్లనియె.

కేదారగౌళ - ఖండగతి

ప॥ పేదపాఱుండెవఁడో - పెద్దరాజెవ్వఁడో
యేదీవచింపుమివు - డ, సరిగా కన్నుదెఱచి ॥పే॥

అ॥ప॥ నీదు రాజ్య మదాంధ - కారమ్ము నారింప
నేఁడు నాశిష్యుచేత - నీకంజనమేయించితి ॥పే॥

చరణము

ఊరకేపోదు మానము ప్రాణమూప్చకే
దారుణానలతుల్యమై, బ్రాహ్మణావమానం ॥బ్రా॥
కోరినీవే తెచ్చుకొన్నాడ వీ ముప్పు
కొనకు నీవింకనైన - బుద్ధిగలిగి వర్తింపుము ॥పే

ఉ. సింగపుగద్దెపై నిలిచి ♦ చెల్లరికూతలుగూసినట్టి నీ
పొంగడగెఁగా పృథాతనయు ♦ పోటరిచేతులతీట వోయె, నా
భంగపుబాటుదీఱె, గరు ♦ వం బికసెల్లదు చిన్ననాటి నా
సంగడికాడవౌట నిను ♦ జాలిదలంచితి పొమ్ము వీటికిన్.

వ. అనిపల్కి యర్జునుం గని

తే. గీ. మానవంతున కిల నొక్క ♦ మాట చాలు
దీర్ఘ వైరంబు తగదు ధా ♦ త్రీసురునకు
మిగుల జచ్చినపాము నే ♦ మిటికి గొట్ట?
విడువు మీతనిబంధము ♦ లిప్పు పార్థ!

సీ. నరుడంత ద్రుపదు బం ♦ ధించి తెత్తు జేయు నే
గతి ప్రతీకారంబు ♦ గడగి నేతు
నని తలంచుచునేగ ♦ నతడు, ద్రోణాచార్యు
డింద్రనందను మెచ్చి ♦ యిచ్చె బ్రహ్మ
శిరమను నొక దివ్య ♦ శరమును సప్రయో
గ సంవర్తనంబు గా ♦ గ, ధృతరాష్ట్రు
డా ధర్మనందను ♦ యౌవరాజ్యాభిషి
క్తుని జేసె గాంగేయు ♦ ననుమతమున

తే. గీ. నలుగడలగెల్చి బలిమి ద ♦ స్యులు నడ పురు
బరనృపాలతనూజద ♦ ర్పం బడంచి
సకల సద్వస్తువాహన ♦ ప్రకర మొసగ
వరలెను యుధిష్ఠిరుడు సార్వ ♦ భౌముడనగ.

శ్రీ

# మహాభారతము

## పాండవపర్యటనము

బిలహరి — రూపకము

ప॥ ఆలింపుము పాండవ ప - ర్యటన కథావిశేషమ్ము ॥నా॥

అ॥ ప॥ తూలింపుడు నిఖలపాప - జాలమ్ముల మోక్షప్రద ॥మా॥

1. కౌంతేయుల వైభవబల - కార్ముకవిద్యాదక్షత
తెంతయుజూచి సహింపక - చింతిలు దుర్యోధనుడవు ॥డా॥

2. కణికుండనువాడొక నా - డినసుత సౌబల దుశ్శా
సన దుర్యోధన ముఖ్యుల - కొసరదెల్పె నృపనీతి ॥నా॥

సీ. అపకారియని తోచ ♦ నా గురుండగుగాక
తన్నుగా శాసించి ♦ తీరవలయు
నేరి నే నమ్మక ♦ యెప్పుడు నాత్మర
క్షాపరుండై పొద ♦ నూపవలయు
బలహీనులై యున్న ♦ పట్టున రిపుల నే
రూపుననో రూపు ♦ మాపవలయు
నగు సామదాన భే ♦ దముల నమ్మించి వం
చించి శాత్రవులసా ♦ ధించవలయు

తే. గీ. సమయమగునంతదనుక నే ♦ స్తము నటించి
పగర దటియైన జెఱుపగా ♦ వలె నృపుండు
శత్రుమారణ కార్యమ్ము ♦ క్షత్రియులకు
నాచరణయోగ్యమగు చేత ♦ యంద్రు బుధులు

వ. అనవిని దుర్యోధనుండు పాండుకుమారుల దూరస్థులంజేసి సాధింప నుద్యోగించి యొక్కనాఁ డంధరాజున కిట్లనియె.

సురుఖారి—ఆది

ప॥ ఊరుపేరు లేకుండ జీవించి-యుండవలసె నీకొమరులమె మే ॥మూరు॥

అ॥ ప॥ వీరులై పాండవేయులునకలో - ర్వీవలయంబేలగావీక్షించు ॥మూ॥

1. యౌవరాజ్యమిడినాడ వాపాండ - వాగ్రజునకు మంచుకొనక్కలరయక కావునంబౌరులింకమమ్ముజ- ల్కనగాజూతురువారిగొండాడి ॥యౌ॥

ఉ. పాయక నీనమక్షమున ♦ బాండునృపాలుడు రాజ్యమేలె, నా పై యమనందనుండె పరి ♦ పాలనసేయ విధించితీవు, ని ట్లే యవనీపతిత్వమున ♦ కింతట వారును వారివంశజుల్ దాయులుగాఁగ; తప్పగల ♦ మాకు పాండవ దాసులంటకున్?

తే. గీ. కుంతికొడుకులు మాకింత ♦ కూడొసంగ బ్రతుకనేమంతవచ్చె? మా ♦ బాగుగోరు వాడవగుదేసి పాండు భూ ♦ పాలతనయు లందు నీకున్న దయ విడ ♦ నాడుమయ్య

చ. వసువుము వారణావతము ♦ పాండుకుమారుల గుంతితోడ నా కసువుగఁగొన్నిరోండ్లవర ♦ కచ్చటనుండురు, దానజేసి భూ జనులకు ధర్మజాదుల దె ♦ సంగల ప్రేముడిపోవు, నాకు ధా రుణిసకల మ్మధీనమగు ♦ అమ్మన జేయుడి నిద్రపోవుదున్.

క. అనవిని యంధమహీపతి వనరి తనూజాతునట్లు ♦ వారించిన దా వినకున్నఁ గొనకు తమ్ముని తనయుల రావించి యనియె ♦ దారుణభంగిన్.

తోడి - త్రిపుట

ప॥ కన్నకొమరులకన్న మీరెమెండ-గలదుప్రేముడి నాకుమిన్నగ ॥కన్న॥

అ॥ప॥ అన్నలార! నాయాజ్ఞ మీరలు-నెన్నడునుజవదాటిరెయుండగరు ॥క॥

1. వారణావత నగరమందున - వరమపుణ్యస్థానమందున మీరుగుంతియు కొంతకాలము-మెలగిరందునుఖాలవాలము ॥కన్న॥

చ. తలపగ విశ్వనాథునకు ♦ తన్నగరమ్ము నివాసభూమి, ని
ర్మల దివిషన్నదీతట ♦ విరాజిత మయ్యెదిగాన మీర లా
వలనికి బోయినల్పు డౌగ ♦ పావన హితమ్ముగ సక్రమమ్ముగా
విలసితదానధర్మములు ♦ విశ్రుతభూసుర తర్పణమ్ములున్.

వ. అనివంచిన వల్లెయని పాండవులు భీష్మద్రోణ విదురకృపాదులకు
మ్రొక్కి దీవనలంది జననీసహితముగ వారణావతమ్మునకు గమ
నోన్ముఖులయిన, పాపశీలుండగు దుర్యోధనుండు పురోచనుం
డనువానిం బిలిపించి రహస్యమ్ముగ వానికిట్లనియె

సీ. నాతండ్రి నేను పాం ♦ డవుల నేపుర వార
ణావతమంపుచు ♦ న్నాను నాకు
నీవాంతరంగిక ♦ హితుడవు గావున
సాయమొనరు డీయెడ ♦ పలుపవలసె
మానుమందసి వసము ♦ చని వారు నివసింప
నిలయమ్ముల్ రచియింపు ♦ నేర్పుమీఱ
సరగ లాక్షాసర్జ ♦ కరసమాశ్రిత ఘృత
తైలార్ద్ర వస్తుతి కాం ♦ తరవిశాల

తే. గీ. తరచతుశ్శాల పాండుసు ♦ తుల నునిచి
యొరులెరుగకుండ వారలే ♦ మఱినతఱిని
తద్గృహద్వారమందున ♦ దహనముంచి
వైరి పంచత్వమెఱిగి రా ♦ వలయు నీవు

క. అనిపంచిన జనియె బురో
చనుడును పాండవులు విడిచి ♦ సామజపురమున్
జననీ సహితమ్ముగ బో
వునెడన్ విదురుండు ధర్మ ♦ పుత్రునకనియెన్.

శ్రీరంజని—రూపకము

ప॥ మాయయు మర్మమెరుంగరు - నాయనా! మీరు మాయకులు॥మా॥
అ॥ ప॥ కోయతనంబున నెవ్వడో - కురుపతి మీకెగ్గుసేయు ॥మా॥

1. శకుని కర్ణదుశ్శాసన - సారథ్యమ్మున బాపవు - శకటము దోలగ
   నున్నా - డిక నీకొనవ్యాగ్రజుడు ॥మా॥

2. కార్యా కార్యము లెఱుగ ర - నార్యులు గాంధారేయులు
   దుర్యోధను జేగుచుండు - ద్రోవజను సంధరాజు ॥మా॥

తే. గీ. ఉరువిషాగ్నుల వలన నే • మఱక మెలగు
డప్రమాదులరె ; వారి • లాచరించు
దారుణమ్ములు తత్ప్రతీ • కారములును
జెప్పివంపుడు నెవ్వటి • కప్పు డేను.

చ. అనవిని సంతసించి సెల • నం దియు నాతనియొద్ద ధర్మజుం
డనుజసమేతుడై ప్రయాన • మొచని ఫాల్గున శుక్లమందు రో
హిణి దగు సప్తమీతిథి న • హీనసుదమ్మున వారణావత
మ్మున కరుదెంచి వైభవ స • మున్నతిజేసె గృహప్రవేశముల్.

క. ఆయింటి వైఖరింగని
మాయోపాయ ప్రయోగ • మర్మవిదుండు కౌం
తేయప్రథముం డిట్లనె
వాయుతనూజాతునకు న • భంగురలీలన్.

మ. ఇదిలాక్షాగృహ మిందపాంశవమునే • యుంపందలంపూనిదు
ర్మదులై కాపురముంచిరట్లు దురితి • ప్రారంభు లాకౌరవుల్
విదురుండాడినమాట నిక్కము, నే • వేళం బ్రమాదంబుగా
ర్పదరో, కావునజాగరూకత బ్ర • వర్తింపందగుం దమ్ముడా!

వ. అనిపల్కి ధర్మజుం డనుజజననీ సహితమ్ముగ నాయింట నారునెల లప్రమాదస్థితినుండునంతనిటకరిపురంబున విదురుండు దుర్యోధనుడు దుర్మంత్రం బెఱింగి యొక్క ఖనకు నతికుశలుం బాండవులంపాలికిం బుత్తెంచిన వాడును రహస్యంబున బాండవులంగని రానున్న కృష్ణచతుర్దశి నాటిరాత్రి పురోచనుండు లక్కయిల్లు గాల్చునని యెఱింగించి యొరులెఱుంగకుండ నొక్క బిలమ్ముగావించె. కృష్ణచతుర్దశి నాడు కుంతియు దేవపూజ గావించి పుణ్యాంగనలకెల్ల మిష్టాన్నంబుల దృప్తి జేయ బురోచనుం డంపిన యొక్కనిషాదాంగన యేవురు

కొడుకులుం దానును నాట తేయు లక్కయింట నిదురించుచుండ
భీముండు మేల్కని తల్లిని సన్నదమ్ములను బిలంబులోని కనిచి.

రాగ - త్రిశగతి

1. అగ్గిపెట్టె లక్కయింటి - కయ్యోక వాయుతనూజుం ||డ||
ప|| ప|| భగ్గునమండి మిన్ను వెళ్ల - భస్మీభూతియై కూలగ ||న||
అ|| కొడుకులేవురుం దానును - మడియ నా నిషాదాంగన
నడిగాకుండ పురోచన - శయనగృహద్వారముననె ||న||

వ. భీముండు బిలము వెలువడి యేవురె వెలువరించి

సీ. నిదురపాటున కాలు • గదుపలేకున్న కుం
తిని బలితంపుమూ • పున నిడుకొని
తెలుచుమైకమునమై • సొలచినిద్రించు ధ
ర్మతనూజు బాహామూ • లమున నుంచి
యొప్పాట గందోయి • విప్పిచూడగలేని
శక్రనందను నొక్క • చంక బెట్టి
యొత్తియున్నంగమ్మ • లెక్కించి మాద్రీసు
మారుల భుజములం • జేర్చి

తే. గీ. నడకవడి దరులెల్ల జా • ల్పడుచు ద్రొక్కు
చరణసంఘట్టనమున తా • ల్పులు కుదులగ
బవలు ననిసట్లు కేమెల్ల • బరవదొడగ
ననిలసూనుడు ముందుగం • డక తెరలి.

తే. గీ. ఇట్లు చని చని, గంగ దా • టించి మిపుల
నాకటుడపించువారి సా • యాహ్నమున
నొక్కవటభూరుహచ్ఛాయ • నుంచి నిదుర
బోపు తల్లిని నన్నద • మ్ములను జూచి.

ఉ. చింతిలుచో హిడింబుడను • జెంగటనున్న నిశాటవీరుడ
ల్లంతన జూచి చెల్లెలి ర • యమ్మున వారి వధించి తెమ్మనన్
గాంత హిడింబ రూపజిత • కాముని భీమునిగాంచి మెచ్చుచుం
జెంతకు జేరి వాక్రొసయె • చేకొని మానవరూప మంతలోన్-

కాఫి - ఆది

ప॥ వలచివచ్చితి నేలుకోరా - వన్నెకాడ నన్నేలుకొమీరాడా ॥వలచి॥

అ॥ ప॥ చులకనగా నను - జూడకు మొగిపరి

పలుకవేమిసుధ - లొలుకగ నానాథ ॥వలచి॥

చరణము

మూడుజగముల నీ సరి సొగసరి లేదు సుమ్మీ కోటికో మగవాడా

నేడునీతోడగూడకున్న నాయీడుపుట్టువు వ్యర్థకమే ॥నినువలచి॥

ఉ. దానతి నేహిడింబయను ♦ దాన హిడింబునకేను సోదరిన్

వానిజయింపలే రమరు ♦ పర్వులు నైతము, నాకు భర్తవై

ప్రాణముగాచుకొమ్మతడు ♦ బావయగు నిన్నునమ్ముకొంటిబోల దె

వ్వానికి, ముజ్జగమ్ములకు ♦ బట్టముగట్టెదనున్ మనోహరా.

ఉ. మానవమాంసమే ప్రియత ♦ మంబను వాళ్ళికి నాలసించినన్

దానయివచ్చుమీకడకు ♦ దప్పదతం డిటురాకమున్నె నీ

యాన నిమేషమాత్రమున ♦ నందఱనెత్తుకపోయి దాతు నెం

దైనను స్వదమేల్కొలుపు ♦ మా, తడవైనను కార్యభంగమా.

వ. అనవిని భీమసేనుండు.

శా. క్షుద్రామ త్ర్యవిరోధినొక్కసి మహా ♦ గ్రుండించు గొండాడ కా

రుద్రుండేయగుగాక భీకర నము ♦ ద్రుండేయగుంగాక, ని

ద్రాదోత్సాహుడ నే భయంపడను, రా ♦ నిమ్ముహిడింబాసురున్

నిద్రాభంగముసేయ వీరల కిదే ♦ నిక్కంబు దైత్యాంగనా!

వ. అని పల్కునంతలో రక్కసుండయ్యెడ కరుదెంచి భీమునిగని.

ఆఠాణా — ఖండగతి

ప॥ ఎందుబోయెదవు నీ - వింక మానిసిపోత

అ॥ ప॥ యిందేలవచ్చితివి - ప్రమందగానాచేత ॥ఎందు॥

1. బంటులగు రక్కసుల - బౌరుషవిహీను లను

కొంటివా, వంటింటి కుందేటివైతివి ॥ఎందు॥

క. నన్నెఱుఁగవా, నరాం - తకుఁడను హిడింబుఁడను
తిన్నఁగ నానోరు - దెఱచినొక ముద్దగా ॥౩౦॥

సీ. అనిపల్క మానుషా ♦ శను డాకి పారికూ
ర్కొనకు భంగమ్ము సే ♦ కూరకుండ
బాహామూలంబునం ♦ బట్టి నక్తంచర
వీరు భీముఁడు కౌంత ♦ దూర మీడ్చి
మల్లయుద్ధమ్మున ♦ మార్కొని పోరుచో
నలిఁగి తద్దానవుం ♦ డౌడుగఱచి
కుంతియున్ సుతులు మే ♦ ల్కాన నొక్కెను బొబ్బ
వెట్టగా నర్జున ♦ ప్రేరణమున

ఆ. వె. గాలికొడుకు వాని ♦ కడగాలు చేనంది
విడక నూఱు మార్లు ♦ వీచివీచి
కొనకు నేలబెట్టి ♦ కోలెమ్ము విఱిచి రా
కాసి విగత జీవు ♦ జేసి వచ్చె.

తే. గీ. అంతలోఁ గుంతియును ధర్మ ♦ జాదు లా ని
శాచరసతీవిధానమ్ము ♦ సకలమెఱిఁగి
దానిఁ గైకొనుమని భీమ ♦ సేనున కన
సమ్మతింపమి రక్కసి ♦ చాన యనియె.

మంజరులు

కామశరవిద్ధనైతి జట్టు ప - క్కముల విడనాడుకొంటి
కామరూపిణిఁ గాంక్షురాల - గాన నన్నేలు మంటి
అనవిని మతిజన్మమగునంత కీ - య్యకొనె నతఁడు సత్వరము
జననీసహితమ్ముగ బాండవులున్ . శాలిహోత్రునాశ్రమము
చని యొక్క సరోవరమునన్ గృత - స్నానులై విశ్రమించి
వనస్పతిన్ సుఖమున్న వ్యాసు డ - వ్వారికడ కేగుదెంచి
ఏకచక్రపురి విప్రభావమున - నుండుడని తెల్పిచనియె
రాకాసిహిడింబ పవనతనయు వ - లనన్ ఘటోత్కచుగనియె

వ. అంత నాఘటోత్కచుండు రాక్షస పిశాచ బలపరివృతుండై 'పని గల్గిన నన్ను దలంపు డవ్వాడవత్తు' నని పల్కి యథేచ్ఛం జనియె పాండు కుమారు లయ్యాశ్రమంబు వదలి కతిపయప్రయాణంబుల నేకచక్ర పురమ్మున్ జేరి బ్రాహ్మణవేష ధారులై యొక్క విప్ర గృహమ్మున నుండి మధుకర వృత్తిన్ జీవించుచు నొక్కనాడు తామున్న విప్రగృహంబున నొక్క పెట్ట యార్తధ్వని వినవచ్చిన విని దుఃఖకారణ మెఱింగి రమ్మని కుంతి పంప నామెయు లోనికిం జని బ్రాహ్మణింగని.

చక్రవాకము—త్రిపుట

ప॥ ఇంతయాకస్మిక విచారం - బేమివచ్చె నెఱింగింపుమిపు ;డింత॥
అ॥ ప॥ చింతిలకు మూరడిలు మమ్మా- చేతనగుసాయముం జేసెద ॥నింత॥

చరణము

భూతలమున బరోపకార-మ్మునకు మించినపుణ్యమున్నె
పూతచారిత్రు లసమానులు-పుణ్యదంపతులయ్యెదోయమ్మా ॥రింత॥

సీ. అనిన నాలించి బ్రా ♦ హ్మణి కుంతికిట్లనె
మానుషంబున దీర ♦ రానికష్ట
మియ్యది, యైన మీ ♦ కెఱిగింతు నిచటి కా
మడమేర బకుడను ♦ మానుషాదు
డొక్కండుకాపుర ♦ మున్న వా డతనికి
నిత్యంబు నొక్క మా ♦ నిసిని మఱియు
రెండెనుబోతుల ♦ బండియున్న మొనంగ
పురవాసులెల్ల నే ♦ ర్పఱచుకొనిరి

తే. గీ. యిల్వరుస మాకువచ్చె నే ♦ డేకపుత్రు
నీతనూజాతు రక్కసు ♦ వాతబెట్ట
నేరకుంటి మిదె విచార ♦ కారణంబ
టన్న నామెకు గుంతి యి ♦ ట్లనియెప్రీతి.

ఉ. గారముమీఱ బెంచి సరి ♦ గా మొకుపచ్చలు నారసట్టిచి
న్నారి యను గుఱ్ఱి వసు ♦ నా? పెనురక్కసి పొట్టబెట్టుటల్

దారుణ మింతకన్నగల ♦ దా? మఱి నాకుగుమారులేవు రు
న్నారుగదమ్మ! యందొకని ♦ సంపుదుగావున నూరడిల్లుమా.

వ. అనవిని గృహమేధిని యిట్లనియె.

చ. కొమరులు నీవు బేదవడి ♦ కూటికి గుడ్డకు మోమువాచి జో
లెముగొని భిక్షమెత్తుకొని ♦ లేమిడి గుందుచునుండ బుత్రశో
కము పయిపెచ్చుమీకొకటి ♦ కల్పనసేతునె? యింతకన్న బా
పముగలదే? తనూభవుల ♦ పైదయ యేరికినే సమానమే.

వ. అనిన గుంతియు.

తే. గీ. నాకు బుత్రులపై ప్రేమ ♦ లేకగాదు
యనురనోర్వంగజాలిన ♦ యట్టికొడుకు
లేవురున్నారు; బకుని జం ♦ పించి నేడు
నగరి కుపకృతిసేయుటే ♦ నాతలంపు.

క. అనినవిని విప్రదంపతు
లనుపమమోదాబ్ధి దేలి ♦ రా వృత్తాంతం
బును సర్వ మనిలసుతునకు
వినిపించిన కుంతి, యతడు ♦ ప్రియమున బలికెన్.

సారంగ - ఖండగతి

ప॥ మంచిపనిజేసితివి - మాయమ్మ, బకునివరి
మార్తు నే బోయినే - డే, వీరమాతవుగాన ॥మంచి॥

అ॥ప॥ మించిసాధువుల గా - చించు క్రూరుల విదా
రించుటే ధర్మమగునీ యుత్తమ క్షత్రియుల కెందును ॥మంచి॥

చరణము

పిండివంటలతోడ - బండెడన్నము నాకు
బెట్టింపు మాదైత్యునీ - బిండిపిండిగా గొట్టెద ॥పిండి॥
నిండునాకడుపొక్క - నిముసమున బావలకు
నీచదానవబాధ - నిర్మూలంబై పోవును ॥మంచి॥

క. అనిపల్కినంతలో యమ
తనయుం డట కరుదెంచి ♦ తద్వృత్తాంతం

బును సకలమెఱిగి భయమున
జననికి వాకొనియెనిట్లు ♦ సాంజలియగుచున్.

సీ. పాండవాన్వయము సి ♦ ల్పాగ భద్రగతి వ్రజ
పంజరంబెవ్వాని ♦ బాహు యుగము
లాతుగృహమ్ము వె ♦ ల్వడజేసి ప్రాణ దా
నమొనర్చె నెవని వి ♦ క్రమ విహార
మడవి హిడింబు డా ♦ హరింపకుండ ర
క్షించె నా ♦ డెవ్వాని చేతిలావు
తలపువచ్చిన మాత్ర ♦ ధార్తరాష్ట్రులకు సిం
హస్వప్నమెవని రూ ♦ పాతిశయము

తే. గీ. సామజారాతిబలు నట్టి ♦ భీమసేను
బ్రాహ్మణార్థమ్ముగా నిట్లు ♦ బంపదగునె?
ధరణిసురునకు సాయమ్ము ♦ తప్పదేని
బకునకాహారముగ నన్ను ♦ బనుపరాదె!

వ. అనిన విని కుంతియు

ఉ. ఇంచుకవీనిశక్తి బరి ♦ కించక మించుగ సాహసించి నే
పంచినదానగా నితడు ♦ బాల్యమునం దొకనాడు నాదు చే
యంచునజాతి క్రిందపడు ♦ నంత దనుతతి పెంపునన్ శిలా
సంచయమెల్ల జూర్ణమయె ♦ జంపగలా డితడా నిశాచరున్.

తే. అని సమాధానమ్ముంజెప్పు ♦ నంతలోన
నా వృకోదరుడిష్టాన్న ♦ మారగించి
చని బకస్థానమున కొక్క ♦ శకటమెక్కి
కూడుదినుచుండ రక్కసుం ♦ డొడ్డుగఱచి.

కన్నడ - రూపకము

ప॥ ఎవ్వడవోరోరిబడుగ - యింతసాహసించితివి ॥వె॥

అ॥ప॥ క్రొవ్వున నాకై తెచ్చిన - కూడుదిందువా పిడుగా ॥యె॥

[illegible]

ఉండకుము నీమొగి[illegible] - లొ[illegible]

బండబెట్టి నీయెముకలు - పిండిపిండిగా గొట్టెద ॥నెవ్వ॥

క. అని చేనత్తుకకొలదిగ
వెనుజఱచిన నుంతయేని ♦ బెదరక భీముం
డును తనుగానటు లన్నము
దినుచుండ నిశాచరుం డ ♦ తి క్రుద్ధుండై.

క. తరువొండు జేతికి చేగొని
బిరబిర జనుదెంచుచుండి ♦ భీముడు వడి నో
గిర మెల్ల గుడిచికోప
స్ఫురితారుణనేత్రుడై క ♦ పోలము లదరన్.

ఉ. సాలమహీజమొండు గొని ♦ చక్కువదుష్టనిశాటునేయ, దా
నేలగలట్టి వృక్షమున ♦ గెవ్వననార్చుచు దైత్యుడేసె, నీ
లీల నొకింతవోరి బలు ♦ లిద్దరు జేసిరివాలుంకృతుల్ భుజా
స్ఫాలనసన్వనంబులు ది ♦ వంబునకుముట్టగ మల్లయుద్ధమున్.

ఆ. వె గాలికొడుకు దనుజు ♦ కంటికంఠదేశముల్
బట్టి జానుదండ ♦ ఘట్టనమున
వెన్ను విఱుగబొడిచె ♦ విశితంబుతో నవ
ద్వారములను రుధిర ♦ ధార లొలుక.

వ. ఇట్లు భీమసేనుండు బకాసురుం గెడపి తత్కళేబరం బీడ్చుకొనివచ్చి నగరద్వారసమీపంబున నైచి తద్వృత్తాంతమ్ము జననీ సోదరుల కెఱింగించి యేకచక్రపురవాసులకు నాటినుండి రాక్షసోపద్రవం బుడిపె.

---

శ్రీ

# మహాభారతము

## ద్రౌపదీ స్వయంవరము

కాంభోజి—రూపకము

ప॥ ద్రౌపదీస్వయంవర క - థాసుధారసము గ్రోలుడు ॥ద్రౌ॥
అ॥ ప॥ ప్రాపిత భవరోగముల బ - టాపంచలు గావింపుడు ॥ద్రౌ॥

చరణము

కలకాలము గష్టంబులు - కాపుర మొకచో నుండవు
వెలయగ జీకటిపోయిన - వెన్నెలవచ్చుట సహజము ॥ద్రౌ॥

సీ. ద్రుపద మహీనేత ♦ ద్రోణుచేత బరాభ
వంబంది కుంభ సం ♦ భవు వధింప
జాలు తనూజాతు ♦ శక్రనందనునకు
దేవి కాదగిన పు ♦ త్రికను వడయ
యాజమునీంద్రుని ♦ యాజకత్వమ్మున
వరకోకిలాదేవి ♦ పత్నిగాగ
బుత్రకామేష్టి స ♦ ల్పుడు కరవాల కో
దండ వర్మ కిరీట ♦ ధారు డగుచు
తే. గీ. నగ్నినుండి ధృష్టద్యుమ్ను ♦ డను సుతుండు
కృష్ణయను నొక్కసుతయు జ ♦ న్మించిరంత
బరిణయ వయస్కయైయున్న ♦ బాలనుగని
సచివముఖ్యులకనియె బాం ♦ చాల విభుడు.

ఉ. వీరలు పాండవేయులు త్రి • విష్టపమాన్యులు నాడు దగ్ధులై
నారని లక్కయింటను వి • నంబడు లోకవదంతి; యందు దు
ర్వార పరాక్రమక్రముడు • పార్థుడు వానికొసంగ గంటి నీ
వారిజనేత్ర నెల్లు పెర • వారికొసంగుదు బుత్రినక్కటా!

చ. అనిన బురోహితుండ నె • ధరాధిప మాటిదె నే నుపశ్రుతిన్
జననుత పాండవుల్ సుఖులు • చాటగబంపు స్వయంవరంబనన్
విని నరపాలు డట్లునలి • పెన్ వడి, బాండవు లందు నేరగా
జననిని వెంటబెట్టుకొని • సాగిరి కాల్నడకం బ్రయాణమై.

వ. ఇట్లు బయలువెడలి రేబవళ్ళనక పోవుచు నొక్కనా డర్ధరాత్రంబున సోమశ్రవంబను తీర్థంబున గంగాస్నానార్థులై యర్జునుండొక్క కొఱవిం జేకొని దారిచూప నడచునెడ యువతీసహితంబుగ నందు జలక్రీడలాడుచున్న యంగారపర్ణుండను గంధర్వుండు పాండవుల యలికిడి విని ధనుర్ధరుండై వారికిట్లనియె.

హిం॥ తోడి _ చతురశ్రగతి

ప॥ ఎవరావచ్చునది మా - నవులిట గ్రుమ్మరరాదునడురేయి ॥నా॥

అ॥ ప॥ దివిజయక్షగంధర్వరాక్షసులు-తిరుగువేళలందిటునిర్భయులై ॥ఎ॥

చరణము

దూరముండు డీ వనమును గంగా - తీరంబును నాయవియేగావున
వీరభోజ్య మీపుణ్యభూమి, కు - బేరుసఖుడనంగారపర్ణుడను ॥ఎవ॥

తే. గీ. అర్ధరాత్రమ్మున న్నడ • యాడువారి
నెంతవారల నేని గ్ర • హింతు మేము
ప్రాణములనానయున్న బొం • డవల కనిన
ననియె నిటు భయువర్జనుం • డర్జునుండు.

చ. కడిమిగలట్టివీరులము • గావుననేయిటువచ్చినార మీ
యడవులు బుణ్యతీర్థములు • నదులు సార్వజనీనములగాదా!
నడుగులు గట్టిపెట్టుమికి • జాలును నోటికి బుద్ధి నెవ్వ కొ
మ్ముమగక యస్త్రశస్త్రవిద • లున్నెడ జూపకు నీప్రతాపముల్.

మ అనుచున్న౯త నత్యాతసాయకపా శ్రే • యన్ నిరారి గంధర్వు డొ
యన్నద్రోణప్రియ శిష్యుడున్వెలిచె దా • నాగ్నేయబాణమ్ము దో
డనె నేలంబడె బమ్మరిల్లి ఖచరుం • డిట్లాని గాంతేయుడుం
గొనివచ్చెన్ సమవర్తి నూను డతనిన్ • గొబ్బున దెప్పెల్లీడ్చుచున్.

వ. అంతలో నంగారిపర్ణు మనోవల్లభ యగు కుంభీనసి పాండవు
లను డాసి.

సావేరి—ఆది

ప॥ శరణు శరణుపతిదాసమొసంగుడు - నిరుపమాన కరుణానిధులార ॥శ॥

అ॥ ప॥ శరణాగతరక్షణముకన్నను- పరమధర్మమొండున్న దెధరలో ॥శ॥

చరణము

పిన్న పెద్దతారతమ్యమెఱుగక - తెన్నుదప్పి మిమ్మేమేమోయనె
నన్నలార, నానాథుమన్నింపు- డాలుమగల నెడబాపుటధర్మము ॥ శ॥

కం. అని మొఱలిడ విని ధర్మరాజు
డనఘుడు విడిపించె వాని • ననుకంప మెయిన్
వినతుండై గంధర్వుం
డనిమొ త్రిలోకైకవీరు • డను క్రీడి కిట్టుల్.

మ. నను మన్నింపుము, దుర్మదాంధుడగు న • న్నాహా! కామినీగోష్ఠిను
న్ననరుం డెంత వివేకియైన, త్రిజగ • న్మాన్యాన్విసుం గోరు ద
య్యనలాస్త్రంబిడి నాకు నావలస గా • మాశ్వంబుల న్నీవు గై
కొని మిత్రుంబలె జూచుకొమ్మనవు డా • కుంతీసుతుం డిట్లనెన్.

తే. గీ. చెలిమిబాటెంతు హాయములన్ • వలసినపుడు
గొందు నీకడనుంచుమూ • గొనుము పావ
కాస్త్రమిచ్చెదనని యిచ్చి • యనుచటువాసి
చిత్తమలర భాగీరథి • నుతరించి,

చ. చనిచని యుత్కచంబను ప్ర • శస్త మహేశ్వర పుణ్యతీర్థమం
దున దప మాచరించు విబు • ధోత్తముధౌమ్యపురోహితత్వమున్
గొని యటుపై బరాశరతి • నూజహితమ్ముగ జేరిరంత నొ
ప్పున ద్రుపదక్షితీశ్వరుని పుర • ముం బరిశోభితరాజవారమున్.

వ. ఇట్లు కాంపిల్యనగరంబు సొచ్చి యందొక్క కుంభకార గృహం
బున విడిసి యమ్మైరు తెఱంగెఱుంగక బ్రాహ్మణవృత్తి నుండు నంత
ద్రుపదుండును పాండవమధ్యముం డగు క్రీడికి దన కూతు నీయ
నమకట్టి పాండుకుమారుల జాడ గానంబడకుంటచే నొక్క మత్స్య
యంత్రంబు నిర్మించి విల్లు మోపెట్టి యుద్దాని నెవ్వం డేనుబాణ
ములగొట్టు నాతనికి తనయనిచ్చి వివాహం బొనర్తునని దేశ దేశ
ములం జాటింపజేసిన నానాదేశ మహీనాథులు తమతమ బిరుదు
లేర్పడ వేర్వేర పడగలం బన్ని భూమి గ్రక్కదల ద్రుపదపురంబు
జేరి రాజ పురస్కృతులై స్కంధావారంబుల విడిసిరి. పాండు
కుమారులు లక్కయింట హుతాశనున కశనంబైరని సంతసించు
ధార్తరాష్ట్రు లగు దుర్యోధనాదులు కర్ణాశ్వత్థామ భూరిశ్రవ
స్సోమదత్తాదులం గలసివచ్చిరి. అంత పాంచాలపతి మహీపతుల
నెల్లర స్వయంవరరంగంబున నాసీనుల గావించి పూజించుచుండ
దేశాధిపులెల్ల సభాభవన మలంకరించుచుండ, శల్యవిరాట జరా
సంధాదు లొకప్రక్క, కృష్ణబలరామకృతవర్మాది యదువీరు లొక
వంక, మఱియు శిశుపాల సైంధవ భగదత్త పౌండ్రక వాసుదేవాది
వివిధ దేశాధీశులొక చక్కి నాసీనులై యుండ నంతలో పుష్ప
మాలం గేలం గైకొని, పుష్పసాయకు కనుమేతరంబగు నాఱవ
సాయకం బన సర్వాభరణ విభూషితయై తటిల్లత వోలె జూపరకు
మిఱుమిట్లు గొల్పుచు మందగమనంబున పాంచాలి రంగమధ్యం
బునం బ్రవేశింప వివాహోపకరణ సంభారమ్ములు సంసిద్ధముగా
బురోహితుండు గాచియుండ ద్రుపదుండు రాజలోకము నెల్లం
గనుంగొని లక్ష్యంబును జూపి యిట్లనియె.

మంజరులు

ఈ యంత్రము దెగనేయు విల్కాని - కిల్లాలగు నాపట్టి
తోయజాక్షిం గొనుడు మీమీర - కులిత్త తిం జూపెట్టి
అనినవిని నానారాజపుత్రు - లాయంత్ర మేయగడగి
ధనువుసేసి మోపెట్ట నేరకే - దలకిరి బీరములుడిగి

డాయ వైరి కొందఱు మఱికొందఱు - డాసిపరికించి చనిరి
తోయజభవాదులకునే నియ్యది - దుస్తరమని వాకొనిరి
కడకు భస్మమధ్యమ్మునం దగ్ని - కణమువోలె గస్పట్టి
పుడమిసురుల నడుమనుండి వెల్వడ - గడగు క్రీడి పొడకట్టె.

వ. కృష్ణదేవుండు రహస్యంబుగ బలరామున కిట్లనియె

చక్రవాకము — ఆది

ప॥ అతడెవడో తెలిసితివా నీ వన్నా ! మన మేనత్త కొడుకు నిజ ॥మత॥
అ॥ ప॥ మతిమంతుడు వీరాగ్రణి పాండవ
మధ్యముండు మనముద్దుల బావమరది ॥యు॥

చరణము

ఫుల్లాంబుజములనేలు కన్నుగవ - మోకాల్మోదికిజాఱు కేలుగవ
పల్లవారుణాధర మతివిశాల - వక్షస్థలమల్లదే పోల్చిచూడుము ॥యు॥

తే. గీ పాండుపుత్రులు వారణా ♦ వతమునందు
లక్కయింటను బడి దగ్ధు ♦ లైరటంచు
కౌరవులు సంతసించుచు ♦ న్నారు గాని
వారలేవురు బ్రతికి యు ♦ న్నారు నిజము.

వ. ఇట్లు పలుకుచున్నంత.

క. పెడదయుగమ్ము, పిడికిట ని
ముడు కౌను, విశాలనేత్ర ♦ ములు దీపింపన్
బుడమిసురుల నడుమను వె
ల్వడ నొక్కడు వానిగని స ♦ భాసదులెల్లన్.

సీ. అవనీసురుడు మీన ♦ యంత్రమేయగ సాహ
సించినందుల కేవ ♦ గించినారు
రంగమధ్యమున ని ♦ ల్వంబడి ధనువుగ
న్నార వీక్షింపగా ♦ నవ్వినారు
తగ బూర్వపరిచితం ♦ బగు చాపమటంబోలె
మోపెట్టి గర్జించి ♦ పోయినారు

తెప్పపాటున మ్రేటు • దప్ప తాలత్త్యంబు
గొట్టు మూర్కొన వ్రేలు • బెట్టినారు
తే. గీ పొలతి పార్థునిగళమున • బూలదండ
నెలమివేయంగ గాంచి ల • జ్జించినారు;
శల్యరాధేయులంత పాం • చాల విభున
కలిగి తులువతనంబున • బలికినారు.

అఠాణా — ఆది

ప॥ వీరందిన రాజు లిందరుండగ
పిల్లనొసంగుదువా - పేదపాఱునకు ॥పిల్ల॥
అ॥ కోరినీయంత క్రొవ్వున దెచ్చు
కొన్నాదవు ముప్పు - చేసితివి చెప్పు ॥పే॥

చరణము

సకల ధారుణీవరుల రావించి-సభలో నీవిటులపరాభవింతువ ॥సభ॥
బికిర మెత్తి జీవించు బాపన- య్యాతనికిన్ని యునిడగా నీమన సెటులొప్పెను॥
ఉ. ప్రీతిగ పప్పుభోజనము • బెట్టుటొ? నేల్వ లొసంగుటో? ధన
వ్రాతము లగ్రహారముల • పారముగానిడు టొప్పు గాకిటుల్
కూతు నొసంగబోలునొకో • కూళతనంబున బాఱువానికిన్
ఛీ! తులువా వినింద్యమగు • నేతలు ప్రాజ్ఞులు సమ్మతింతురే?
వ. అనవిని ధృష్టద్యుమ్నుండు కర్ణుంగని.
ఉ. బాలను యంత్రమేయుగల • వాని కొసంగుదుమంటి మందు భూ
పాలుర కన్న యర్థ మెటు • వచ్చును? కొట్టక పోయినాడవే
మీ? లలితాంగి నీకిడుదు • మేగద. యూరక కారులాడగా
నేల? యదట్టులుంచి వది • యింపుగ ముందుగ నీవు రాజవో?
వ. అని పల్కునంతలో గర్ణుని మఱియు నవమానింప దలంచి కృష్ణుం
డిట్లనియె.
ఉ. అమ్మన మీనయంత్రము ర • యమ్మున గొట్టగ జాలువాడె పో
కొమ్మను బెండ్లియాడు, కుల • గోత్ర విమర్శన మున్న దన్న యం
శమ్మటలేదు గావునను • సర్వమెఱింగియు నేటికీ వివా

దమ్మెకీ లతాంగి పాణినకు ♦ దక్కెగదా యిక సూతనందనా!

కం. తలపోయ జతుర్వర్ణ
ముల్మలవారి వివాహమాడ ♦ బోలును ద్విజునన్
తొలిబామున నేవున్నము
నలిపెనొకో ద్రుపదు డిట్టి ♦ జామాతకునై.

వ. అనిన రాధేయుండును.

ఉ. పాణిడు నాల్గు వర్ణముల ♦ వారి క్రమమ్ముగ బెండ్లియాడు టా
చారముగాని, ముందుగనె ♦ క్షత్రియకన్యను బెండ్లియాడు టా
చారముగాదు, ధర్మమెడ ♦ నల్పి కౌమారిత బావనయ్యకుం
గూరుచు భూవరుల్ గెడప ♦ కున్న నధర్మము మేరమీరదే.

వ. అనిపల్కుచు ద్రుపదునిపై కుటుకబోవుసంత ద్రుపదుండును బ్రాహ్మణుల మఱువునొచ్చిన ఇచ్ఛాంధనులు దిగ్గునలేచి చెలరేగి కర్ణుంగని కోపించుచు.

బాగు—చతురశ్రగతి

ప॥ చూతువేమి లెమ్ములెమ్ము సుబ్బావధానీ
చేతగాని వారమా సోమావధానీ ॥చూ॥

అ॥ ప॥ మూతిమీదగొట్టి వీని ముట్టుకున్న దోసమునకు
మునిగిగంగలో సహస్రగాయత్రి సేయుంగవచ్చు ॥చూ॥

2. అరింట తా బెట్టె పద్దెమల్లు - రామశాస్త్రి
మూరివంపకంబు సేయు - మల్లుభట్లిరాత్రి
పోరాదీక్షితులు మన - వారి పరశురామముఖ్య
పీటలబిల్చుకరమ్ము - వీని గూబలెక్కదీయ ॥చూ॥

సీ. జారీలకంగ వ ♦ స్త్రమ్ములు ముడిపైచి
ముందుగన్పడు వారి ♦ మోదువారు
దర్భాసనములు జి ♦ క్రావనమ్ములు బట్టి
కసిమీర జనముపై ♦ విసరువారు
మొలనున్న పొడుముకా ♦ యలదీసి మొదిరిపై
రివ్వురివ్వున చేత ♦ రివ్వువారు

ప్రతిబింబముల్ నూచి ♦ పగతురంచని నిల్చి
టద్దముల్ పగులంగ ♦ గ్రుద్దువారు

తే. గీ. నుదకముం బుక్కిటంబట్టి ♦ యుమియువారు
గట్టిగా దొడపాశముల్ ♦ బెట్టువారు
నై విజృంభించు పాటుల ♦ సర్వమంత
గని నివారించి నూతనం ♦ దనన కసియె.

కల్యాణి - ఆది

ప॥ ననుజయించి పాంచాలుని గన్యయము
నామునంగట జూపుము నీ బీరము ॥నను॥

అ॥ప॥ తనతినయును నాకిదు టపరాధము
తిగవుమాలి ప్రేలెదు నూతాధము ॥నను॥

1. మదముబట్టి కన్నుమిన్ను గానవు - మదినొకింత మంచిచెడ్డలరయవు
రథముదోలి బ్రతుకందగువానికి - రాచపడతినీకేమి తెలియురా ॥నను॥

సీ. రోమపాదమహీశ ♦ దు... శాంతాసతి
మణి ఋష్యశృంగ స ♦ న్యాసికిడదె ?
శర్యాతిధారుణీ ♦ శ్వరుని సుకన్యాల
తాంగి న చ్యవన మ ♦ హర్షికిడదె ?
నళమేదినీజాని ♦ నళినీ కుమారి నా
మౌద్గల్యుడను మహా ♦ మహాను కిడదె ?
మఱి విదర్భావనీ ♦ వరుడు లోపాముద్ర
ననఘున కాయగ ♦ స్త్యునకునిడదె ?

తే. గీ. పూర్వరాజేంద్రు లిట్లు మ ♦ న్నందుగాని
తమ తనూజల బ్రాహ్మణో ♦ త్తముల కొసగు
చుండు టాచారమై వచ్చు ♦ చున్నదనగ
నిందు ద్రుపదక్షితీంద్రు త ♦ ప్పేమి గలదు ?

తే. గీ. ధనువు మోపెట్టి యంత్రముం ♦ దనుమలేక
యువిద నాకబ్బుటం గని ♦ యోర్వలేక

సమరమున నన్నెదుర్కొన ◆ శక్తిలేక
ద్రుపదుపై బడ జూతువా ◆ తులువ! నీవు

వ. అని విని రాధేయుం డబ్బుగపడుచు,

ఉ. ఎట్టును మేదినీసురుల ◆ కిట్టి పరాక్రమ మెన్నడేని గ
న్పట్టదు, నన్నెదుర్కొనగ ◆ వాసవశంకరభార్గవార్జునుల్
దొట్టి మహాధనుర్ధరుల ◆ లో నెవడేని యొకండుగావలెన్
జెట్టివి గావునన్ దొలుత ◆ జెప్పుము వారల నీ వెవండవో.

వ. అందుల కర్జునుం డిట్లనియె.

తే. గీ. ఏ నెవండనో తెలియ నీ ◆ కేల? కలన
నాయెదురనిల్చి చేవ గ ◆ న్పఱపరాదె!
దానవాదులవోలె దే ◆ వ తలలో నె
వండగా నెందునను విజ ◆ యుండ నరుడ.

మంజరులు

అనిపల్కుచు గర్ణునిపై దలపడు - నంత భీమసేనుండు
తనపై గవిసిన శల్య ద్రోణ్యనే - సె నంతక సన్నిభుండు
యింద్రసుతుం డవలీల గర్ణు నో - డించి హార్దమునజెలగి
చంద్రాననగొనిచని గుంభకార - సదనమున గుంత కలగి.

మ. తడవయ్యెన్ సుతులేగి యుత్సవము సం ◆ దర్శింప, రారింతకున్
గడుదుర్మార్గులు కౌరవుల్ తనయులన్ ◆ శంకించి గుర్తించి యే
చిడుగుంగూర్చిరొ? బిడ్డలెట్లుమఱలన్ ◆ నేమంబుగా గన్నులం
బడువారో గద! నీవదిక్కు కరుణా ◆ పారీణ! సర్వేశ్వరా!

క. అని కుంతి జాలిపడునెడ
ననిలజ కృష్ణాసమేతు ◆ డై మోదమునన్
జనుదెంచి శక్రతనయుడు
జననికి గేల్మోడ్చియనియె ◆ చతురత మెరయన్.

భైరవి - ఆది

ప॥ భిక్షదెచ్చితిమమ్మా - ప్రియమారనేడు ॥భి॥

అ॥ప॥ అక్షీణకటాక్షు డాశ్రితావనాంభోజదళాక్షు సత్కరుణ ॥భి॥

చరణము

ధరణీబృందారకచూడామణి - నిరుపమాన కోదండవిద్గణి
పరమపూజ్యు డాచార్యుడనగు కుం - భసంభవాశీర్వాదంబున ॥భి॥

౨. అనవరతలోచనాభిరామమై - అఖిలలోక సంస్తుతి భాజనమై
అనుపమానంద సంధాయకమై - యనితరజనదుర్లభమై తగు ॥భిక్ష॥

తే గీ. అనినవిని కుంతి ముదమున ♦ నన్నలార
యనుభవింపుడు మీ రేవ్వ ♦ రనుచు గ్రీడి
వెనుక లజ్జానవనతము ఖ ♦ వనజయగు వి
భీతహరిణేక్షణం గని ♦ విస్మయపడి

వ ధర్మతనూజుంగని

చ. అనుజుడు భిక్షదెచ్చెగి న ♦ టంచన నెప్పటియట్లు లేవురున్
గొనుడనియంటి నా సుతుల ♦ కుం బ్రతికూలముగల్గ దెన్నడున్
దనయులు మామకాజ్ఞ జవ ♦ దాటరు మీరలు, పెండ్లియాడ జె
ల్లునె యొకకన్య నేవురు వి ♦ రుద్ధముగా, తెరువేది! నాయనా!

చ. అనవిని ధర్మనందనుడు ♦ నర్జున! యంత్రము నేసితీవె గా
వున నతి నీవగ్ని కొనగ ♦ జోలు వివాహముగమ్మన న్నరుం
డనె యవివాహితుండవగు ♦ నగ్రభవు న్ననువీడి మున్నుగా
ననుజుడ బెండ్లియాడ జన ♦ దట్లగుటం గొనుమీవె రాణిగన్.

వ. అని పల్కు నవసరంబున బలరామకృష్ణులు సోదర చతుష్కమధ్యం
గతుం ... ధర్మజాతుంగన నేతెంచి, యుధిష్ఠిరునకుం గుంతీదేవికిని
మ్రొక్కి భీమార్జుననకుల సహదేవులంగని కౌగలించుకొని.

ఆభోగి—రూపకము

ప॥ ఎన్నాళ్ళకు కనుగొంటిమి - కన్నులపండువుగా మి ॥మ్మె॥
ఉన్నారానుఖులై మీ - రుర్వి బావమరదులార ॥మె॥

1. దుర్వినీతకౌరవ్యులు - ద్రోయు విపజ్జలధి గడచి
సర్వేశ్వరుకరుణ వలన - స్వర్గమె తిరిగి వచ్చినది ॥మ్మ॥

2. కర్మవశమున నేదేని - కష్టము ప్రాప్తించు గాని
ధర్మాత్ములకెపుడు నూహిం - చయుసాను తమమువలె దొలగు ॥స॥

తే. గీ. భూసురుండయుండె మిము గొంత । బోల్చినాడ
నవల మనయర్జునుడు సూన్ । యుంత్రిమేను
కర్ణు దరుముట, వడమాడి । గనిగి కెలుక్ష
దానిటయు మీవిధమ్ము ప్ప । స్తీకరించె.

వ. అని యిట్లు సంభాషించుకొను కృష్ణుని తీసియూరుల సంభాషణమ్ము జాటుననుండి విని ధృష్టద్యుమ్నుం డతి త్వరితముగ నేగి వారివిధం బెల్ల ద్రుపదున కెఱింగింప నతండును సంతసించి సగౌరవంబుగ బాండవులరావించి యేపురకుం బాంచాలి నిడి వివాహం బొనర్ప సంశయించుచున్నంతలో నయ్యెడకుం గృష్ణద్వైపాయనుండరుదెంచి పూజితుండై యిట్లనియె.

కమాచి—ఆది

ప॥ పిల్లనొసంగుము వీరలేవురకు-విధివిధాన మిడియా ద్రుపదక్షితీంద్ర ॥పి॥

అ॥ ప॥ తొల్లి యీామె మౌద్గల్య మహామునికి
కిల్లాలై బరగె - నింద్రసేన యనుపేరను ॥పి॥

చ ర ణ ము

పరమపతివ్రతగావున నిరతము
పరిచర్యలు సేయు కుష్ఠరోగియగు మునికి ॥ప॥
వరునివలన సౌఖ్యము లవమేనియు
వడయనేర కకటా దేహము చాలించెను ॥ప॥

సీ. తనువు చాలించి యం । తట గాశిరాజను
రాజర్షి కొకట ద । నూజయగుచు

జనియించి కన్యాత్వ ♦ మున బెద్దకాలమ్ము
గడపి నిర్వేదించి ♦ కడకు శంభు
గుఱించి ఘోరతపమ్ము ♦ నెఱప, యమానిలేం
ద్రాశ్వినుల్ దాని దే ♦ హాంతరమున
బత్నిగాఁ గోరి, రీ ♦ శ్వరుడు ప్రసన్నుడై
వరము వేడుమటన్న ♦ వారిజాక్షి

తే. గీ. యేనుమాఱులు పతిదాన ♦ మిమ్మటన్న
రమణులేవురు దేహాంత ♦ రమున నగుదు
రనిచనెఁ జూలి; యాపె యీ ♦ యాజ్ఞసేని,
పాండుసుతులు యమాద్యంశ ♦ భవులు నిజము.

క. అనవిసి వేదవ్యాసుని
యనుమతమున యాజ్ఞసేని ♦ నయ్యేవురకో
య్యన నొసఁగి మహావైభవ
మున బెండిలిజేసె ద్రుపద ♦ భూవరు డంతన్.

శ్రీ

# మహాభారతము

## సుభద్రాపరిణయము

హిం॥ తోడి—ఆది

ప॥ వినుడు సుభద్రాపరిణయకథ-వినిపించెదనేడు రహితమనోవ్యథ॥

అ॥ ప॥ తనివిననదు శాంతవీరులచరి-తంబెంతయు విన్నదివ్యామృతంబెన్న॥

చరణము

వీరులాపాండవేయులు ద్రుపదుని - వీటనుండుటనంతచారులవలన దెలిసి
కౌరవాగ్రజుడు కడు విచారించి - కడగియొక్కనాడు తండ్రికిట్లనియె॥

ఉ. ఏవురు లక్కయింట మర ♦ ణించిరి పాండవు, లింక నాకు ధా
త్రీవలయమ్ము సర్వమున ♦ ధీనము గాగలదంచు నమ్మితిన్;
దైవవశమ్మునన్ బ్రతికి ♦ ద్రౌపదిగూడుక యున్నవారు మో
దావహులై వసించి ద్రుప ♦ దక్షితినాథుని పట్టణంబునన్.

శా. రానేవచ్చెను లక్కయింటనిడి కా ♦ ల్పంజూచినా మన్నవా
దీనాడయ్యెదిపోదు పొమ్మనిన, సా ♦ ధింతుర్ విరోధమ్ము, మా
మానేస్తమ్ములు ద్వేషగర్భితములే ♦ మాడ్కిం బ్రశాంతింప వా
పై నింజూతముగాక, పాండవుల బి ♦ ల్వంబంపుమీ వీటికిన్.

సీ. కల్పింతు నన్యోన్య ♦ కలహముల్ పాండుభూ
పాలతనూజ పాం ♦ చాలురకును
నేయింతు నెడబాటు ♦ చెలువకారణముగా
దివిరి కౌంతేయమా ♦ ద్రేయులకును
ఘట్టింతు విముఖత్వ ♦ ముం గృష్ణపై బాండ
వులకు వేర్వేఱ భా ♦ ర్యలను గూర్చి

తొడరింతును విరక్తి ♦ ద్రోవది కా పాండు
పుత్రులపై గల ♦ మోహమూడిపి
తే. గీ. తొలుత భీముని వధియించి ♦ బలవిహీను
లగు యుధిష్ఠిరపార్థులు ♦ యమల గెడపి
తన్మావలయు మేలుకొందు ని ♦ ష్కంటకముగ
వారలం బిల్వబంపు స ♦ త్వరము, తండ్రి!
వ. అన విని ధృతరాష్ట్రుండు మతిమంతులతో విచారించి చేయుదమని భీష్మ ద్రోణ విదుర కృపాశ్వత్థామ సోమదత్తాదులం బిలువం బంది దుర్యోధను విధానం బెఱింగింప భీష్ముండు సుయోధనున కిట్లనియె.

శంకరాభరణము—ఆది

ప॥ తెలివి మాలి దాయాదుల వైరము
దెచ్చుకొనకు విను నాయుపదేశము ॥తె॥
అ॥ ప॥ బలవంతులు గుణవంతులు కౌంతే
యులు నలువురకుం దలలో నాల్కలు ॥తె॥

చరణము

కౌరవులని పాండవులని భేదము గన్పట్టదు నాకనము లుభయులును
మీరు వారు పంచికొనుట మేలగు 'పోరుసల్పమును బాందులాభమగు' ॥తె॥
చ. భరతకులాగ్రగణ్యుల, స ♦ భాజనయోగ్యుల, బాంధవపుత్రుల
న్నిరుపమధర్మతత్పరుల ♦ నీ పినతండ్రికుమారులన్ మనం
బెటియ వధింపజూడకు మి ♦ దే కులనాశనకారణం బగుం
'జెఱుపకురా చెడేవని వ ♦ చింతురు గాదె బుధుల్? సుయోధనా!
సీ. అనివనాలించి యుం ♦ ధన్నృపాలు డపాండ
వేయుల రావించి ♦ విదురు నంపి,
కరిపురి నేనువ ♦ త్సరములు దుర్యోధ
నాదులతో నుండు ♦ నంత ధర్మ
నంభవు నర్ధరా ♦ జ్యమ్మున కభిషిక్తు
నలిపి వారికి నివా ♦ నమ్ముగాగ

ఖాండవప్రస్థమ్ము ♦ గావించి చెలమి నం
దగ ధర్మజాదు లా ♦ వలనికి జని

తే. గీ. యమరనాథు డింద్రప్రస్థ ♦ మనజెలంగు
పురవరంబొందు విశ్వక ♦ ర్మరచితమ్ము
వాసుదేవ ప్రియమ్మగా ♦ వారి కొసగ
ధర్మజుండందు శుభముహూ ♦ ర్తమున విడిసె.

మలయమారుతము—రూపకము

ప॥ భళిరా తత్పురవరంబు - వసుధకలంకారంబు ॥భ॥
అ॥ ప॥ తలపగ సిరికాటపట్టు-ద్వారకకదితోడబుట్టు ॥భ॥

చరణము

వేదవిదులు భూదేవులు - వీరవరులు ధరణీధవు
లాదెనభేరులుకుబేరులు - శుభభక్తిపరులు పాదజులెల్ల రుహాళికులు॥మి
సోదరులంబలె పరపురు - షులగనుగొని నిజకులమ
ర్యాదనిలుపు బరమపతి - వ్రత లావీటి వెలందులు ॥భ॥

ఉ. లేరు దయావివర్జితులు, ♦ లే రవివేకులు, లేరు మూండగుల్
లేరు దురన్నభక్షకులు, ♦ లేరు ని రక్షరకుక్షులున్, దురా
చారులు లేరు, లేరువ్యభి ♦ చారులు, చోరులు లే, రసత్యవా
చారతు లప్రయోజకు ల ♦ శాంతు లభాగ్యులు లేరు తత్పురిన్.

వ. ఇట్టి యింద్రప్రస్థపురంబున ధర్మజుండు నల్వురు తమ్ములుం దనకు విధేయులై యుండ సర్వజనానురంజకమ్ముగ బ్రజా పరిపాలనం బొనర్చునెడనొక్కనాడు నారదమహర్షి యతనిపాలికరుదెంచి సత్కృతుండై తిలోత్తమాకారణంబున సుందోపసుందులు మరణించిన వృత్తాంతం బెఱుకపరచి ద్రోపది యొక్కొక్కనియింట నొక్కొక్క యేడుండునట్లును, ద్రోపదియున్న యింటికి వెఱవారు చనకుండునట్లును, చనిరేని పండ్రెండుమాసాలు తీర్థసేవసేయునట్లును సమయంబు సేయించి యథేచ్ఛంజనియె. కొండొకకాలంబున కొక్కనాఁడొక విప్రుండు ముచ్చులచే దనహోమధేనువుం గోల్పడి యాక్రోశించుచుండ విజయుం డదివిని పాంచాలీసహితుండై యున్న ధర్మనందను

నాయుధాగారంబుపొచ్చి ధనువుంగొని చోరులంబరిమార్చి బ్రాహ్మ ణునకు గోధనంబొసంగి క్రమ్మఱివచ్చి యుధిష్ఠిరునకు మ్రొక్కి-యిట్లనియె.

చక్రవాకము - ఆది

ప॥ సమయభంగముగ నరుదెంచితి నీ సదనంబున కేను -
అన్యానుగుణ సంపన్న ॥స॥

అ॥ప॥ అమరమునీంద్రునికడ నుడివినయటు - లాచరించువాడ
ద్వాదశమాసిక వ్రతము ॥స॥

చరణము

చోరులంగొడపి గోధనమును భూ • సురునకిడ దలపునన్
ధనువునకై నీయిలు జొచ్చితి
వేరందినరాజులకు ధర్మము - మేరమీరు నొడలన్
నల్వురు మనల బరిహసింతురు ॥స॥

తే గీ. పలికిబొంకు టెన్నడును మన • భరతవంశ
మందు ముందునకైన లే • దఖిలధర్మ
విదుడవీ వటుగాన నే • వేగ నాకు
సెలవొసంగుము భూప్రద • క్షిణ మొనర్తు.

వ. అనవిని ధర్మజుండును.

చ. కుముదహితాన్వయుల్ చకిత • గోకుల విప్రవధూజనావన
క్రమము, లటుగాన భూమిసుర • కార్యముదీర్చితి వట్టి నీకు పా
పము ఘటించునే? సమయ • భంగముగాదిది రాజధర్మ ము
త్తమగతి నిర్వహించితివి • తమ్ముడ ! పోబనిలేదు యాత్రకున్.

వ. అనవిని యర్జునుండును.

ఉ. గోవనితాద్విజావన ము • కుంతిత పుణ్యము లేక పాపమో
దేవుడెఱుంగు, నేపురము • దేవమునీంద్రుని సన్నిధానమం
దావిధి బాసజేసి యిపు • డందులకుం వెలిగా జరించుచో
గోవిదలోక మీపయిని • కుంతికుమారుల గేలిసేయదే ?

ద్వి ప ద

అనవినిధర్మజుం - డంగీకరించి
యనుజాతుసంప, బ్రా - హ్మణులు దీవించి
వెనువెంటరా గ్రీడి - చని తీర్థసేవ
యొనరించునెడల యో - గ్యుల మహీదేవ
గణము బూజించుచును - గని ముదంబూని
ఘనలోక పావనిన్ - గంగాభవాని,
స్నాతుడై యున్న వా - సవసూనుజూచి
కౌతుకమ్మున నాగ - కన్య యులూచి

మోహన - రూపకము

ప॥ అందమైనవాడు వీ - డౌరా నాకీడుజో ॥డ॥
అ॥ప॥ ఇందిరాసతీ నందను - డెనగా డీ యందగాని ॥క॥
1. మోవి జాతికెంపు నగు - మోము కళల సింపు
దేవమానవుల నితనికి - దీటువచ్చు సొగసరితే ॥డం॥

ఉ. ఈ సుకుమార గాత్రుడు, జగ ◆ దేక ధనుర్ధరు గ్రీడికూడి సం
భాసిత ధర్మ మార్గ్యమున ◆ వారిజనాయకదివ్యసంగరో
ల్లాసము గాంచుచుండి, జవ ◆ లాలను నిందుకులప్రదీపు న
వ్వానవి కన్ను బ్రామిగొని ◆ వచ్చియునిల్పె నిజాంగణంబునన్.
తే. గీ. నిలువగా జపమెప్పటి ◆ వలె సలుపుచు
గొంతవడికి గన్దెరచి వా ◆ కొనియె తరుణి!
యెవ్వతెవునీవు? నన్నిట ◆ కేలదెచ్చి
తివు? చెప్పుమన బల్కె నా ◆ తీవబోడి.

శహన - ఆది

ప॥ ఇది పాతాళ ములూచి యంద్రు భుజ
గేంద్రుడైన కౌరవ్యుని కూతుర ॥సిది॥
అ॥ప॥ మదవతీ మదన - నిను మోహించితి
మాయగావించి - నిన్నిట దెచ్చితి ॥నిది॥

చరణము

తావకీన సత్కీర్తి మాజగతి - దవిలి వేనోళ్ళ గీర్తింపగ విని
నీ వయోరూపములకబ్బురపడి - నే మెచ్చితి దెచ్చితి మనసిచ్చితి ॥సు॥

ఉ. కాము వికారమెల్లరకు ♦ గల్గుట నైజము, గాని ముందు నా
రీమణి మోహముఁగా వెలువ ♦ రింపదు పూరుషుపోలె, శీలనై
ప్రేముడి వెల్లడించి విప ♦ రీతగతిం బ్రతిమాలుచుంటి, నీ
లేమ తనంతఁ గోరనని ♦ లేనివిరాగము జూపబోకుమా.

వ. అనా విని యర్జునుండును,

చ. సరి సరి, దానికేమి యొక ♦ సంగతి విన్మిటు బ్రహ్మచర్యమున్
నెఱపుచు భూప్రదక్షిణము ♦ నే నొనరింపగ బుణ్యతీర్థముల్
దిరుగుచునుంటి, నల్వురి గ ♦ తిం గయికొన్న వ్రతమ్ము వీడి సుం
దరి! నినుగూడుటొప్పునొకో? ♦ నా పయి నిందను వైచుటొప్పునో?

వ. అనిన సులూచియు,

క. ఎఱుగుదు మీ పలికిననుడి
సుర ముని కిడ, సత్రశాల ♦ జొచ్చుటయు, యుధి
ష్ఠిరు నాదేశమ్మున నీ
వరుదెంచుట తీర్థసేవ ♦ కై, మహానీయా!

చ. వ్రతములు, తీర్థయాత్రలు, జ ♦ పమ్ములు, మానితదాన ధర్మముల్
సతతము బ్రాణదాన సదృ ♦ శమ్ములుగావు, మదీప్సితం బసం
గతమగునేని పో విడుతు ♦ గాయము నేడు మనోజవేదనన్
బతితము గట్టుకోకు, వ్రత ♦ భంగము జేకుర దో మనోహరా!

తే. గీ. పొలతివలచిన బురుషుండు, పూరుషుండు
వలచిన బొలంతి లోలోన ♦ వలపు గలిగి
పైకి బింకపునేత లే ♦ ర్పడ నటింతు
రిదియు కాముక లక్షణం ♦ బెనెఱుగుదు.

వ. అని పల్కు-సంత నర్జునుండు దాని మనోరథంబు దీర్ప దలంచి.

కాఫీ—ఆది

ప॥ వ్రతభంగంబగు గాక సుందరీ - వశగమైతిని నీకు విరహాగ్నిబడకు ॥వశ॥

అ॥ ప॥ పతితమో పుణ్యమో విచారింప - వలనుగాదు మనకు
సమయోచితమే కర్తవ్యము ॥ప్ర॥

చరణము

మానవతుని క్రొవ్వాడి కోలలకు - ప్రముక్తికుండ దరమా
పరము మహర్షుల కైనను
మానసయున వాడివయనువారము - గాన తలప మనమెంత
వీడు మిక వలవంత ॥ప్ర॥

చ రతనపుటందియల్ నడక • లన్ ఘలు ఘల్లుమనన్, పయోధర
ద్వితయభరమ్మునై పసిగ • తీగ వడి గొనసియాడగా, దర
స్మిత పదనారవిందయయి • చేడియ చెంతకు జేరి నిల్చినన్
వ్రతములు సాగునే ? జప త • పమ్ములు సెల్లునే ? వేయునేటికిన్.

మంజరులు

నాగసతి గనెవిరావంతుడను త - నయు సద్యోగర్భమున
వేగుజామునకు నింద్రసూను ని - ల్పెను గంగాతీరమున
జగతీసురులకు భుజగలోకమున - జరిగిన వృత్తాంతంబు
నగవైరిసుతుం డెఱిగించి ప్రయా - ణంబయ్యె తత్క్షణంబు.

సీ. హిమవన్నగేంద్ర మీ • క్షించి యూపై నగ
స్త్యవటమ్ము గనుగొని • యచటినుండి
వెడలి పూత హిరణ్య • బిందుతీర్థంబాడి
నైమిశారణ్యమ్ము • నను నడుగిడి
తరలి ప్రయాగ కం • తట మణికర్ణిక
న్గాంచి కాశీపట్ట • ణంబు జేరి
సనుతించెను మహేంద్ర • శైలమ్మునకును ద్రా
క్షారామమునకు శ్రీ • శైలమునకు

తే. గీ. నవనిసురుల కయ్యెడల దా • నాదికము లొ
సంగి తృప్తుల గావించి • శక్రసుతుడు
వాసిమై పదమూడవ • మాసమునను
తగ ప్రవేశించి మణిపూర • నగర మందు.

తే. గీ. ఆపురంబేలు చిత్రవా • హను, డతండు
తనతనూజాత చిత్రాంగ • దయను దాని
పాండుతనయునకిడి మహా • వైభవ బు
దగ వివాహమ్ము గావించి • ధన్యుఁడయ్యె.

వ. ఇట్లర్జునుండు చిత్రాంగదను వివాహంబై యోగజక్రీడలనోలలాడుచు నొక్కనాఁడు తత్సమీపంబుననున్న సౌభద్ర పౌలోమ కారంధమ ప్రసన్న భారద్వాజంబులను పంచతీర్థంబులంగని యందు స్నానం బొనర్చి తపస్సంపన్నుండగు నొక బ్రాహ్మణుని శాపమ్మున మహా గ్రాహమ్ములై నీటబడియున్న వంద, సౌరభేయి, సమీచి, బుద్బుద, లత యనువారల శాపవిముక్తులఁజేసి మగిడి మణిపూరపురమ్ముఁజేరి చిత్రాంగదయందు బభ్రువాహనుఁడను పుత్రుంబడసి యటనుండి పయనమై పవిత్రతీర్థముల సేవించుచు, గడకు ద్వారవతీపుర సామీప్యమ్మున కరుదెంచి, సుభద్రం జూచు తలంపున నప్పురంబున నొరులు తన్నెఱుంగకుండ యాదవులు యతుల కతి భక్తులగుటంజేసి కృతకయతివేషధరుండై చరించు పాండవమధ్యముని ప్రభాసతీర్థమ్మున పుండరీకాక్షుండు గుర్తించి యతిస్నేహమ్మునం గౌగిలించుకొని యెల్లవారి కుశలమ్ము లడిగి సుభద్రయం దాతఁడు బద్ధానురాగుండగుట నువలక్షించి యతనిందోడ్కొనిద్వారకాపురంబునకు నరుదెంచి రైవతకాద్రిపైనుంచి యామరునాఁడు రైవతకమహోత్సవమ్ము సాటించి యాదవులెల్లర నయ్యెడకు రావించి యాతనికి నమస్కరింపజేసిచాతుర్మాస్యమయ్యెడనొసగ్నబలరామాది యాదవులచే బ్రార్థింపజేసి పరిచర్యార్థంబు సుభద్రను నియోగింప.

సీ. ముఖసరోజమ్ముపై • మునురు బంబరములం
గని దోలుకొనలేక • విసువుకొనుచు
నధరబింబమ్మున • కాశించి పై వచ్చు
శుకపాళి విడ దిక • మకలువడుచు
జనుగట్ల విహరింప • మునుకొనిపెన్నంటు
శారికావితతి మ • త్సరముబరపి

కరపల్లవమ్ముల • దరిజేరు పెనుగండు
కోయిలపిండును • గూకలిడుచు

తే. గీ. పదునిడిన పుష్పసాయకు • ప్రసరిమునగ
నన్నురయానతి రైవత • కాద్రి కరిగి
యతివరేణ్యునకు నమ • స్కృతులొనర్చి
భయము భక్తియు వినయము • వ్వతిల బలికె.

జంఝూటి—ఆది

ప॥ సామి నీకు పరిచర్యగావింప - జనుదెంచితి నాపెద్దలయానతి ॥సామి॥

అ॥ ప॥ నీమనోరథము దీర్పవేసోల - నేధన్యురాలనగుదు నీలీల ॥సామి॥

చరణము

కామాదులగెలిచినమిము గనగా - కన్నుదోయి మున్నేమినోచెనో
కామితార్థ సంధాయక బుధుల - కల్యాణాత్మక మానుమీరాక॥

క. ముదమొదవగ గనుసన్నల
పదములమతి బరిచరింప • జనుదెంచితి నీ
వెదనింత సంశయింపక
యదియిదనక వలయునేవ • లందుము సామీ !

వ. ఇట్లుపల్కి యతివరేణ్యునకు సేవలొనర్చుచుండ నతండును,

సీ. ననబోడి చెలువమ్ము • గనుగిచ్చి చూడంగ
వలపుగాకుంటగ • న్నులటమోడ్పు
కోమలికై దండ • గొన నానవడి వేగి
రము గూడదంచు దం • డముధరించు
నెలతకెమ్మోవితే • నియలాన వీల్గాక
యల కమండలుజలం • బాచమించు
వగలాడిబల్కరిం • ప గడంగి తగిప్పగా
దని పల్కు 'నారాయ • ణా' యటంచు

తే. గీ. మనసునందునమన్ సిగ్గు • వెనుకకు దిగ
లాగ నెటు సాహసింపనే • రక, పలుమరు

సమ్మరంచును వేడి ని • ట్టూర్పుబుచ్చు
నకట! కుహనాయతీంద్రు డ • య్యర్జునుండు.

సీ. కనుసన్న జేసి ర • మ్మనె సామి పిలచెను
యన బూటుతెచ్చితి • వా యటంచు
చేవీవగ మహాను • భావ! మీయాజ్ఞ యే
మన వేగవడ్డిప్పు • మా యటంచు
చిఱునవ్వునవ్వ మీ • చిత్త మేమన్న నీ
సేవలకున్ సంత • సిల్లితివంచు
పెదవులన్ విఱువ త • ప్పిదమేమనన్ ఒహహా
కృతిజేతు నీకు నే • గతి నటంచు

తే. గీ. లోఁగలుగు గాఢతరకామ • రాగమెల్ల
బయలుసేయంగ సంకోచ • పడుచు వలయు
నితర వాంఛల వెలిబుచ్చు • నెంతయేని
కష్టసాధ్యము తొలి మాట • గలుగ కొనుట.

చ. అనిమిషరాజనందను న • మంచిత రూపవయోవిలాసముల్
ఘనముగ విన్నదాట సరి • గా యతిశేఖరునందు నట్టి ల
క్షణములగాంచి యబ్బురము • గా ననుమానపడున్ సుభద్ర, తా
దనుకొను నుండరేచునుచు • నచ్చుగ మానిసి బోలు మానినుల్.

వ. అని తలంచుచు నొక్కనాడు యతిపర్యంగని.

హిం—తోడి—మిశ్రగతి

ప॥ ఓయతీంద్ర దయానిధే మి - మ్మొకటి యడుగ దలంచి యుంటిని -
నా యెడల గరుణించి తెలిపెదరా సర్వజ్ఞులున్ మహా - నీయ
మూర్తులు కాలవిదులు గదా ॥యో॥

అ॥ ప॥ ఏయేదేశము లేయే తీర్థము - లేయేవనము లేయే నగేంద్రము
లేయేనగరము లీరు జూచితిరి - యందందు గల యేయే విశేషము
లీరు గాంచితిరి ॥ఏ॥

చరణము

మీర లమరావతికి బ్రతిదై - మీరు నింద్రప్రస్థమును గనుఁ - లార నెందెం
దైన జూచితిరా - తన్నగరమున ధీయుతుల గుంతీసుతుల గను
గొనిరా - వారలెల్లరు సుఖముగా ను - న్నార గురుధర్మాభిరతులై -
వారిలో వీరాగ్రగణ్యు బురం - దరసూను నర్జును - పాపవర్జను
మీర లెఱుగుదురా ॥ఓయతీంద్ర॥

తే. గీ. అన్నయానతి దీక్షయా ◆ త్రాభిగమను
డయ్యె నర్జునుఁడనివింటి ◆ నమ్మహాత్ము
మీర లెయ్యెడనైన గ ◆ న్నారలొకొ?
క్రమ్మఱి పురంబుజేరు వా ◆ ర్తలు దెలిసెనె?

వ. అన విని కృతకయతిగ్రామణియు

క. కనుగొంటిని తన్నగరము
గనుగొంటిని పాండవుల, ◆ ను ◆ ఖమ్మున నున్నా
రనిమిష రాజతనూభవు
గనుగొన్నాఁడ నతఁడేమి ◆ గావలె నీకున్?

వ. అనిన నాకృష్ణసోదరియు

పినాహన — చతురశ్రగతి

ప॥ దైవనములు మీ రెట్లు నాకింక - దాపనకంబేటికి ముమ్మాటికి ॥దై॥
అ॥ప॥ వాని కతఁడు మేనత్త కొడుకుగా - వలయు నాకు నిజము మహానుభావ॥

చరణము

కుంతి నాకు మేనత్త తనకు నే - కోడలి నగుదు నటంచు జెప్పికొను
టెంతయు నాతలిదండ్రు లనుకొందు - రింద్రనుతుఁడు తమకల్లుఁడౌ
నంచు ॥దై॥

క. నరుఁ డెందు గాంచి రిచ్చటి
కరుదెంచునె? పెద్దవార - లనుకొను మాటల్
జరుగునొకో? కరుణన్నా
కెఱిగింపుఁడు కాలవేత్త ◆ లిరు మహాత్మా!

వ. అనవిని,

సీ. ఏమందు నాయన • రే మేమొగా నుంటి
మెమ్మోయి సుదతభే • దమ్మలేక
కలసియున్నాము గో • కర్ణమం డిరుపుర
మెన్ని రే: దినమ్ము • లింతయేల?
తెలిసి మాచేయని • తీర్థయా త్రలు లేవు
క్రీడి నేడిచట ను • న్నాడసంగ
లజ్జించిపోదుదో? • రమణి నీవెఱుగవు
యతివేషధారియై • యులదు సిచట
గీ. చెంతనేయున్న మగని పో • ల్చికొనలేవు
దాచనేటి కర్జునుడ నే • తరుణి! పురుషు
లంగనల పొందురోసి న • న్యాసులగుదు
రంగనను గోరినేను స • న్యాసినైతి.
క. అని జేజే రాకొమరుడు
వనజేక్షణ పాణి వల్ల • వమ్ము బట్టుకొనన్
నునుసిగ్గు దొంతరల నె
మ్మనమున నారాటమొదవ • మానిని పలికెన్.
తె. పెద్దలెఱిగి మనకు • పెండ్లిగావింతురు
వేగిరమ్ము తగదు • నిలువుమంచు
జనె సుభద్ర పురికి • జలజనాభుండదీ
యెఱిగి సతులకెల్ల • నెఱుగజేసె.
సీ. తోబుట్టువుకొనంగి • దుర్యోధనునకు బెం
డిలిసేయ దనయున్న • తలచు టెఱిగి
నగధరుండంత నం • తర్ద్వీపమం దిందు
ధరునకు శివున కు • త్సవముసేయ
జాటి, యాదవుల న • చ్చటికిగొంపోయి నం
బరము తీఱినవెన్క • మగిడివచ్చి
బలదేవముఖ్యుల • నిలిపి తద్వీపమం
దంగనాజనము వె • న్నంటిరాగ

తే. గీ. పాండునందను రావించి ♦ ద్వారవతికి
తోడరి వాచస్పతి పురోహి ♦ తుండుగాఁగ
సమరపతి సంతసిల వైభ ♦ వమున బరిణ
యమ్ముగావించె నాసుభ ♦ ద్రార్జునులకు.

వ. ఇట్లు సంకల్పసిద్ధు డగు నగధరు సం సంప్రాప్తమనోరథుం డయిన పార్థున కక్షీణబాణ తూణీర బాణాసన సనాథంబగు నొక్కరథం బిచ్చి సుభద్రం దోడ్కొని యింద్రప్రస్థపురమ్మున కరుగుమని పంచి యంతర్ద్వీపమ్మున కరుగ విజయుండు సుభద్రం దోడ్కొని చనుచున్నంత పృథుశ్రవసుడాదిగాఁగల మహావీరులగు పురరక్షకు లెల్లరు బురందరసూనుని కడ్డము తాకిన నప్పాండవేయుం డలిగి వారలపై శరపరంపరలం గురియించుచుండె.

కళ్యాణి - చతురశ్రగతి

ప॥ రథమునడపె పెండ్లిబావ కయ్యాడ - రణరంగసహాయముగా సుభద్ర॥
అ॥ప॥ కుచులుగా ఘల్లుమని కరకంకణ - మ్మృదుమధురారావములుప్పతిల్ల॥

చరణము

జిలుగుబంగారుచీర ముంగొంగు - లలవరించి వింతగ గోచిపెట్టి
కలువతేనె దులకించుమోమునన్ - లలిత వీరరసము తాండవింపగ ॥ర॥

తే. గీ. సమరమున బాణవాల్ద్రార ♦ కొమరుడు జయ
మంది తోడ్కొని చనియె బ ♦ ర్వేందువదన
నయ్యదియెఱింగి బలదేవు ♦ డాగ్రహించి
సేయునదిలేక మందలిం ♦ చెను వారి నిటు

సరస్వతి - ఆది

ప॥ మాయలమారివి తమ్ముడా నీదు -
మాట నమ్మరాదు - నీనె జమ్మపోదు ॥మా॥
అ॥ప॥ తోయజాక్షి నాక్రీడి కిడి పెండ్లి - సేయదలచిగాదే -
నన్నంతర్ద్వీపమం దుంచితివి ॥మా॥

చరణము

ఎటుజేసిన నటు సాగుగదా నీ - కీద్వారకలోన
విన్నన్న జెప్పినదె వేదం ॥ఎటు॥
కటకటా! తెలియనైతి సితలవు - కపటికిరా నీ
నోరుమాటాడ - నౌనలు వెక్కిరించును ॥మా॥

చ. ఘనులు జితేంద్రియుల్ విగత ◆ కల్మషులంచు వచించి, శక్రనం
దనునకు నెయ్యెక్కువ్రుంబసు లో ◆ నర్ప నహోరించి నొప్పగించి, నే
ర్పున నిటుపెండ్లిజేసితి వె ◆ ఉంగమి కార్యము తప్పివచ్చె నే
మనుకొని యేమి లాభమిపు ◆ డన్నియు దీటినవెక్క తమ్ముడా!

వ. అని విని జగన్నాటకసూత్రధారుండగు కృష్ణుం డిట్లనియె

క. నీకింత తెలియకున్న? త్రి
లోకైక మహాధనుర్ధ ◆ రుడు విజయుండా
పాకారితనూభవునకు
గాక మఱొకనికి దగునె ◆ కన్నియ నిడగన్?

వ. అని సమాధానపరచె నట నర్జునుండు సుభద్రాసహితుండై యింద్ర
ప్రస్థపురమ్మునకేగి యెల్లవారి మన్ననలం బడసె నంత వాసుదేవుం
డును వసుదేవ బలదేవ సాత్యకి ప్రద్యుమ్నాది యాదవులం గలిసి
యింద్రప్రస్థపురమ్ము సొచ్చి పాండవ సత్కృతుండై యమూల్య
దివ్యాభరణమ్ము లెన్నియేని సుభద్రకిడినాఁడు. బలదేవాది యాద
వులు సుభద్రార్జునులం గని సంతసించి ద్వారవతికిం జనిరి. కృష్ణుం
డింద్రనందనుతోడి యిష్టవినోదంబుల నింద్రప్రస్థమ్మున నుండె నంత
సుభద్రార్జునులకు కులదీపకుండై యభిమన్యుం డుదయించి ధౌమ్య
కృత జాతకచౌలోపనయనుండై పెరుగుచు దండ్రికడ ధనుర్వేద
మభ్యసించుచుండె ద్రుపదనందనయు పాండుకుమారుల వలన
ప్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులను వారి
బంచోపపాండవులను బడసి యిట్లు పాండునందనులు పుత్రవంతులై
సుఖముగ రాజ్యపాలనం బొనర్చు చుండిరి.

శ్రీ

# మహాభారతము

## పాండవ రాజసూయము

కళ్యాణి—మిశ్రగతి

ప॥ వినుడు పాండవ రాజసూయము - విబుధగేయము కర్ణపేయము ॥వి॥

అ॥ ప॥ కనుడు దీనసమస్తశ్రేయము - లనుపమభవతరణోపాయము ॥వి॥

చరణము

తన్నునమ్మిన ధర్మపరులకు - దైవమెల్లప్పుడును దోడ్పడు

తెన్నుదప్పిన మానినుల కెం - దేని జయముగల్గు నిక్కము ॥విను॥

సీ. దహనుండు మున్ను శ్వే ♦ తకియను రాజర్షి
గావించు సత్రము ♦ గతున నాజ్య
మెక్కుడుగా ద్రావి ♦ నక్కటమ్మున నగ్ని
మాంద్యమ్ము వొడమ దా ♦ మరి నగర్భు
నాదేశమునను ది ♦ వ్యౌషధీయుక్త ఖాం
డవము దహింపగ ♦ డంగి యింద్ర
వారితుండై కృష్ణ ♦ పార్థుల జేరి గాం
డీవాక్షయశరతూ ♦ ణీరములు బ్ర

తే. గీ. ధాత్మజునకు, కౌమోదకి ♦ యను గదయును
మఱి సుదర్శన చక్రంబు ♦ మాధవునకు
వరుణుచేత నిప్పించి వే ♦ గిరము ఖాండ
వము దహించు కర్జమున కు ♦ పక్రమించె.

క. తివిరి వాలుతాశను డా ఖాం
డవము దహించునెడ మయుం డ ♦ నందగు నొకదా

నవ విశ్వకర్మ వెలువడి
యవశుండై సందనంగ ♦ నాథునకు కనెన్

హా॥ భైరవి — చతురశ్ర

ప॥ త్రిజగన్మాన్యులు దీనశరణ్యులు - శ్రీపాండుసుతులారా రక్షింపుడు ॥శ్రీ॥

అ॥ ప॥ సుజనావనతత్పరులు దయాళువు
లజరామరణశీలుల్ - మహాత్ములు శ్రీ

చరణము

వినుడీ దానవ విశ్వకర్మనో - వీరాగ్రణులారా, నుయుండను ॥వీ॥
జనకసమానులు సకలాశ్రితజనసంరక్షణులు సత్పుణ్యులు ॥త్రి॥

ద్విపద

అనివేడు మయుని గ్రా - ప్రార్థనులెలమి
వనమునసుండి తా - పాడిరి చెలిమి
బనితీఱ సెలవంది - చనె బావకుండు
వనజాక్షునసుమతి - మ్మున నా మయుండు.

సీ. పవడంపు గంబాల ♦ పై మేలిపీడల
కలిమికిమ్ముగు పెడి ♦ కప్పు నిలిపి
నెలమానికంపు గో ♦ డలకు సున్నంపు నీ
లాలచున్నాల కిటి ♦ కీల జొన్పి
క్రొత్తమేల్రతనాల ♦ కత్త్రాళ్లవ నం
చెలదరి నీటి తా ♦ వుల సమర్చి
మొగసాలఫక్కి మ ♦ త్రిగజాలచే దళ
త్తళలీను సిల్వేట ♦ ద్వాలదార్చి

తే. గీ. చిఱునగవుపల్కు లొల్కించు ♦ చిత్రపుత్రుల
నందచందమ్ములమర నం ♦ దంద వ్రాసి
నేతనేరుపు వెల్లడి ♦ నేయ మయుడు
కుంతికాన్పునకిడె గొల్వు ♦ కూటమొండు.

తే. గీ. గాలికొమరున కొక శత్రు ♦ ఘాతిని యను
గదయు, దేవదత్తమను శం ♦ ఖము సురేంద్ర

తెనయున కొసంగిచనె; నంత ♦ ద్వారవతికి
బోయె బనితీఱుకతన నా ♦ రాయణుండు.

సాంగత్యము

నారదమునీశ్వరుఁ డొకనాఁడు ధర్మ నం - దనుపాలి కరుగుదెంచి
చారుతరపుణ్యకర్మదత్త - త్సభావిశేషము గాంచి
యెనగావు దీని కా టగిట సభ - లేని యన ధర్మజుండు
వినిపింపు తత్సభావిశేషముల్మ - లన సుడిచె నారదుండు.

ససరోజా — ఆది

ప॥ వినుము సురేంద్ర సభావిశేషముల - వినిపించెద
రాజా రవితేజ - శ్రితకల్పభూజ ॥విను॥
అ॥ ప॥ అనవరత కుసుమఫలభరిత - భూరు
హానీకంబై - కామగమనమై ॥విను॥
చి॥ అనుపమాన విభవాభిరామమై - ఘనతరానంద సంధాయకమై
కనువందువుగానుంచు సచ్చోట - గనరావట శీతాతపబాధలు ॥వి॥

చరణము

ఆకలిగొనివచ్చిన నిరుపేదల - కన్నమిడుగారు సూనృతవ్రతులు
ప్రాకటముగ వర్ణాశ్రమాచార-పద్ధతి విడక నడచు గృహమేధులు
చి॥ సాకల్యయజ్ఞకర్తలును ఘోర-సమరాంగణనిహతులు ధీమంతులు
సాకారింగూడి వినోదింతురు - శోకజరారుజమృత్యువుల్దొలఁగి ॥వి॥
వ. మఱియు నరకవాసుల తెఱంగెఱింగింతు వినుము.

సీ. నిగమోక్త విధులమా ♦ నినవారు, పరదూష
కులు, దముదా మెచ్చు ♦ కొనెడువారు,
పరులయున్నతికోర్వ ♦ వడువారు, వర్ణసం
కరులు, చేసినమేలు ♦ మఱచువారు,
గరదులు, సుజనాప ♦ కారులు, మెట్టవే
దాంతులు, కూతుండ్ర ♦ నమ్మువారు,
లంచగొండులు, సువ ♦ ర్ణస్తేయు, లన్యకాం
తాంతుల్, సంగ్రామ ♦ భీరువులును

తే. గీ. కలిగి కన్నట్టి నతిభయంబు ♦ కరము వేగ
కాలునిం డోలగంబు నందు ♦ గలసి నేను
పాండునరపతి నీతండ్రి ♦ భవ్యమూర్తి
తామరసమిత్రసన్నిభ తేజ! ♦ ధర్మరాజ!

తే. గీ. రాజసూయమ్ము నొనరింప ♦ నీజనకుడు
త్రిదివమున కేగు, నిన్ను బ్రబో ♦ ధింప బంపె
బాండునరపతి నను; గద ♦ ధ్వార మొకర్చి
కన్నతండ్రికి గూర్చు నా ♦ కేమున నునికి.

క. అనిపల్కి దేవమునిచన
జనపతిరావించి కృష్ణు ♦ నవినయమున మా
ననియోగం బంతయు వా
కొన, దేవకికొడుకు కుంతి ♦ కొడుకున కనియెన్.

పూర్వకల్యాణి—ఆది

ప॥ నేయుమా రాజసూయము గుణ-గేయ కౌంతేయకీర్తనీయము ॥నే॥
అ॥ ప॥ నీయనుజులు భువనైకవీరులై - నాయుపదేశనీకిదే రపాయము ॥నే॥

చరణము

ఈరేడుజగము లెత్తివచ్చిన జ - యింపజాలుమగలు నీ - తమ్ములు
వీరమాత మాయత్త కుంతి కురు-వీరులార దేవసఖులు మీరలు ॥నే॥

మ. సకలోర్వీశుల గెల్చి నేయవలె నీ ♦ జన్నంబు కౌంతేయ! ద్వా
రకలోనుందు సముద్రమధ్యమున నే ♦ రాజన్యు నోడింపనే
రక యున్మాగధు నెట్టులే నతని దో ♦ ర్బలం గూలనేయించి త
ప్పక నేయింతును రాజసూయమును బా ♦ వా! లోకముగ్గింపగన్.

వ. అనిపల్కు నందనందనుపలుకుల కనుగుణమ్ముగ భీమసేనుండి ట్లనియె.

ఉ. శౌరికటాక్షము న్నరుని ♦ సాయము కల్గి బృహద్రథాత్మజున్
భూరిబలాఢ్యు యజ్ఞపశు ♦ వుంబలె నే వధియింతుగాన న
న్నా! రచియింపు మాసవన, ♦ మర్జునుడ వాదువు, కన్నతండ్రికిం
గూరిమిమీర సద్గతుల ♦ గూర్చు తనూజుడెపో తనూజుడా.

వ. అనవిని రాజసూయ నిర్వాహణంబున నుత్సహించి కార్యసిద్ధి యయ్యెడు నరుగుండని పంచిన పాండవాగ్రజు వీడ్కొని,

సీ. ప్రియమారగా కృష్ణ • భీమార్జునులు కృత
స్నానులై మగధ దే • శంబు సొచ్చి
చైత్యకాచలశృంగ • సామీప్యమున బిట్టు
ధ్వనియించు భేరులం • బగుల మోది
యద్వారమున జొచ్చి • యా గిరివ్రజమందు
బలిమిమై గంధమా • ల్యముల దాల్చి
కేసరిత్రయము గో • వాసమ్ము సొచ్చుమా
దిరి జరాసంధు మం • దిరము సొచ్చి

తే. గీ. నిలువ నభ్యాగతుల వోలె • నృపవరేణ్యు
డెదురువని మధుపర్కమ్ము • లీయ గొనక
సాభిలాషేక్షణమ్ముల • నరయు ముగుర
గాంచి యనుమానమందె మా • గధుడు పల్కె.

బేగడ—ఆది

ప॥ ఎవరుమీరు నడురేయి జనుదెంచి-యిటు లభ్యాగతవేషధారులై ॥ఎ॥
అ॥ వివరింపుడు నాయిడుమధుపర్కములు - లపమతిగొనక నిరాకరించుకత॥

చరణము

పూలుచందనము బలిమిమీర గై - కోలుధర్మముగునె స్నాతకులకు
ప్రోలుచొచ్చనగునెయద్వారమ్మున - జాలమేల? కలరూపువచియింపు॥ఎ॥

మ. అవనీదేవ పదాంబుజాత నిరత • ధ్యానైకచిత్తుండ, బై
రవపూజాపరతంత్రుడన్, నిఖిల ధ • ర్మాధర్మవిజ్ఞాత, నే
నవమానమ్ము ఘటింపనేరిక్కి, ననూ • యాగ్రస్తుడంగాను న
న్నవలోకింపకు డన్యథా, తెలుపర • య్యా! మీయుదంతమ్ములన్.

వ. అనవిని కృష్ణుండిట్లనియె.

దర్బారు—రూపకము

ప॥ తెలియక యిమ్మడిగెడవో - తెలిపెద నాకర్ణింపుము ॥తె॥
అ॥ ప॥ సలలితవీరక్షత్రియ - జాతిస్నాతకులమేము ॥తె॥

1. కుసుమచందనములందున - వసియించు నళిం బిందిర
వసుమతీశ! యటుగావున - బలిమిమీర గైకొంటిమి ॥తె॥
ద్వారమ్మున మిత్రులు న - ద్వారమ్మున శాత్రవులా
గారముజొచ్చుటధర్మము - గావళాసె నీమర్మము ॥తె॥

ఉ. ఏయుపచారమున్ సలుప ♦ నేరికటంచు వచింతువేల, నో
ర్మ్యాయము సర్వగాగలరు ♦ లోకులు భైరవపూజయంచు భూ
నాయకులన్ వధించుట ఘ ♦ నంబనుకొంటివొ? కండగించి నీ
నేయని పాపముల్గలవె ♦ ఛీ! తులువా! నిను గాచుకొమ్మికన్.

సీ. వరగిరివ్రజ వనాం ♦ తరవాసియగు జరా
సంధనామకగంధ ♦ సింధురంబు
కఠిన కారాగార ♦ కాసారగత సమ
స్తావనీనాథ రా ♦ జీవతతిని
కరవాల కరముచే ♦ గావించు ఛేదమ్ము
నావ హుంకార గ ♦ ర్జారవముల
కృష్ణభీమార్జున ♦ కేసరిత్రితయమ్ము
యమ సేనాజాతాంత ♦ కాజ్ఞనంది

తే. గీ. రాజితోద్దండ పక్రమ ♦ క్రమ మెలర్ప
నఖిలశస్త్రాస్త్ర శాతన ♦ ఖరాగ్రవితతి
ప్రథిత మస్తిష్కయుక్త కుం ♦ భస్థలమ్ము
జీల్చి శుభమౌక్తికశ్రేణి ♦ జిమ్మవచ్చు

ఉ. వాయుసుతుం డితండు నగ ♦ వైరిసుతుండితడేను కృష్ణుడ
వేయునికేల? భూమిభుల ♦ వేగ విముక్తులజేయు మిప్పు డే
దా? యనినేయు మామనగురి ♦ యందున నెవ్వరితోడనేని నీ
యాయువు నేటితోసరి న ♦ హాయులతో జనుదెమ్ము పోరికిన్.

వ. అనినవిని జరాసంధుండు సటాసముత్పాటనకుపిత కుంజరవైరియుం
బోలె గడు నలిగి,

కన్నడ—ఖండగతి

ప॥ పుట్టినది నేరాచ - పుట్టుచేగాద ॥పు॥

అ॥ ప॥ పట్టివల్లారు భయ - పడుదునే రణమునకు ॥పు॥

1. నాకునరిజో డనిల - నందనుండేగాన
నా కుమతినే బంపు - యమాలయమునకు బిరాన ॥పు॥

2. వలదు నాకొకనికో - డల నీలకంఠుడే
కలదు నాకుందోడు - కంసదానవకుఠార ॥పు॥

తే. గీ. నాకుమునొక్కడె మున్నిట • నగరి గట్టి
బన్నముం దప్పి కాపుర • మున్న యట్టి
వనికిమాలిన గొల్లబో • యనికి నీకు
దొంగ కనే ? భీమపార్థుల • తోడు నేడు.

తే. గీ. తలకి యుందాలకా ? నాడు • త్రాగుబోతు
నకు తెలియకుండ దొంగ స • న్యాసి కట్లు
చెలియలనొసంగి పెండ్లిజే • సి ప్రియ మార
గలుపుకొంటివి చుట్టరి • కమ్ము కృష్ణ !

వ. అని పలుకుచు జరాసంధుండు భీమసేనుతో మల్ల యుద్ధంబుసేయ
నిశ్చయించి నిజనందను సహదేవు రాజ్యాభిషిక్తుం గావించి
యుద్ధావనిన్ బ్రతిఘటించి కారిక శుద్ధ ప్రతిపత్తిథియందు భీమ
సేను నెదుర్కొనినిలువ నా వృకోదర జరాసంధు లొండొరుల
జుల్కనల దాకునంత నన్యోన్యదోర్దండ ప్రహార సంజనిత ధ్వానంబు
బ్రహ్మాండ భాండము బెల్ల నిండ, పదఘట్టనంబు భూమ్యాకా
శంబులు గప్పికొన నాహవహర్షంబున బరస్పరాకర్షణ సంకర్షణాప
కర్షణముల బెనగి వ్యాయామ కంకాళ దేహులై పరిమాయిత
కఠిన తరభుజాదండ దారుణాఘాతమ్ము లతిభయానకమ్ములై తోప
మహాయుద్ధంబు సేయుచో జతుర్దశినాటి రేయి జరాసంధు డతి
క్షీణబలుండగుట యుపలక్షించి యుద్ధోత్సుకప్రేరణంబున నప్పావని
మాగధుంబట్టిమొత్తి నాసికాకర్ణరంధ్రమ్ముల రక్తధార లొలుక
పీచిపీచి యెమ్ములన్విరిచి వధించి తత్కళేబరమ్మును తదీయ

గృహద్వారతోరణ సమీపంబునకు వచ్చె నంత వాసుదేవుండును సూర్యోదయంబున మాగధుల కథయించిచ్చి పృథివీపతుల కారాగారవిముక్తులంజేసి భీమపార్థ సహితంబుగ రథారోహియైన తేయసారథ్యమ్మున వాయువేగమ్మున నింద్రప్రస్థపురమ్మంజేరె నంత ధర్మజుండును నలుగురుతమ్ముల నాల్గుదిక్కులకుం బంపి యపరిమిత రత్నాభరణ ద్రవ్యమ్ములందె భాండాగారమ్ము సమృద్ధమ్ముగా గృష్ణుని యోగమ్మున నానాదేశాధిపుల నెల్ల బందుగుల నాహ్వానించిన ధౌమ్యుండుహోతగా, యాజ్ఞవల్క్యుండధ్వర్యుండుగా ద్వైపాయనుండు బ్రహ్మగా, సుసాముం డుద్గాతగా, నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా, భీష్మాదిరాజర్షులు సహాయులుగా జగన్నాథ రక్షితమ్ముగ జన్నంబొనర్చి భీష్మనియోగంబున బ్రథమ తాంబూలమ్ము వాసుదేవున కిడనంత సహింపక శిశుపాలుండు, పాలంభనపరుండయి ధర్మజున కిట్లనియె.

బాగు _ ఆది

ప॥ పాడుగొల్లనికి తాంబూలంబిడి పాడుజేసుకొన్నాడవు జన్నము ॥పా॥

అ॥ నేడుముదిమిచేమతిమాలిన యీ- నిర్భాగ్యుని చెప్పుడుమాటలువిని॥

1. కులహీనుడు గుణహీనుడు జోరుడు గోహత్యా స్త్రీహత్యాపాతకి తలయు గడ్డమున్నరసినవృద్ధా? తగ డితెండుసభనుండుట కేనియు॥పా॥

సీ. అరసి వయోధికుం ♦ డని గౌరవింపను
 హీంతువా, వసుదేవు ♦ డిచటలేడె?
ఆచార్యు డంచు న ♦ మస్కరింప దలతొంటి
 పెని, భారద్వాజు ♦ డిచటలేడె?
చుట్టపు మేరువం ♦ చు దలంచి పూజించు
 నెడ, ద్రుపదోర్వీశు ♦ డిచటలేడె?
యఖిల లోకైక వీ ♦ రాగ్రణియని సత్క-
 రింతువా, రాధేయు ♦ డిచటలేడె?

తే. గీ. మాననీయులలోన స ♦ ప్పాపి బోలు
నీత డనుకొని తాంబూల ♦ మిచ్చినావు?
కడకు నేడు నశించె నీ ♦ కాలబాటున
రాజసూయాధ్వరంబు గౌ ♦ రవముగూడ.

చ. పొలతుల చీరలెత్తుకొని ♦ పోయి మహీజమునెక్కు దొంగ సా
ముల నధికుం డటంచు దల ♦ పోసితివో? వెన్నలకేల గోపికా
జలరుహనేత్రలం గలసి ♦ సైరితభూముల నాడు జాణ రా
యల గడు మిన్నయంచనియొ? ♦ యగ్రపూజ మొసంగితివోయి ధర్మజా!

ఉ. వాని కలిందు బావయగు, ♦ వానికి నేను మఱంది నౌదు, నీ
కై వడి బాంధవమ్ము చెల ♦ గెన్, నను బెండ్లియాడనున్న రా
జీవదళాక్షి రుక్మిణియు ♦ చెల్లెలగుంగద! పెండ్లియాడె నీ
కావలు, డిట్టి శిష్టజన ♦ గర్హితు సర్చితుజేయు టొప్పునే?

వ. అనుచు కృష్ణునధిక్షేపించు శిశుపాలున కలిగి సహదేవుండు.

తే. గీ. యజ్ఞపూరుషు నఖిల దే ♦ వాగ్రగణ్యు
నాదినారాయణు ననంతు ♦ నప్రమేయు
బతితపావను నిందించు ♦ వాని శిరము
వామ పాదంబునం దన్ను ♦ వాడ నిపుడె.

వ. అని పల్కుచు కోపావేశంబున జైద్యుపై నుఱుకు సహదేవు ధర్మజుండు వారించు నంతలో శిశుపాలు సేనాపతి సునీథుండను వాడు రాజానుమతమ్మున సైన్య సమేతమ్ముగ యుద్ధసన్నద్ధుడై నిలువంగని భయసంభ్రమాక్రాంత హృదయుండై యమనందనుండు గంగానందనున కిట్లనియె.

ధన్యాసి - రూపకము

ప॥ ఊరకుందువేల తాత - వారింపు మీయనిసేత ॥ఊ॥

అ॥ ప॥ కూరిమి నీరాజన్యుల - కోపాగ్నిం జల్లార్చుము ॥ఊ॥

చరణము

జన్మము సెడకుండ జన - కుండును సంభవింపకుండ
మన్నీలకు జిత్తశాంతి - మానితగతి కూడ్చునయ్య ॥మా॥

చ. నగధరు గారవించు కతి ♦ నట్టి శిశుపాలుడు తెచ్చిపెట్టె నీ
జగడము; కార్యవాదములు ♦ శాంతవహించుట పాడియా, దలం
పగ మన మాత్రధేయులము ♦ హారకభూల్; కలహించు కొన్నచో
నగుదురు లోకు, లిట్టు నవ ♦ నంబు సహోత్రము జెందునోకదా!

వ. అనవిని భీష్ముండు ధర్మరాజునకని

ఉ. మాటలచేత జక్కబడు ♦ మానసిజాల డిప్పిట్టి ప్రేలెడు
న్నోటికి వచ్చినట్టుల; గ ♦ సు గొను మొందొక కారణమ్మునన్
జేటు దలంప డీతనికి ♦ శ్రీహరి; కాలము చేరువయ్యె ము
మ్మాటికి నేటితో, సుఖన ♦ మాప్తికి భీతిలకోయి ధర్మజా!

వ. అనిన శిశుపాలు డాగ్రహించి యొకనక్కముగ.

బిలహరి—ఆది

ప॥ తాత చెప్పుటకు మనుమలాలించి - తలలూపగ
సరిపోయె భళాభళి ॥తాత॥

అ॥ ప॥ పాతపడిన వల్మీకమాత్ర పర్వతమెత్తిన గొల్లనినగధరుడని ॥తాత॥

చరణము

గారవింపుమని నందతనూభవు - గాంగేయుడు సెప్పిన జెప్పగాక
కోరినీవెట్లు విశ్వసించితివి జారులు - చోరులు బ్రహ్మవేత్తలని ॥తా॥

ఉ. తానొక బ్రహ్మచారినని ♦ తజ్ఞులసన్నిధి బైసిమాలి యొం
తేనుతియించుకొందలచు ♦ నెవ్వరెఱుంగరు షండుడంచు ? వి
జ్ఞానివలె న్నటించి రభ ♦ సమ్మున నాకొనజూచు నల్వురన్,
తానుకళిత్తురే పసుల ♦ కావరి కింపట కొద్ద జేయుచున్ ?

క. గాంగేయకృష్ణులన్ బహు
భంగులనిందించు చైద్యు ♦ పైవడి గద కే
లంగొని యిఱుకు నవిూర సు
తుంగని భాగీరథీ సు ♦ తు డిట్లనియెన్.

ఉ. శాంతివహింపు మెక్కుసిరు ♦ నమ్ము నవిూర కుమార శౌరియే
యంతకు సన్నిధానమున ♦ కంపగలా డితనిన్, దదన్యుచే
నంతమునందు, డీతులున ♦ యంతము నందినగాని జన్న మూ
సాంతముగాదు, సర్వము ప ♦ మాప్తముకాగల దీతుణమ్మునన్.

సీ. తొలుత నీ తులువ చ ♦ తుర్భుజుండును త్రిలో
చనుడునై పుట్టి, రా ♦ సభమువోలె
నార్చిన, తలిదండ్రు ♦ లడలుచున్నడల వీ
డెవ్వనియుత్సంగ ♦ మెక్కునంత
మిక్కిలి చేతులున్ ♦ మిక్కిలి కన్ను వో
వు నతండె యంతకుం ♦ డనియె వీని
కంబరవాణి; నా ♦ రాయణుం డెత్తికొ
నుడు చేతులుం గన్ను ♦ నడగె, నులికి
తే. గీ. సాత్వతియు వీని యపరాధ ♦ శతము సైవు
మనుచు కృష్ణునివేడ ని ♦ య్యకొని శౌరి
నిండె నయ్యపరాధముల్ ♦ నేటితోడ
వికలమగు సుదర్శనమున ♦ వీనిశిరము.

వ. అని పలుకుసంత జక్రధరుం డఖిలరాజచక్రంబు విన నిట్లనియె.

శ్రీరాగము—రూపకము

ప॥ అపరాధశతమ్ము సైపుమా - యని మాయత్త గోర ॥నప॥
అ॥ ప॥ ఇపుడు నూటికెక్కుడయ్యె - నీమూర్ఖుని దుండగమ్ము ॥లప॥

చరణము

తెన్ను దప్పివసుదేవుని - జన్నపు త్తడి హరించి - జెన్నటియై ద్వారక
గాల్చెనెన్నో యపకృతులొనర్చె ||నవ||

చ. ననుగని దౌర్వ్యజాలసిత • నమ్మన దిట్టుటకేమిగాని యు
త్యనఘుని భీష్మనంతతి మ • హామహాత్ము తను ధిక్కరించె నీ
చెనటి, క్షమింపరా దితని • శీర్షము ద్రుంతు గనుండిదే సుద
ర్శనమున నీక్షణమ్మున ది • రమ్ముగ భూమి భరమ్ము దీరగన్.

వ. అని పల్కుచు దనుజాంతక చక్రంబగు సుదర్శన చక్రమ్మును స్మరించి చేనంది ప్రయోగింప నయ్యది శిశుపాలు శిరంబు నుత్తరించి నిజధామముం జేరె చైద్యుని దేహమ్మునుండి యొక్క తేజం బంబరంబెల్ల వెలుంగుచువచ్చి వాసుదేవునందు సొచ్చె నిట్లు రాజసూయంబు జగన్నాధ రక్షితంబై పరిసమాప్తంబగు నంత నానా దేశాగతులయిన రాజన్యులును నెల్ల బంధుగులును ధర్మజుం గొనియాడి వీడ్కొనిరంత నారాయణుండును పాండుసుతులు తన్ను పాదచారులై యనువ రథారోహమొనర్చెను. కౌరవాగ్రజుడు శకునియుం దానును మయసభావిభవంబుం జూచు వేడ్క గొన్ని దినంబు లందుండెను.

శ్రీ

# మహాభారతము

## ద్రౌపదీమానసంరక్షణము

కాంభోజి - ఆది

ప॥ ఆకర్ణింపుడు పంచమవేదం - బఖిలధర్మయుతము మహాభారత ॥మా॥

అ॥ ప॥ శ్రీకృష్ణుడు పాంచాలికి సభలో - జీరలొసంగిన కథవిన్పించెద ॥నా॥

చరణము

శకునిమేనల్లు డొక్కనాడు మయు - సభావిశేషము లరయ

ప్రకటమ్ముగ నందుజొచ్చి విస్మయ - పడియె నెమ్మనంబెఱియ ॥నా॥

సీ. బారగాదెఱచిన ♦ ద్వారమ్ము మూసిన

దానిగా దలపోసి ♦ లోనజొరదు

సంవృతద్వారదే ♦ శమ్ము వివృతమ్ముగా

దలచిపోబోయి ఘూ ♦ తగను నుదుట

చదునుగల్గిన ప్రదే ♦ శంబున్నతంబని

యెక్కట నూహించి ♦ యెక్కగడగు

నీలాలుతాపిన ♦ నేల జలాశయం

బని పరిధానమె ♦ త్తి నడయాడు

తే. గీ. తగజలాశయమున్ మహీ ♦ తలమటంచు

వడివడింజని పుట్టంబు ♦ దడియజొచ్చు

తాఱుమాఱుగ దోచ నం ♦ తయునుదాన

లజ్జితుండయ్యె నయ్యంధ ♦ రాజుకొడుకు.

క. అదిగని ద్రోవదినవ్వగ
నది శూలమువోలె నాటి • యనుగతరోషా
భ్యుదయుండై కరిపురి వని
హృదయము రగులంగ గుందు • నీనిధి సంతన్.

కేదారగౌళ—ఖండగతి

ప॥ అభిమానధనుడనై - యవమానపడితినా ॥య॥
అ॥ ప॥ ఇభపురాధిపుడ తుద - కిటు లాపదానినే ॥అభి॥

చరణము

చీడికారణముగా - జెఱతు నా పాండవుల
కూడుగుడ్డకుదూర - గులజేయు [illegible] ॥యభి॥

తే. గీ. త్రొక్కబడిన పెంధూళి తో • డ్తోనలేచి
నెత్తిపై నెక్కి త్రొక్కునే? • నృపవరేణ్య
మౌళిమకుట మణీఘృణీ • మహితపద క
శేశయుండను నేనేల • సేయరాదు?

సీ. ననుగాంచి పరిహాసిం • చిన బంధకి ద్రచ్చ
కీడిపించి పరాభవ • పంచు దనుక
నూరూరదిరుగాడు • బైరాగులం జేసి
పంచపాండవులగా • జెంచుదనుక
పూజనీయచతుస్స • ముద్రవేలావల
యితరాజ్యలక్ష్మి గ్ర • హించుదనుక
భువనవిఖ్యాత పాం • డవ యశోడిండిమం
బింతంతలుగ ద్రొక్క • లించుదనుక

తే. గీ. డంబముల దొడ్డకొండ, పాం • డవులయండ
మైన గోపాలు దుర్గర్వ • మణగుదనుక
త్రాయికముగ జల్లాబడీ • పరిభవాగ్ని
బ్రతికి గాంధారి కొడుకు సా • రకము గలదె.

వ. అని రోషించుచు నతికర్తవ్యతాహీనుండై.

చ. అడరుచు వేసవిం దఱుగు ♦ నల్పజలాశయమున్ బలెం గడుం
గడుపరితాపభారమున ♦ గాయముగంది వివర్ణమంది, కీ
డ్వడుచు సుఖోపభోగముల ♦ బాసి కృశించు నరేంద్రుఁ డాసి సం
గడితనమేర్పడం శకుని ♦ గ్రన్నన సర్వ మెఱింగి యిట్లనెన్.

నాటకురంజి — ఆది

ప॥ తెలుపవె తి విదియా విచారము - కంత
విడువుమయ్యా భాగినేయ ॥తెలు॥

అ॥ ప॥ చలముమీఱి పాండవేయులను నీ
చరణాక్రాంతులుగా నొనరించెద ॥తె॥

చరణము

నీ వెఱుగుదువుగదా నాకున్న - నేరుపు మాయాదురోదరమ్మున
భూవలయమ్మఖిలమ్ము నీకిడుదు - మోసగించియమపుత్రునోడించి॥

తే. గీ. తండ్రి నెఱులేని యొప్పించి ♦ ధర్మతనయు
నిటకు రావించి జూదమా ♦ డింపు మతని
గెలిచి పర్వ సర్వం సహా ♦ వలయమునకు
సార్వభౌమునిగా నిన్ను ♦ సల్పువాడ.

క. అనిపల్కి భాగినేయుని
గొని యంధనృపాలుకడకు ♦ గొబ్బున జని తె
ల్పిన ధృతరాష్ట్రుం డయ్యది
వినిపింపగ నీతివిదుడు ♦ విదురుండనియెన్.

చ. సరి! సరి! యన్నదమ్ములకు ♦ సైతము వైరము సంఘటించి కా
పురములు గంగలోఁ గలుపు, ♦ పోలని దుర్వ్యసనమ్ము గాదె! పు
ష్కరుఁడు నలుండు జూదమున ♦ నెమ్మనసెట్టి విరోధమందిరో
మఱచితె? పెద్దవాడ విది ♦ మాన్యము పుణ్యమ? పూరుషార్థమా?

తే. గీ. కలిత కురువంశనాయక ♦ కల్పకుజము
వెడగు జూదమ్ము వేరింటి ♦ వేరుపురుగు

జేరి చివరకు మొదలంట • దెఱవి వేయు
నన్ను దూరముగాలోచించుము • మాంబికేయ!

వ. అని పల్కు సర్వార్థవిదుండగు విదురుని ధర్మ్యవచనమ్ము లాలించియు బుత్రమోహమ్ము వీడనేరక ధర్మనందనుం దోడ్తెమ్మని విదురునింద్రప్రస్థపురమ్మునకుం బనిచిన నతండు నవిలంఘనీయమ్మగు ధృతరాష్ట్రు నియోగమ్మునునరించి యింద్రప్రస్థమ్ముసొచ్చి యమతనయునిచె నభ్యర్చితుండై నేమంబడిగి నిజాగమన కారణం బెఱింగించిన ధర్మజుండును ద్యూతక్రీడ యాచ్యనమ్మతమ్ముగాదని వగచుచు గడకు విధివశుడై యనుజన్ములును ద్రోవదియు ధౌమ్యుండాదిగాగల విద్వజ్జనులును దోడరా విదురునితో నిభపురమ్మున కరిగి కురుగురు వృద్ధజనుల కభివందనమ్మున బ్రమోక్కి యాశీస్సులంది యాదినమ్ము గడపి మరునాటి యుదయమ్మున కనకఖచిత స్తంభ సహస్రంబులు, విచిత్రద్వారశతంబుల వేవురు శిల్పాచార్యులచే నతిరమ్యంబుగ నిర్మింపజేసి ధృతరాష్ట్రుండు దుర్యోధనున కొసంగిన సభాభవనము జూచుతలంపున నందుసొచ్చి మెచ్చుచు నెల్లరు సుఖాసీనులై యున్నంత నొకంతకు కౌరవాగ్రజుండు పాండవాగ్రజున కిట్లనియె.

శంకరాభరణము – రూపకము

ప॥ అనఘా నేడిందు జూద – మాడి వినోదింతము మన ॥మనఘా॥
అ॥ ప॥ జననాయకులకు ద్యూతము – సహజధర్మము గావున ॥నన॥

చరణము

నె[illegible]ద్యుటంము నీవు – నేర్పరివని వింటు చాల
యుక్తి ప్రచతురత గను – దిది కాలక్షేపము గా ॥ననఘా॥

క. సాటియగు నక్షవిద్యా
పాటవమున నీకు శకుని • ప్రతినిధియై నా
యాట యితడాడు నీతం
డోటువడినదెల్ల నేన • యొసగుదు నీకున్.

వ. అనవిని ధర్మజుం డిట్లనియె.

ఉ. క్షత్రియధర్మమేయగును ♦ గాక, వినోదమెయగానుగాక, స
క్షత్రియులీదురోదరము ♦ జూడకపోవరు, పాపవృత్తిమై
శత్రువులంబొనర్చు నను ♦ జన్మట సైతముం, దుర్నగంబె? యీ
మాత్రపునింద్యకర్మమును ♦ మానుటకున్ మనకో సుయోధనా!
క. ఒకనికి బ్రతిపక్షమై చే
టొకపాటు, జేయఁజేసినది ము ♦ ట్టోఁచి నొసఁగ జీ
టికిమాటి కొప్పుకొంటయు
బ్రకటనుహృద్వ్యాప్తిధర్మ ♦ సభ దూరమగున్.
వ. అనవిని కర్ణుఁడు ధర్మజున కనియె.
ఉ. నందియమేల యాడిసవ ♦ పర్వము సౌబలుఁడే యొనంగు, నీ
గుందినగౌరవంబును జొన ♦ గుడ్, మతిచాలనిచో మదీయ రా
జ్యేందిర నీకొసంగుము మా ♦ హీనలయమ్మఖిలమ్ము గెల్చియీ
యం దలకొంటి నేనితన ♦ కే మతిఁజుట్టే ఋణమున్న ధర్మజా!
వ. అనవిని విదురుండు కనక్కోసముగ రాధేయున కిట్లనియె.
క. తనకుఁ దీటగు దుర్యో
ధనుకన్నను సుబలరాజ ♦ తనయునికన్నన్
నినుమేటిజేసి ధర్మజు
డనుమానము వీడి జూద ♦ మాడునె? కుమతీ!
చ. అవనినమస్తమున్ గెలుతు ♦ నంటివి, సిగ్గటులేదు; ధర్మనం
భవుననుజన్ములున్న సభ ♦ వాడెటువచ్చిన నట్లుప్రేలగా
నవునొకో? ద్రౌపదీపరిణ ♦ యావసరమ్మునన్నే న నీ పరా
భవము దలంచుకొమ్ము గరు ♦ వమ్ములు సెల్లవు సూతనందనా!
వ. అనవిని దుర్యోధనుం డంగరాజు ననునయించుచు,
తే. గీ. ఇతనిమాట పాటింపకు ♦ మీవు, తిన్న
యింటివాసాల లెక్కించు ♦ నీతడెపుడు
నీవెఱుంగవె? మొదటి నుం ♦ డియును పాండు
తనయులన బడిచచ్చు నీ ♦ వానికొడుకు.
వ. అనవిని యభిమానవడుచు ధృతరాష్ట్రుండగ్రనందను నిట్లుమందలించె

బిళహరి—ఆది

ప॥ ఏమంటివి చెడిపోవు నీకలిన
మామర్యాదలుగూడ సుయోధన ॥ఏ॥

అ॥ప॥ సామాన్యుం డనుకొంటివ విదురుని
సదమల ధర్మాధర్మ విజ్ఞాత ॥ఏమం॥

చరణము

చిన్నపెద్దతారతమ్య మెఱుఁగవు-పున్నెమేదో పాపమేదో తెలియవు
యెన్నఁడీ మహాత్ము దూలనాడకు హితుడునీకు - నాకన్న పూజ్యుడగు॥

క. అనిన సుయోధనుఁడు స్వని
వినని యటు నటించి పాండ • వేయుని జూద
మ్మునకుం ద్వరపెట్టఁగ స
య్యనఘుండును సుబలసుతుస • కభిముఖుడయ్యెన్.

వ. ఇట్లభిముఖుండై మణిహారంబులును సువర్ణరత్న భాండాగారమ్ములును నసంఖ్యాత హయయూధ గంధసింధుర సందోహమ్ములును శతసహస్ర పరిచారికా పరిచారకులను క్రమముగ నొడ్డి యోడుచు బద్ధమత్సరుండై దేవ బ్రాహ్మణ క్షేత్రమ్ములు దక్క తక్కిన ధరావలయంబంతయు నొడ్డి యోటుపడి మఱియు నతుర తుండై సహదేవునొడ్డి యోడి నకులు నొడ్డి యోటుపడి యావేశంబున సౌబలున కిట్లనియె.

సీ. అలరు పున్నెంపు టిం • తుల మేలుబంతియా
కుంతి కాన్పుల కడ • గొట్టు కొడుకు
కలశసంభవు నొద్ద • గఱకుటమ్ముల విద్దె
గడముట్ట నేర్చిన • కడిమిదిట్ట
యేను బాణమ్ముల • మీనయంత్రము డెగ
నఱికి ద్రోవదిని గొ • న్నవిలుకాడు
కలన శేజేరేని • గెలిచి ఖాండవ వనం
బగ్నిచే గాల్పించి • నట్టి జోదు

తే. గీ. చెలఁగి నను రాజసూయిచే ♦ సిన ఘనుండు
బవరమున నెన్నఁ నూపని ♦ వాఁడిమగఁడు
జలజనాభు నెయ్యంపు ము ♦ ద్దుల మఱంది
యర్జునుం డిట బన్నదం ♦ బగుచుఁ గాత!

వ. అట్లర్జును నొడ్డి యోటుపడి

చ. కనక నగేంద్రధీర కర ♦ ఘాతమునం బొడిసేయు దోర్బలుం
డనుపమబాహువిక్రమ స ♦ హాయుఁడు ఘోరహిడింబదైత్యమ
ర్దనుఁడు బకాంతకుం డును ప ♦ రంతపు డంతకసన్నిభుండు భం
డనముల చండశాసనుఁడు ♦ నా పెదతమ్ముఁడు పందెమయ్యెడున్.

వ. భీముం గూడ నోడి వెండియు.

క. తెలిసిన మూర్ఖుండని లో
కులునవ్వఁగ రాజ్యమెల్ల ♦ గోల్పడి యనుజ
న్ముల సైత మోడిన కా
వలు డీ యమనందనుండు ♦ పన్నిద మగుతన్.

వ. అట్లు తన్నుఁ దాన పందెంబిడుకొని యోటువడి శకుని ప్రేరణంబున పాంచాలింగూడ బణంబుగ నొడ్డఁదలంచి.

ఉ. మానవతీ లలామ, గుణ ♦ మాన్య, యయోనిజ, కుంతికిన్ బహిః
ప్రాణము, పాండునందనుల ♦ పట్టపురాణి, ముకుందు చెల్లెలీ
పై నిలుచుం బణమ్ముగ స ♦ భాజనగర్హితు క్రూరకర్ము నీ
మాన విహీను నంతకును ♦ మారు మగండని చెప్పుకొంటచేన్.

తే. గీ. ద్రౌపదియు నోడఁబడియె; స ♦ భాసమంది
తనకు పాంచాలి యింకిటు ♦ దాసియయ్యె
ననుచు గౌరవపతి కృష్ణ ♦ నటకుదోడి
తెమ్మనన్ విదురుండు గో ♦ పమ్మున ననె.

కళ్యాణి—త్రిపుట.

అప॥ యీ సమస్తావనీవలయం - బేలు ధర్మజు పట్టంపురాణి ॥దా॥

1. సంతతము గనుసన్నచే పరి - చారికాగణము సేవింపగ
సంతిపురమున రాజభోగము-లందు నా గోవిందు చెలియలు ॥దాసి॥

2. రవినిభుఁడు ధర్మజుఁ డొనర్చిన - రాజసూయ మహాధ్వరమ్మున
నవభృథస్నానమున శుచియై - నట్టి లోకైక సాధ్వీమణి ॥దాసి॥

ఉ. సంచిత ధర్మసంచయు న ♦ జాతరిపుం బిలిపించి జూదమా
డించి సమస్తరాజ్యము గ్ర ♦ హించియు బాలక యాజ్ఞసేని రా
వించి సభాస్థలిం బరిభ ♦ వింపదలంచితి వాను కట్టు గ
ల్పించు పరాభవాగ్ని సెలు ♦ వెల్ల దహింపకపోదు సుమ్మగిన్.

తే. గీ. అల్లదే చూడుమా భీము ♦ డనిలతనయు
డగ్రజాజ్ఞాంకుశమ్మున ♦ నాగెగాని
క్రూరకర్మావలంబిత ♦ కురుకుమార
శతక నాళీకమత్తకుం ♦ జరు డతండు.

వ. అనిపల్కు విదురుని వచనంబులు సెపవిడక సూతసుతుండగు ప్రాతి
గామియనువానింగని నీవుపోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని
పంచిన నతండును నని ధర్మజుండు జూదమ్మున నోడుటయును,
దుర్యోధను నాజ్ఞయుం దెలువ బాంచాలి యిట్లనియె.

ముఖారి—ఆది

ప॥ లేరో, జూదరులు-సతినొడ్డినవారు గలరె? ధరలోనేయుగముల ॥లే॥
అ॥ప॥ మేరమీరి సమవర్తి-సూనుడు వైరులం గలసిజూదమెట్లాడె ॥లే॥

చరణము

గెలుచు గాక తగునే? కొలువున కొక
వెలది నీడ్చి తెమ్మనుట కాతులువ ॥7॥
వలదుడుగుము పాప కార్యమిదియని
వారించు పెద్ద లీ సభ లేరా ॥లేరో॥

తే. గీ. మున్ను తనోడి యోడెనో ♦ నన్ను లేక
నన్ను మునోడి యోడెనో ♦ తన్ను సభకు
నరిగి యొకపరి జూదరి ♦ నడిగిరమ్ము
అవసరంబని క్రోధిన ♦ నపుడు వత్తు.

చ. అనవిని ప్రాతిగామి ద్రుప • దాత్మజ పల్కినదెల్ల ధర్మపు
త్రునకెఱిగించి యయ్యెడ ని • రుత్తరుడై నిలువన్ సుయోధనుం
డని సభలోన నీవడుగు • మయ్యది సభ్యులు దీర్తురంచు బో
మ్మన నతడట్లు సేయ వెఱ • పావహిలం గసులాయుతాత్మయున్.

సీ. బలితలంపు చందోయి • పైబాటుకంటి నీ
రొగి పైటచెఱగున • నొత్తుకొనుచు
నవమాన మేమిరా • నగునోయటంచు ని
ట్టూర్పులు సెలగ లో • నున్నరంచు
నొంటిపుట్టంబుతో • నుండి కొల్వునకేగ
బదములాడక త్రొట్రు • పాటుగనుచు
నోలగంబున పెద్ద • లున్నారు దైవము
న్నాడని వెఱపు వో • నాడుకొనుచు

తే. గీ. సభకుజనుదెంచి తనుజూడ • జాల కొకట
తలలువాంచిన పాండునం • దనుల గాంచి
వనరుచుం గురువృద్ధుల • వెనుక నిలిచె
రమణి దీనైన పాంచాల • రాజతనయ.

క. నిలిచిన పాండవసతి నీ
వలకుం డెమ్మంచు గౌర • వప్రభు డనె, కా
వలుడు పెదతిమ్మ డటుజన
లలనామణి " నేరజన్వ - లం దొలగు " మనెన్.

బాగు—త్రిశగతి

ప॥ తక్కులు చాలింపుమోసి - దాసీ! దుశ్శాసనుకడ ॥త॥
అ॥ ప॥ ఎక్కడికేగెదవు మా యు - ధీనవై తివి నీవిక ॥త॥
1. కులటవుగావునను కట్టు - కొన్నావేవురు మగలను
భళి! భళి! యుత్తకుదగుకో - డలివగుదువు రమ్మ రమ్మ ॥త॥

ద్వి. ఏకవస్త్రనై ననేమి - నీకీయెడ సిగ్గేమి
వే కదలుము విడువను నిను - విగతవస్త్రవై నగాని ॥త॥

తే. గీ. అని యదల్చుచు రాజసూ • యావభృథము
నందు శుచియగు శిరోజము • లందిపట్టి
యెట్టకేలకు ద్రోవది • నీడ్చితెచ్చె
సభకు దుశ్శాసనుండు దు • శ్శాసనుండు

వ. అట్లు భీష్మద్రోణాది కురుగురువృద్ధులున్న కొలువుకూటమునకుం బాంచాలి నీడ్చుచో భీముండు కోపవిచారమ్ము లొక్కుమ్మడి ముప్పిరిగొన ధర్మజు నుద్దేశించి,

ఉ. పాడిదొలంగి జూదమున • పన్నిన దమ్ముల, రాజ్యమెల్ల దా
నోడిన నోడుగాక; సతి • నొడ్డి పణమ్ముగ జూదమాడుకో
న్నాడిటు పాండవాన్వయము • నం జెడబుట్టె నితండు; వీనికిన్
వీడక బాహువు ల్దగులబెట్టిన • దీరదు గాదె కోపమున్ ?

వ. అనిపల్కు భీముని వారించి యర్జునుం డిట్లనియె.

తే. గీ. ఆడినది జూద మందెట్లు • పాడిదోచు ?
నితడు ధర్మముతప్పి చ • రింప డెపుడు
తగునొకో ? దైవవైపరీ • త్యమున కిటు ల
తిక్రమించి నావిధుట కాం • తింపు మన్న !

వ. ఇట్లు దైవప్రాతికూల్యమునకు వగచు భీమార్జునులను సభాంతరమ్మున కీడ్వంబడిన ద్రోవదిని జూచి వికర్ణుం డిట్లనియె.

చ. తలయును గడ్డముల్నరసి • తావళము జెడద్రిప్పు పెద్దలై
లలనయొకర్తు కొలువునకు • లాగబడం గనులొప్పగించి బొ
మ్మలవలెజూచుటొప్పునె ? న • మ్రత లేమయిపోయె ? మాన్పగా
వలదొకొ ? యాడువాండ్రుగల • వారలు గారొకొ మీరలందఱున్.

వ. అనిపల్కు వికర్ణుం గని కర్ణుం డిట్లనియె.

తే. గీ. వీరునీమాత్ర మెఱుగని ♦ వారుగారు
చిన్ననోటికి జెల్ల పీ ♦ పెద్దమాట
లూరకుండుము నీ కేల ♦ నోయి! నడుమ
కులటయెడ బనిలేదు నీ ♦ తులు వచింప.

వ. అనుచు ప్రత్యాఖ్యానంబు సేయునంతలో దుర్యోధనుండు దుశ్శా
సనుం బిలిచి వీరెల్లరి వస్త్రంబు లపహరింపుమన పాండునందనులు
పైపుట్టంబులందీసి యుర్వ్యోడం బెట్ట దుశ్శాసనుండు ద్రౌపది పైట
చెఱంగు బట్టదివ్వర పాంచాలి యొక్కింత తొలగి వెంటనంటి
దున్ననేనుండు పుట్టం బాలుచుచుండ మనమ్మున నీశ్వరసన్నిధానముం
గల్పించుకొని బాహ్యప్రపంచము న్మఱచి శ్రీకృష్ణునుద్దేశించి,

భూపాల—చతురశ్రగతి

ప॥ సకలచరాచర సృష్టికారణా - సామి
బ్రోవరావా - సర్వాంతర్యామి బ్రోవరావా ॥స॥

అ॥ ప॥ ప్రకటదీన మందారమహానిజన
పారిజాతభువనై క విఖ్యాత ॥సకల॥

చ ర ణ ము

హా! కృష్ణా వసుదేవనందనా - ఆర్తావనలోలా కాంచనచేలా
దయాలవాల శ్రీకాంతా హృద - యాంబుజబంభర శేష
శయనశౌరీ విశ్వంభర ॥సకల॥

మ. కురువృద్ధుల్ గురువృద్ధు లున్న సభలో ♦ గొంకేమియున్ లేక, పా
పరతుల్గౌరవు లిట్లు నన్పరిభవిం ♦ పం జూచి దీనావన
త్వరుడీవయ్యును మిన్నకుంటి వకటా! ♦ ధర్మంబొకో? అన్యథా
శరణంనాస్తిత్వమేవదేవ మము కృష్ణా ♦ దీనసంరక్షణా?

మ. ధరణీనాథునకెల్లరు న్వెఱచి పై ♦ ద్దల్మిన్నకున్నారు, తా
మురుబాహాబలశాలురయ్యు దతిగా ♦ కుంటన్దలల్వంచియుం

డి రిట న్నావతు లేవు రాయుడుకలా ♦ లింపంగనే? అన్యథా
శరణంనాస్తి త్వమేవదేవ మను కృ ♦ ష్ణా! దీనసంరక్షణా.

వ. ఇట్లు మొరవెట్టుచు శ్రీవారికటాక్షమున నక్షయవస్త్రయగు ద్రోవదింగని సభ్యులెల్ల రాశ్చర్యమందిరి. పాంచాలినిట్లు పరాభవించిన దుశ్శాసను వక్షస్థలమ్ముం బగిలించి రక్తముం ద్రావుదునని భీమసేనుండు ప్రతిజ్ఞ జేసె. చీరలరాసులు పర్వతప్రాయము లగుటచే విను వెత్తి చేయునదిలేక దుశ్శాసనుండు సిగ్గుఖండె నట్టియెడ రాధేయుండు ద్రోవదింగని.

ఉ. ఉమ్మడిగొడ్డు చందమున ♦ నో మగువా! మగలేవ్వరుంటచే
నిమ్మయి గష్టముల్గుడిచి ♦ తీ వొక శూరునిగట్టు కొమ్మనన్
రమ్మని నన్నుజేసితొడ ♦ లం గనుపర్చె సుయోధనుండు; కో
పమ్మున భీము డూరువుల ♦ భగ్నమొనర్తు ననెన్మహోగ్రుడై.

వ. అట్టియెడ ద్రౌపదీపరాభవమ్మంతయు గాంధారి ధృతరాష్ట్రుల కెఱింగింప నతండును దుర్యోధను మందలించి పాంచాలిని రావించి యిట్లనియె.

హిం॥ ముఖారి—చతురశ్రగతి

ప॥ తలమానిక మువిదలకు నీ వుభయ
కులపావని వమ్మా - కోడలా ॥కుల॥

అ॥ప॥ తులువలై నాకుమారులొనర్చిన
దుండగముసైపుమా - కోడలా ॥తల॥

చరణము

ఇచ్చవచ్చినటు వేడుమా వరంబెద్దియైనగాని - కోడలా ॥యెద్ది॥
వచ్చరిత్రవెంతయును నాకుదు-న్నలనొక్కటియు ననీవొక్కటియా

వ. అంత ద్రౌపదియు,

సీ. ధర్మతనూభవు • దాస్య విముక్తు నొ
నర్చుమయాయనఁగ, రెం • డవవరమ్ము
నభిలషింపుమన శ • స్త్రాస్త్రసాధనముల
తో దదీయానుజుల్ • దొలఁగి దాస్య
ముం బాయునటుగోరె • మూఁడవ వరమువే
డుమటన్న క్షత్రియ • రమణికింత
కున్మతి వాంఛింప • గూడదన స్వ • త
సిలినెత్తమున యుధి • ష్ఠిరనృపాలు

తే. గీ. డోటువడిన సర్వస్వమ్ము • నొసఁగి యంధ
నృపతి వారి నింద్రప్రస్థ • మేఁగ ననిపె
నది గని సుయోధనుండు ప్ర • యత్నమెల్ల
విఫలమగుటకు జింతించి • వెఱవెఱింగి.

వ. ధృతరాష్ట్రు నొప్పించి మఱల ద్యూతార్థంబు ప్రాతిగామినంపి ధర్మ నందను సపరివారమ్ముగ రావించి జూదమ్మున నోడిన వారజిన వల్కల ధారులై పండ్రెండేండ్లు వనవాసమ్ముఁజేసి యాపై నొక్క యేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబు జేసి యం దెఱుంగబడి రేని మఱల నరణ్యాజ్ఞాత వాసమ్ములు సేయునట్లు పన్నిదము నిర్ణయించి శకునిచే జూదమాడించి యోడింప ధర్మజుండును విధి నియోగమ్మునకు వగచుచు వనంబునకు బోవ నమకట్టి యెల్లరికడ సెల వంది విదురునింట గుంతీదేవి నుంచి యెల్లవారి యాశీస్సులంది పరిత్యక్త విభవుండై యనుజ ద్రౌపదీ ధౌమ్యపరివార సహిత మ్ముగ దంతి పురము విడిచె.

శ్రీ

# మహాభారతము

## పాశుపతసంసిద్ధి

మోహన—ఆది

ప॥ వినుడు పాశుపతసిద్ధి - కనుడుదాన - నభిమతార్థ సంసిద్ధి ॥వినుడు॥

అ॥ప॥ అనిమిష రాజ తనూభవుడుం జం
ద్రార్థ మౌళి పోరాడిన సత్కథ ॥వినుడు॥

చరణము

అనఘులా పాండుసుతులేవురు ధౌమ్యాది భూమిసురులనుగాములుగా
వనితామణి పాంచాలిం గొని వన-వాసార్థము వెడలిరి కరిపురివిడి॥

తే. గీ క్ష్మావలయ మెల్ల గోల్పడు ♦ కతన బొడమ
వనట గనువిప్పి తేఱిచూ ♦ చిన జగమ్ము
భస్మమగునంచు ధర్మ సం ♦ భవుడు చేల
మున ముఖాంబుజముం గప్పి ♦ కొనుచు నేగ.

క. ఆహవరంగమ్మున నిజ
బాహాబలదర్పమెసగ ♦ పరిపంథుల ను
త్సాహమున గూల్తునంచును
బాహువుల న్సాచియేగ ♦ పావని వనికిన్.

క. సురరాజనూను డింతకు
దఱుచుగ బాణమ్ములేసి ♦ దర్పోద్ధతి సం

గరమున నరవీరుల కే
నరక జెఱతు నంచు నమ్ము ◆ చల్లుచు నేగెన్.

తే. గీ. ఇడుమ లెన్నొ ని కుడువ బా ◆ ల్పడిన తనదు
సుందరాకారమును గాంచి ◆ కుందకుండ
జనసమూహమ్ము, ధూళి ధూ ◆ సరితదేహు
డగుచు శల్యుని పెద్ద మే ◆ నల్లు డేగె.

క. ఘనదుఃఖభాజనమ్మగ
వని కేగు న్వ్యకీయ దీనవక్త్రమ్మున నా
చినవారి కెల్ల నగ్గగు
ననుచు న్నహదేవు డేగె ◆ నవనతముఖుడై

తే. గీ. కదనమున జచ్చిన మగల ◆ కై వల వల
యేడ్చు చిటు కౌరవాంగన ◆ లేగుదు రన
తలవిరియబోసి తడసిన ◆ వలువగట్టి
దుఃఖభారంబునం జనె ◆ ద్రుపదపుత్రి

వ. మఱియు భావితరణమ్మునం జచ్చు శూరుల పరలోకవిధుల న్నాచించుచు ధౌమ్యుండు రౌద్రయామ్య సామగాన ముఖరితాస్యుం డగుచు జనియె నట్లు ధర్మనందనుండు మహారణ్యమ్ములు గడచి పోవుచు ధౌమ్యోపదేశమ్మున సూర్యు నారాధించి యరణ్యమున నుండగల పంద్రెండు వత్సరములును వన్యఫలమూలకంబులు పాక స్థానంబున ద్రౌపదిచేత సాధితంబులై యక్షయంబులగు చతుర్విధాహారంబులగువని వరంబందికొనిపయి ప్రయాణముల గామ్యకవనంబు సొచ్చుచుండ నొక్కనాటి యర్ధరాత్రమ్మున కిమ్మీరుం డను రాక్షసుండు మార్గవిరోధియై వారిం బాండుకుమారులని తెలిసి యట్టహాసమ్మున నిల్చినియె.

అఠాణా — ఖండగతి

ప॥ వెదుకబోయిన తీవ - పదములకు దగిలినటు
భీముడే యగుపించెనా - నాయన్న నుజంపిన

అ॥ ప॥ నదినమీ వేళనా - సోదరుని బుజంకు దీ
ర్చుటకు దలచియుమ్మొ నౌ - రా నేటకానురుని తమ్ముడ ॥వె॥

చరణము

మీాకు గాలముతీతి - నాకపతువచ్చితేరి
పోకార్చు గాచుకొండెడ - పాండుతనూభులార ॥పో॥
పాకారి కేనివను - బవరమున డీకొనగ
వశముగాదని తెలియుడీ - నేకిమ్మారుడ ॥వె॥

సీ. అని పల్కుచు నమీర • తనయుపై గవియుచా
రుణభంగి నతని పా • వనియుదాకె
భూరుహమ్ములగొని • పోరి రాపై శిలా
సంగరమొక్కింత • సల్పెంత
మానుపాశను భీమ • నేనుందు పరిహాస
బలునిగా గురించి • బాహుదండ
ముల బకుంగూల్చిన • పోల్కి వానికటికిం
త ప్రదేశమ్ముల • న్పట్టినేల

ఆ. వె. బెట్టి దేహమిష్టి • విఱిచి కాలునివురి
కనిపె ధర్మజాదు • లభినుతింప
గరము సంతసించి • కామ్యకవనమున
బాండవులు వసించి • యుండునంత.

వ అట్లు కామ్యకవనంబున మునివృత్తినున్న పాండవులం బరామర్శింప
శ్రీకృష్ణుండు పాంచాలయాదవ ప్రముఖుల న్వెంటనిడుకొని తద్వ
నమ్మునొద్ది పాండవేయులంగని జాలిపడుచు ధార్తరాష్ట్రులకలిగి.

కేదారగౌళ - రూపకము

ప॥ అవమతులై సాబలేయు - లడవులపాల్జేసిరామి ॥మ్మ॥
అ॥ ప॥ అవనీతలమంతయు మా - దారాదురోదరమునగెల్చి ॥యు॥

చరణము

యువతీమణి నావిధి నిం - డోలగమున కీడ్చిరా
శివ శివ! పుట్టమ్ములొలిచి - చెఱచిరాభరతాన్వయంబు ॥నన॥

సీ. రణభూమి గౌరవ • రక్తధారాపాత
మేటులై నిండ పా • టింపకున్న
కన్నీటదేలించి • గాంధారికోడండ్ర
విధవలంజేసి యే • డ్పింపకున్న
జతివిధికేనొక్క • సుతుడుసైతములేక
చీకుజేసి దపింప • సేయకున్న
విఖ్యాత పాండవ • విజయఢంకారావ
మెల్లదిక్కులను మ్రో • గింపకున్న
తే. గీ. ధౌమ్యుడభిషేచనంపు మం • త్రాలుసదువ
నెగడు జయజయ శబ్దముల్ • నింగిముట్ట
సార్వభౌమునిగా మహీ • స్థలికి ధర్మ
సూను గావింపకున్న కృ • ష్ణుండగాను

వ. అని పల్కునంతలో ద్రౌపది గోపాలుంగని.

క. అన్నా నీమొఱగనిదే
మున్నది సభకీడ్చివలువ • లొలిపించిరి ము
న్నెన్నడు నాపడిన గతి
న్నన్నము: వడిరే కులాంగ • నలు త్రిజగములన్.

సీ. సిరికాల వాలమా • భరతాన్వయమున జ
న్మించినారు ప్రశస్తి • నించినారు
మొగి ధనుర్వేదమా • మూలాగ్రముగ నభ్య
సించి నారున్నతి • గాంచినారు
గాండీవమాదిగా • గలుగు నాయుధము లా
ర్జించినా రరుల దూ • లించినారు
రాజసూయ మహాధ్వ • రం బన్నచేత జే
యించినారు యశమ్ము • పెంచినారు
తే. గీ. బావా బలమేమిటికి భీమ • పార్థులకును
రచ్చ కీడ్పించి నన్ను బ • రాభవింప

దమకు గాదని జూచి రిం • చరును గలిగి
దిక్కుమాలినదాన నై • తినిగదన్న

వ. అనుచుం దన పరిభవమ్ము సెప్పికొని దుఃఖించు ద్రోవదినూరార్చి వాసుదేవుండు సుభద్రాభిమన్యుల దోడ్కొని ద్వారవతి కరిగె. ధృష్టద్యుమ్నుండు ద్రౌపదేయులం దోడ్కొని కాంపిల్యమ్మునకుం జనియె నంత ధర్మజాదు లచ్చోటువీడి ద్వైతవనంబు సొచ్చి మార్కండేయ బకదాల్భ్యాది మహర్షు లాశీస్సులంది నివాసంబు లేర్పఱచుకొని యుండు నంత నొక్కనాడు పాంచాలి ధర్మజున కిట్లనియె.

మాండ్ — ఆది

ప॥ అడవులకంపినసహోదరాత్మజుల - ననుభవించుచున్నాడె భోగముల ॥న॥

అ॥ప॥ చెడుగులంచనక కొడుకులంగలసి చీకుతేడు పాషాణహృదయుడై

1. నృపకిరీట మాణిక్య కాంతిచే నెట్టనైన భవదీయ పదయుగము
యిపుడు కఠినంపురానేల నడువ నెట్టనయ్యె నకటా! యెంతవచ్చె ॥న॥

2. తమయు తేజమును గాలోచితముగ గల్పింపవలయు క్షత్రియుండెపుడు
తుమారరమణ గాంధారేయులపై శాంతిజూపుటేలా యీలీల ॥య॥

చ. సెలవిడి పంపుమా కదన • సీమకు నీవిపు డైన భీమపా
ర్థుల నవలీల నొక్కతృటి • లోపల దాయలగూల్చివత్తు రీ
యులభడివోవు ఘోరవిపి • నాంతర భూముల నెంతకాల మీ
సిలుగుల కాస్పదంబుగ వ • సించి కృశించుట రాచవారికిన్.

వ. అన విని ధర్మజుం డిట్లనియె.

ఉ. క్రోధగుణంబు పాపముల • కుం గుదురై చెఱచున్వివేకముం
గ్రోధియొకింత కర్జము నె • ఱుంగ డవధ్యులనైన గూల్చు నెం
తేదెగు నాత్మఘాత మొన • రించుకొసన్; క్షమగల్గువాని కా
మోదముభద్రమున్విజయ • ముంగలుగున్, క్షమియాటలెన్నయా

వ. అనిపల్కు ధర్మజునకు భీమసేనుం డిట్లనియె.

క. పితృపితామహార్జితమగు నీ
క్షితియంతయు నొరుల కప్ప ◆ గించి యడవులన్
వ్రతములు ధర్మములను చే
గతి కాంచుచు గడుప దగునె ? ◆ క్షత్రియుల కటన్.

ఉ. సింగము పాలి మాంసమును ◆ జేకొను నక్క విధాన రాజ్య ల
క్ష్మింగొని దాయవారలు మన ◆ చే, జరియింతురు రాజనీతి పా
రంగతులై ; తలంచుడు ప ◆ రాక్రమహీనులు పాండవేయు లం
చుం గడునుల్కనాడెదరు ◆ సొచ్చి యిటుల్ మునివృత్తి నున్నచోన్.

ఉ. పాచికలాడి రాజ్య మెడ ◆ బాపిరి దాయలు మోసగించి, ధ
ర్మాచరణంబు క్షత్రియుల ◆ కుంబున కెంతయు సాధనంబుగా
దీ చదువేల ధర్మజుడు ◆ మేనును తమ్ముడు నేగి వారిలం
బీచమడంచి యీ పృథ్వి ◆ వీరులు బొనరింతు మగ్రజా !

వ. అనవిని ధర్మరాజిట్లనియె.

తోడి—రూపకము

ప॥ కయ్యమాడుటకు సమయము - గాదు తమ్ముడా ॥కయ్య॥
అ॥ ప॥ వెన్నెలకు నీ వాడిన - విధము ధర్మముగాంగాక ॥కయ్య॥
1. వనమున బన్నిండేండ్లును - జనపదమున తెలియకుండ
నలివశివత్సరము గడుప - ప్రతినజేసి వారముగద ॥కయ్య॥

తే గీ చంచలంబగు లక్ష్మి కా ◆ సపడి నరుడు
సత్యధర్మంబు లెడయగా ◆ జనదు గాన
రాజ్యకాంక్షచే సలిపిన ◆ ప్రతిన వీడి
కదన మొనరింప ననుమతిం ◆ పదు మనంబు.

వ. అనిన భీమసేనుం డిట్లనియె.

తే. గీ. మరణమేరికి నియతంబు ◆ మరణమునకు
మున్నె వైరంబు దీర్చుకో ◆ బోని వాని
జీవితము వ్యర్థమగుగాన ◆ జావమోాది
వైరులందొల్త, నమవు మా ◆ పైని ప్రతిన.

క. శ్రమపడి యెటులో వనవా
సము సేయఁగ వచ్చుఁగాక ♦ సాధ్యమె యజ్ఞా
తము మొకర్వ, మేరుగిరి కూ
ర్చము సేయుటగాదె సకల ♦ దాయాదులకున్.

వ. అనుచు యుద్ధమే కర్తవ్యంబని పలుకు భీమసేనునకు ధర్మజుం డిట్లనియె.

శా. సామాన్యంబనుకొంటివో? తలఁపు భీ ♦ ష్మద్రోణాచార్యద్యుతు
ర్ధీమంతుల్ కురురాజపక్షమున వా ♦ రిన్ గెల్వఁగా శాత్రవ
స్తోమంబుం గనువిచ్చిచూడఁదగునే? ♦ దుర్యోధనాద్యంబు నా
నామర్త్యేశులు ప్రాణముల్ విడుచును ♦ న్నారండతో సిద్ధమై.

తే. గీ వినుము రాధాకుమారుఁడ ♦ భేద్యకవచ
శస్త్రశస్త్రవిద్యాసమా ♦ స్వజ్ఞుఁడతఁడు,
కర్ణుఁడిలునేర్పు బాహుబ ♦ క్రమము దలఁచు
కొన్ననాఁడు నాకుండదు ♦ కన్నుమూఁత

వ. ఇట్లు ధర్మజుండు దుర్యోధను నిగ్రహించుటకు విచారించు సమయంబున కృష్ణద్వైపాయనుం డచ్చటకు విచ్చేసి పూజితుండై ప్రతిస్మృతియను విద్యను ధర్మజున కుపదేశించి 'నాయనా! దీనిని నీవర్జునున కుపదేశింపుము. తపఃప్రభావసంపన్నుఁడైన యర్జునుం డింద్రాది దిక్పాలకులను, ఈశ్వరుని ప్రత్యక్షంబు సేసికొని దివ్యాస్త్రలాభంబుంది శత్రువుల జయించునని పలికి మీ రొండు వనంబున కేగుఁడని' యని చెప్పి యంతర్హితుం డయిన పాండవులచ్చోటువాసి బ్రాహ్మణులతో గామ్యక వనంబున సరస్వతీ తీరమ్మున నివసించుచుండ నొక్కనాఁ డర్జునుఁడన్నకడ ప్రతిస్మృతి నుపదేశమంది కవచ ఖడ్గశరాస్త్రధరుండై భూసురాశీర్వాదమ్ము వడసి పూర్వోత్తర దిశాభిముఖుండై యరిగి యింద్రకీలనగమ్మున నింద్రుం గని నుతించి యచ్చటనుండి యతనియనుమతి హిమశైల శిఖరంబున కరిగి యూర్ధ్వబాహుండై యేకపాదాంగుష్ఠాగ్రంబున

నిలిచి వాయుభక్షణంబు సేయుచు బరమేశ్వరు నుద్దేశించి యిట్లు కీర్తించుచు ఘోరతపంబు సేయదొడంగె

పూర్వకళ్యాణి—సంకీర్ణ జాతి త్రిపుట

ప॥ హరహరహర మహాదేవశంభో పుర - హర గంగాధర ॥హర॥

అ॥ ప॥ సురవరనుత కోశలపతి - సరసీరుహ కరిచర్మాంబర ॥హర॥

చ॥ ధరణీధరచాప నిరతాశ్రితజనావనాటోప, యుపశమిత సమస్త పాప - దయాభరణ దానవసంహరణ - గరళకంధర ధరాధర తనయారమణ చంద్రధర సృష్టిస్థితిలయ కారణ దురితాపహరణభుజ గాభరణా ॥హర॥

తే. గీ ఇట్లు తపమొనరించు దే • వేంద్రతనయు
భక్తి నిష్ఠ కెంతయును నా • పార్వతీశు
డలరి పాశుపతాస్త్రము మీఁ • నుంచికొని
బలము చలము బరీక్షింప • దలపుగొనుచు.

సీ. ఎఱుకతయై వెంట • గిరికుమారిచరింప
బంగరుమైచాయ • పరిఢవిల్ల
వెలపింపగల గొప్ప • విల్లొండు జేబూని
మూపునం దమ్ముల • పొది చెలంగ
చింకితలలు పొట్టి • చేతులు మిడిగ్రుడ్లు
గలిగి భూతములెఱు • కులటుదనర
పులులు నైతము మాక • మూకలై పాఱుచు
జీకాకుపడ బొలి • కేకలిడుచు

తే. గీ. నెఱుకురాజై పురారి డ • గ్గఱుచు మూక
దైత్యు గిటిజేసి విజయుపై • దవుల నరుడు
దాని దవ్వులగని గుణ • ధ్వని యొనర్చి
సిలువ నెఱుకులతేడు కాం • తేయునకనె.

బాగు—చతురశ్రగతి

ప॥ చాళుతాళు మెక్కెంత వరాహము గూలనేయగడగితి వెవ్వండవు॥

అ॥ ప॥ మేమేమి ? ఇప్పిన నాలింపవు కాలమాసన్న మాయెనే నీకు॥

చరణము

శరవిద్యా పాటవము నీకున్న - సంగతి తెలియునులే, చాలింపుము
మరియాదకు జూచిన నీగర్వము కానకుంటినిదిగో పొగరూడ్చెద॥

కం. అన గ్రీడి లెక్కసేయక
 సునిశితబాణమున నేసె • సూకరమును దో
 డనె హరుడేసెను దానిం
 గొన కిరువంక బాణములు ద • గుల్కొనె కిటికిన్.

క. శరము లిరుదెసల దాకిన
 కిరియును శరఘాతకలన • గిరగిర దిరిగెన్
 శరవిద్ధుండై నక్తం
 చరుడుం గిటిరూపమొకట • జాలించి చనెన్.

వ. అర్జునుండు విస్మితుండై ముంగట జాపధరుండగు నెఱుకరాజుంగని.

కాపి — ఆది

ప॥ ఏమేమో ప్రేలితి వింతకుము - న్నెన్నండవు చెవుమాసరిగా వినలే॥
అ॥ ప॥ కామినీయుతుడవై తిరుగ నేటికి మహారణ్య మధ్యంబునని ॥ఏ॥

చరణము

వలచేసితివి నాదేసినకిటి నేసిమూర్ఖుడవై - మృగయాధర్మవిరోధంబిపుడే॥
చాలు తెలిసె నీనడత నానిశిత - సాయకాగ్ని పాల్జేతు గాచుకో ॥ఏమే॥

వ. అనిన నెఱుకఱేడిట్లనియె.

ఉ. ప్రాణమువాసె మామక శ • రాహతిజేసి వరాహమట్లు, నీ
 బాణముదాకి కూలెనని • పల్కెదు సిగ్గటులేదుకో నిన్ను నీ
 వే నుతియించుకొందువిటు • లెంతయు జెప్పెదు లేనిశౌర్యమున్
 మానక బీరమున్న నిలు • మా, యికనీపని గాననయ్యెడున్.

చ. అనుచు బినాకితాకె నరు • నర్జునుడున్ శరవృష్టి ముంచె న
 య్యనఘు శరమ్ములన్నియును • వ్యర్థములై చనిమొం, గిరాతుడే
 సిన విశిఖమ్ము లింద్రసుతు • ఛిన్నశరీరు నొనర్చె మాయ ను
 య్యోనుపయిపెచ్చు కాయునశు • డిచ్చినయక్షయసాయకమ్ములన్

వ. అట్లగుట నర్జునుండు విస్మయపడి.

నీలాంబరి—చతురశ్రగతి

ప॥ ఘనకిరాతవేషమున వచ్చిన - గంగాధరుడో యీతడు ॥ఘన॥

అ॥ ప॥ రణమున నాశరఘాటికోర్చి బీరమ్ము సెడక మూర్ఛిల్లకుండు నే॥ఘ॥

చ ర ణ ము

మాయమయ్యె నగ్ని దేవుడొసగిన-సాయకమ్ములతో యశరనిధితో ॥మా॥

యేయుపాయమున పినిగెల్తు నే - డేల వచ్చె గిటికై పోరాటము ॥ఘన॥

మ. అని గాండీవమునెత్తి యీటవికునే ♦ యనే వ్యర్థమైపోయె, గో
పనుడై చేసె కృపాణపాత మదియున్ ♦ వమ్మయ్యె, బాహుండటన్
ఘనవృక్షమ్ములు వాలువై వ నడగెన్, ♦ గాంతేయుడాపై రణం
బొనరించెం దెగి ముష్టిఘాతముల శౌ ♦ ర్యోద్రేక విస్తారుడై.

క. బుడుతనెలతాలుపా క
వ్వడి బిడికిటబోడుప క్రీడి ♦ వడిమూర్ఛపడెన్
వడము డిలమ్ముడు సూపిన
కడిమింగని సంతసించి ♦ గంగాధరుడున్.

సీ. జడలమిన్నేటితో ♦ పామేనిగారితో
బొలుపారు జాబిల్లి ♦ పూవుతోడ
చిలువ సూడిగముతో ♦ పులితోలు శాల్వతో
వలనైన మువ్వన్నె ♦ వాలుతోడ
చొక్కంపు టాబోతు ♦ జక్కితో వెలిమిడి
పూతతో జిలుగువ్వ ♦ మోముతోడ
రాణించు పునుకవ ♦ రాలతో వినపుగు
తుకతోడ నొనటిజే ♦ సికనుతోడ

తే. గీ. హరుడు సాక్షాత్కరించి యె ♦ మ్మర్జునా! త్వ
దీయ ధైర్యమ్మునకు మెచ్చి ♦ తిని వరమ్ము
వేడుమన నింద్రసూనుండు ♦ విశ్వనాథు
గాంచి కేల్మోడ్చి మొగిచి ను ♦ తించె నిట్లు.

కేదారగౌళ—మిశ్రజాతిత్రిపుట

ప॥ శరణు శరణు గంగాధరగిరి - జామనోహరా ॥శరణు॥

అ॥ప॥ పరమపురుష భక్తపోష - విషధరపరిభూషా

చ॥ కరధృతధరణీధర పురహర హర వరకరుణాకర శుభకర - గరళ
కంధరా తరుణేందుధరా - శరణాగత పురందర పరాత్పరపరబ్రహ్మ
రజతాచల - సదన మదనదమన వృషభగమనా ॥శర॥

క. ఎఱుకసెడి నిన్నెఱుంగక
మొఱకు దొరంబలె దలంచి ◆ యెదిరిన నాయీ
మఱకువ సైరించి దయా
పరత బ్రసాదింపు మభవ! ◆ పాశుపతంబునన్.

వ. అని వేడు పురందరనందనుం గని గిరిజాసుందరుం డర్జునా! అతి
మానుషంబైన నీపరాక్రమంబునకు మెచ్చితిని. నీగాండీవ మక్షయ
శరధితోడ మదీయ మాయాగ్రస్తంబయ్యె మఱల నిచ్చితిం గొను
మని యిచ్చి పార్థుం గరుణించి మంత్రధ్యాన జపహోమపూర్వ
కంబుగా సంధాన మోక్షణ సంహార సహితంబుగా బాశుపతా
స్త్రం బిచ్చి యీదివ్యాస్త్రంబున నీవెల్లలోకంబులు జయింతు
వని వరంబిచ్చి పురాంతకుం డంతర్ధానమయ్యె నంత నింద్ర
యమ వరుణ కుబేరాది దిక్పాలకులు విజయునికడకు నరుదెంచిరి.
వారిలో యముండు దండంబును, వరుణుండు పాశంబును, కుబే
రుండు కౌబేరకాస్త్రంబు బార్థునకు విధియుక్తంబుగా నిచ్చి
యరుగ, నంత దేవేంద్రుం డర్జును నమరావతికి దోడ్కొనిరమ్మని
రథంబిడి మాతలిననుప బాండవమధ్యముం డద్దివ్యరథం బెక్కి
యింద్రలోకమ్ము సొచ్చిన శతముఖుం డభిముఖుండై తనయుం
గౌగిలించుకొని ప్రీతియమ్మున నర్ధసింహాసనాసీనుం గావించె.

శ్రీ

# మహాభారతము

## ఘోషయాత్ర

హంసధ్వని—ఆది.

ప॥ వినుడీదుర్యోధనుఘోషయాత్ర-వీనులపండువుగా...విన్పించెద ॥వి॥

అ॥ప॥ వినవిన నత్యద్భుతమీ భారత-వీరవరుల సత్పుణ్యచరిత్రము ॥వి॥

చరణము

దేవగంధర్వ విద్యాధర పరి - సేవితుడై సురరాజతనూజుడు
దేవలోకమునందునంత జను-దెంచనతఁడొకనాడూర్వశి ॥వి॥

సీ. బలితంపుజందోయి ♦ పైఁ జందనములంది
వలిపమ్ము రింగులు ♦ వారగట్టి
సురతరుసూనము ♦ ల్దుఱుమునందుఱిమి సిం
గారించిమేలి బం ♦ గారునగలు
చెలువంపుటలకమ్ము ♦ లలరించి ముద్దులు
గులుకఫాలమ్మున ♦ దిలకముంచి
నాణెంపురవల రా ♦ ణ్డాణమ్ము గా సేసి
మంచిముత్యాల క ♦ మ్మలు ధరించి

తే. గీ. రత్నమంజు మంజీర ఝ ♦ ళంఝుళలును
కంకణాంచిత ఝణఝణ ♦ త్కారములును
పాకరిపుసూనునకు దన ♦ రాక దెలుప
వచ్చె నూర్వశి మెచ్చి వి ♦ వ్వచ్చుకడకు.

క. రాగని ప్రణమిల్లగ నెల
నాఁగయునని నీకిదేమి • నాయము ? వినుమా
భోగపుజానను మనసిజ
రాగముగొని వచ్చితిని భ • రతకులదీపా!

వ. అన విని యర్జునుండును చెవులుమూసికొని

చ. హరిహరి, యెంతమాట విన • నయ్యె, బిడౌజుడు తండ్రినాకు, నీ
వరయగ దల్లివౌదువు, మ • దన్వయ సంభవుడౌ పురూరవుం
బరిణయమైతి వక్కతన • వానికి నవ్వవు పూజ్యురాల వీ
వరుస వచింతునే ? వరుస • వావులు సైతము వీడ బాడియే ?

వ. అనవిని యూర్వశియు

ఉ. వావులతోడ నేమిపని • వారవధూటికి ? భార్యయే కదా
ద్రోవది మీకు ? తల్లియని • తోచదొ నీకపుడన్న భార్య ? యీ
వావులు లేవొకో యచట ? • భ్రాతృసతీమణి తల్లిగాక నీ
కేవిధి దల్లియౌ జనకు • డేలిన భోగము దాన నర్జునా!

తే. గీ. అరయ దేశాటనము, సుధీ • వరుల మైత్రి,
రాజసభ మెలంగుట, శాస్త్ర • రచన మెరుగుట,
వెలవెలది పొందు నీయెడ • గలుగ వాడు
చతురుడగు గాన నాపరి • చయము గొనుము.

వ. అనిన నర్జునుండు.

జంఝూటి - త్రిశ్రగతి

ప॥ సానులకు సమాధానము - సరిగ నెవ్వరు చెప్పగలరు ॥సా॥

అ॥ ప॥ మీననయన నరుడను నీ- తో నాకీ తగులమేల ॥సాను॥

1. వ్యాసునను మతమున మాతృ - శాసనమున ద్రోవదినటు
మా సోదరు లేవురము గ్ర - మముగ బెండ్లాడవలసె ॥సాను॥

తే. గీ. నావివరునలు లేకపో • వచ్చుగాక
యిచటి యాచారముం బట్టి, • యేనరుండ

నీవు దేవవేశ్యవు మన ♦ కిర్వురకును
సంగమముపాడిగా దెంక ♦ జనుము వేగ.

వ. అనినవిని యూర్వశియు,

క. నరనారాయణుల న్నిను
నరుడనిరి, తపోధనులు న ♦ నాతనమును లో
నరనారాయణు లధికులు
పరికింపగ సురలకన్న ♦ బాంధుకుమారా!

క. నారాయణముని నను తన
యూరువున సృజించెజాన ♦ నూర్వశినైతిన్
వీరాగ్రగణ్య! నీవీ
కారణమున సురలలో నా ♦ కండవుగావే!

వ. అన నర్జునుం డిట్లనియె

తే. గీ. అన్నదమ్ములు నరుడు నా ♦ రాయణుండు
వారిజాక్షి! నారాయణు ♦ నూరుభాగ
మున జనించిననీవు నా ♦ తనయవైతి
వట్టినిను గూడ నఘనె క్రా ♦ మాంధుడనయి!

వ. అనిన నాదేవవేశ్యయు.

తే. గీ. అన్నదమ్ములె నరుడు నా ♦ రాయణుండు
సురవిభుండునారాయణు ♦ సోదరుండు
మఱదివైతివి నంశయుం ♦ ప బనిలేదు
వావియును నరిపెట్టు కో ♦ వచ్చుదీన.

వ. అని పల్కుచు జివాలున కౌగిలింపబోవ నర్జునుం డొక్కింత తొలంగి నమ్మతిం జూపకుండుటచే నూర్వశియు గోపించి చుఱ చుఱం జూచుచు.

హిం॥ తోడి _ త్రిశగతి

ప॥ లేనిది లేకయుండ నరి - లేమలు నగుదురు నగుగని ॥లేని॥
అ॥ ప॥ తానయి వచ్చుటకన్నను - తప్పుగలదె వేశ్యాంగనకు ॥లేనిది॥

1. తొలువ నీమనం బెఱుగక - వెలిబుచ్చితి నామనంబు
కలదే యింతకు మించిన - కష్టము పరిభవము సతులకు ।లేనిది।

2. యువకుడవై నన్నీగతి - ననుకుపెట్టితివి గాన్పన
యువతీజనమధ్యంబున - సుందుమా సవునపుడవై ।లేనిది।

చ. అనిశదియించి వేల్పు వెల ♦ యాలుచనెగ్; దివజేంద్రసూనుం గుమా
రునికడ కేగుదెంచి మును ♦ యున్నరిరారు జితేంద్రియత్వమం
దునవొగి నీకటంచు విను ♦ తుల్ బొనరించుచు శాపమింక నీ
కనుభవమా నొకింత వెర ♦ నై పదుమూడవ వత్సరమ్మునన్.

వ. అని పల్కుచు దివ్యాస్త్రమ్ము లెన్నియో నుపదేశించి, కుమారు
నై దేంద్రు తనకడ నుంచుకొని, పార్థుని కుశలవార్తయు, దివ్యాస్త్ర
సంసిద్ధియు ధర్మజున కెఱిగింప రోమశుంబంప నమ్మహాముని యు
బృహదశ్వ మహామునిచే సకల కలికల్మష నాశన కరంబగు నలో
పాఖ్యానంబువిని గాండీవిరాక కోరుచున్న ధర్మజుని కడకుం జని
పార్థుని క్షేమం బెఱిగించి ధర్మజాదుల నెల్లరం దోడ్కొని సమస్త
పుణ్యతీర్థంబులు సేవింపజేసి గంధమాదన పర్వతంబునకు జేర్చి
నందొక్కనాడు పాంచాలీ భీమసేనులు విహరించుచో సమీర
విధూతంబై యొక్క సౌగంధిక కమలంబు భూమిపయింబడ జూచి
ద్రోవది భీమసేనున కిట్లనియె.

శ్రీరంజని—ఆది

ప॥ అతిమనోజ్ఞమీ యరవిందముగను - మనుప
మాన మిదియ..............సుమజాతికెల్ల ।సతి।

అ: పటి : శోకమ్మున దీనిని సృజియించిన -
చతురాననుచతురత స్తవనీయం ।బతి।

చరణము

ఈసమీపమునసట్టికుసుమంబు - లెందేనిగల్గుచో...దెచ్చియిమ్మునాథా
యీసౌరభ రామణీయకము భువి - నేసూనములకు ముమ్మాటికిలేదతి,

క. అనిపల్కి లతాంతము గొని
చనియెం బాంచాలి ధర్మ ♦ జాతునికడకున్
ధనువుం బాణములుం గొని
యనిలతనూజుండు వయన ♦ కౌసుమమునకై.

సీ. కమలంబు దెచ్చిన ♦ గాడ్పున కభిముఖుం
డై చని మార్గమ ♦ ధ్యమున నెదిరి
పై వచ్చుమృగముల ♦ బ్రహరించుచుం బద
ఘట్టనధ్వని బృథు ♦ భూధరేంద్ర
మ్రదువ వేగంబున ♦ నరుగుచుం గడకు ముం
గట సరోవరమొండు ♦ గాంచి యందు
గాడ్పుపట్టి గ్రుతావ ♦ గాహుడై వెలువడి
సంభృతోత్సాహుడై ♦ శంఖమొత్తె

తే. గీ. శంఖనిస్వనమున గుహా ♦ శయునుడైన
హనుమ లేచి మార్గమ్మున ♦ కడ్డముగ బ
రుండె మృగములు వెఱచి వ ♦ ర్వ్యలిడ జేసె
సత్వమేపార లాంగూల ♦ చాలనంబు.

వ. తద్ధ్వనివిని భీమసేనుండు విస్మితుండై సమీపించి యోగనిద్రనున్న హనుమంతునిగని నిద్రజెఱుప సింహనాదం బొనర్ప నాంజనేయుం డును మేల్కొని భీము ననాదరంబున జూచుచు నిట్లనియె.

నవరోజు—ఖండగతి

ప॥ నన్నేల మేల్కొలిపి - నాడ వీవెవ్వడవు
కన్నులగుపడ కేండ్లు - గడచి వృద్ధుడనైన ॥నన్నేల॥
అ॥ ప॥ ఉన్న బలమంతయును - నన్నగిలి కదల లే
కున్నాడ నిదురించు - చున్నాడ వానరుడ ॥నన్నేల॥

చ ర ణ ము

వెఱపింప నాబోటి - పేదమృగముల నిట్టు
లురక గర్జింప నగు - నే ధర్మమెఱుగకిటు

నరమాత్రులిచ్చోటల - దిరుగ వీల్గాదు క
మ్మ్రుఖుగ నా వమాటవినిం - మనదలంచి పోని ॥నన్నే॥

తే. గీ. అనినవిని భీము డనె ఙ్ఞతి • యాన్వయుండ
పాండుతనయుండ విఖ్యాతి • బాహుబలుడ
వాయువరమున గౌంతి గ • ర్భంబునందు
బుట్టినట్టివాడ నను భీ • ముడనియండ్రు

క. తెరువిమ్మనాకు లేదా
శరనిధి లంఘించి చనిన • సామీరికతిన్
ధరణీధరముః ప్నిప్పను
బరువడి లంఘించి పోవు • వాడ నటన్నన్.

తే. గీ. అంతపసయిందులకు వృద్ధు • నైతి లేవ
జాల లో మొదవేని నా • వాల మీవు
ప్రాయద్రోచి పొమ్మను నంత • పాండుసుతుడు
వామకరమున నెత్తగా • వశముగాక
కరయుగమ్మున నెత్తి వ్రమె • గతిలబడియె.

శా. లాంగూలమ్ముగదల్పనోపక కదుర • లజ్జించి కేలోడ్చి ని
ల్వంగాంచేయునకిట్లనె న్హనుమ పా • రావారముర దాటి సీ
తంగన్గొన్న సమీరసూనుడను పా • ర్థా! నేనె, పాటింపకీ
భంగం బిర్వుర మన్న దమ్ములము నీ • పై ప్రేమగన్పించితిన్.

తే. గీ. సమరమున నర్జును రథ ధ్వ • జమ్మునందు
నిలిచి మీమీపరాక్రమం • బులను జూతు
గాకయని భీముడేగు మా • ర్గమ్మునూవి
హనుమ డంతర్హితుండయ్యె • నాక్షణంబ.

మంజరులు

ఆమార్గంబుననేగి కొలనుగని - యందలి సలిలము గ్రోలి
భీమసేనుడుం గోసెనాపై డి - తామరపూవుల నోలి
అదిగని కాపున్నయక్షరాక్షను - లలిగి భీముపై బడగ
సదమదంబుగావించి యెల్లర - సమీరతనయుడు వడిగ

తన కెదురువచ్చు ధర్మజాదు లం - గన్ని మొక్క ప్రమోదింప
తన తెచ్చిన కమలంబు కృష్ణకిడ - దన్నెల్ల రభినుతింప
నానసమీపమున పాండుతనయులు ... వాసముగ నుండునంత
భూసురవేషమున వారిగలసి జ - టాసురుండుండె నంత.

సీ. ఒకనాడు వేటకై ♦ బకవైరి చనికేగ
బలలోభి నిర్వృత రూ ♦ పమ్ముదాల్చి
ద్రౌపదీసహిత ధ ♦ ర్మజుల నెత్తికొని జ
వమ్మున బఱచె బా ♦ వలు భయపడ
రక్షింపు గిరవము భ ♦ రమ్ముగా నదిమె నా
కుంతీసుతాగ్రజుం ♦ డంతలోన
సహదేవు పిలువున ♦ సామీరి వినుదెంచి
తనవారి విడిపించి ♦ దనుజుదాకె

తే. గీ. ఘోరయుద్ధంబు గావించి ♦ క్రూరదైత్యు
గెడపె ధౌమ్యాదులెల్ల గ ♦ గ్గింప నట యు
ధిష్ఠిరుడు వృషపర్వు నా ♦ దేశమునను
విడిసె నట మాల్యవద్గిరి ♦ విపినసీమ.

వ. అందు విహరించుచో నొక్కనాడు మారుతానీతంబై పంచవర్ణ సురభికుసుమం బొండు తమ్ముఁ గటం బడిన విస్మయం బంది ద్రౌపది యేకాంతమ్మున భీమసేనున కిట్లనియె.

కన్నడ - ఆది

ప॥ పంచవర్ణ సురభిప్రసూనమిది - ప్రాణనాథ లోచనపర్వంబగు ॥పం॥
అ॥ప॥ మంచితావు లలరించుచున్నదిదిగో - మదిపూర్ణసకన్నను నినువేడిగా

చ ర ణ ము

ఈయపూర్వ రమణీయప్రసవమ్ము - లెన్ని చేసెండు జూచియుండగను
నాయభీష్టమీడేర్చుమానుమను - లేయడంగలవేగొని తెచ్చియిచ్చి ॥ప॥

చ. అనవిని వేగ ద్రౌపది మ ♦ నోభిమతంబొడగూర్పనెంచి పా
వనిగిరిశృంగమెక్కి సలు ♦ వంకలగన్గొని ...

ద్ధ్వనివిని యక్షరాక్షసులు ♦ దాకిరిభీము, రణమ్ముఘోర మ
య్యెను మణిమంతుడాదిగ న ♦ మిద్ధపరాక్రము లీల్గిరెందరో.

వ. ధర్మజుండును భీమునన్వేషించుచు నాతనయొద్దకుంజనియె నటకు కుబేరుండు ననుదెంచి పాండవసత్కృతుండై భీమసేను సాహసంబు వారింపుమని ధర్మజుని వేడుకొనిపోవ, పాండుకుమారులు కుబేరాదేశంబున నార్ష్టిషేణాశ్రమంబున సుందరంత జలధిసత్త్రిలో దాగి వేల్పులం గాంచుచు నివాతకవచులను కాలకేయాదులను పాశుపతాస్త్రప్రయోగమ్మున వధించి మహేంద్రునిచే నభేద్యకవచమ్మును మణికిరీటంబును వడసి మాతలిప్రేరకంబగు రథంబెక్కి నాకలోకంబుననుండి యర్జునుండు నరుదెంచి మొల్లరకుం గనువండువు సేసె. అంత పాండవులు బదరీవనంబాదిగాగల పెక్కుచోటులం దిరుగుచుండ నొక్కనాడు భీముండు హిమవన్నగశృంగపరిసరారణ్యంబున నొక్క యజగరమ్ము చేతబట్టువడ, భీముంగానక వెదకుచు ధర్మజుం డయ్యెడకరుదెంచి చూచి యాశ్చర్యపడి భీమసేను వదలుమనివేడ నయ్యజగరం బిట్లనియె.

సారంగ — ఖండగతి

ప॥ వినుమయ్య నహుషుడను - జననాయకుడనేను ॥విను॥

అ॥ ప॥ పౌనరమీ పూర్వులకు - పూర్వజుడ నోయనఘ ॥విను॥

1. శతమఖంబు లొనర్చి - శక్రత్వ మందితిన్
ఋషిసురులు మోయనె - క్కితిని బ్రహ్మరథంబు ॥విను॥

2. ద్విజుల నవమానించి - తి నటంచు శపియించె
నజగరము గమ్మంచు - నలిగి కలశభవుండు ॥విను॥

తే. గీ. పాండవాగ్రజ! నాచేయు ♦ ప్రశ్నములకు
నుత్తరంబిడ శాపాంత ♦ మొదవునాకు
దమ్మునిన్విడిపించుకో ♦ దలచితేని
వడి సమాధానమిమ్ము నా ♦ ప్రశ్నములకు.

వ. అనిన నియ్యకొను ధర్మజుంగని యేగుణంబులు గలవాఁడు బ్రాహ్మణుండు? అతం డెఱుంగఁదగిన వస్తువెయ్యది? యని ప్రశ్నింప.

తే. గీ. సత్య దాన క్షమా తప • శ్శౌచ దమద
యాగుణమ్ములు గలుగు వా • డవనిసురుఁడు
సుఖము దుఃఖము సమముగా • జూచుకొంట
వాని కెఱుంగ దగినట్టి • వస్తువగును.

వ. అనిన నోధర్మజా! నీచెప్పిన సత్యక్షమాది గుణంబులు శూద్రునం దున్న శూద్రుండు బ్రాహ్మణుండగునే యని ప్రశ్నింప.

తే. గీ. శూద్రు డాదయా గుణముల స • చ్ఛాస్త్రమునగును
గాక బ్రాహ్మణు డెన్నఁడు • గా డతండు
దాన సత్యాది గుణములు • లేని బ్రాహ్మ
ణుండు సైతము ధరణి శూ • ద్రుం డనంబడు.

వ. ఇట్లు సమాధానమ్ములు సెప్పి యనుజు న్విడిపించుకొని ధర్మజుండు వృకోదరుం దోడ్కొని తమ్ములం గలసి యావనంబున సుఖంబుండి మార్కండేయు వలన నను న ధర్మార్థశాస్త్రంబు లెఱింగి యనంతరంబు ద్వైతవన సరోవర సామీప్యంబునందు సద్యస్కందం బను యజ్ఞంబు సేయుచుండ నిట హస్తినాపురంబున.

సీ. రాజ్యభోగముల గో • ల్పడి యరణ్యముల న
ల్లాడు పాండవుల గ • న్నారగాంచు
తలపున ఘోషయా • త్రావ్యాజమున సంధ
వసుధేశు నొప్పుకో • ల్పడసి కౌర
వాగ్రజుం దనుజక • ర్ణాదులం గలసి ద్వై
తవనంబు సొచ్చి గం • ధర్వవిభుని
చిత్రసేనుండాక • జెలగి గంధర్వులు
రణమున గర్ణాదు • లన్జయించి

తే. గీ. కురునృపాలుని జెక్కులు • విఱిచికట్టి
కొనఁగ గొంపోవుచుండ గ • గ్గోలువడుచు

సైనికులు దిక్కుసెడి ధర్మ ♦ జాతుకడకు
సత్వరముపోయి మొరలిడ ♦ సాగిరిట్లు.

శుభపంతువరాళి - చతురశ్ర

ప॥ శరణాగతరక్షణ బిరుదముగల - దొరవు ధర్మరాజా రక్షింపుము ॥ శ॥
అ॥ ప॥ కురుకులేంద్రు పరివారముతో - గొంపోవుచుండిరయయో!
గంధర్వులు॥

చరణము

తలప గారణాంతరమైన వైరము - గలిగెగాని కాదా మీయనుజులు
చెలిమిమీఱ విడిపింపుము మావిభు - గలవాసెకు తెలియునిధర్మంబులు॥ శ॥

తే. గీ అనినవినిధర్మ భూపతి ♦ యనుజులగని
కౌరవేంద్రుబంధవిముక్తు ♦ గా నొనర్చి
సత్వరము రండని నొకింత ♦ సమ్మతింప
కా వృకోదరు డిట్లనె ♦ నగ్రజునకు.

క. అంధనృపాల సుతులుగ
ర్వాంధులు నీకేమి వెత్తి ♦ యా? విడిపింపన్
బంధము, కౌగల కార్యము
గంధర్వాలె దీర్చ మనకి ♦ కన్ శ్రమతొలగున్.

క. అడవులపాలై యిడుములు
గుడుచు మనలగాంచినవ్వ ♦ గొనివచ్చిన యీ
వెడగు సుయోధనుగర్వం
బడగెగా దయదలపనేటి ♦ కన్నా! మనకున్.

వ. అనవిని ధర్మజుం డిట్లనియె.

చ. కలహములుండుగాక మన ♦ కన్మనలో మనకెన్నియేని, య
న్యుల వలనం బరాభవము ♦ నొందునెడన్ మన మూరకుంట కే
వలమును లోకనింద్యమగు, ♦ బాసిగదా శరణాగతావనం
భిలి నటుగావునం గురుకు ♦ లేంద్రుని బంధవిముక్తు జేయుడీ.

వ. అనిన విని భీమసేనుం డిట్లనియె.

సీ. నిదురించు నను గట్టి ♦ నీట ద్రోయించి గా
అించి పాముల గర ♦ పించినారు
వెన నన్నమందున ♦ విసము గల్పించి పె
ట్టించి చంపింప నూ ♦ హించినారు
మొగి వారణావత ♦ మ్మున లక్కయింటిలో
నుంచి నమ్మించి కా ♦ ల్చించినారు
జూదమం దోడించి ♦ సుదతికి జీరలో
ల్చించి కాఅడవి కం ♦ పించినారు

తే గీ. తివిరి వారిగ్గు సేసిని ♦ దినము కలదె?
వారిచేత లెవ్వియు దలం ♦ పవు గదన్న?
యొక్కసిమున మోపికవట్టి ♦ యుందు మట్లు
గానిచో గార్యహానియగా ♦ గాదె? మనకు.

వ. అనవిని యజాతశత్రుండు సాంత్వనపూర్వకమ్ముగా నిట్లనియె

చ. శరణనివేడుచో రిపుని ♦ సైతము బ్రోచుట శూరధర్మ, మా
కురుపతి తన్ను బాండవులు ♦ గొబ్బున గాతురటన్న యాశతో
నరయును, పోదమన్న జెడు ♦ నధ్వగదీక్షయు, నన్ను జూచి మీ
రరిగి సుయోధనున్ మనుప ♦ రయ్య! యుశంబును బున్నెమబ్బెడున్.

వ. అనిపల్కు ధర్మనందను పలుకు లతిక్రమింపనేరక భీమార్జున నకుల సహదేవులు తత్క్షణంబ గంధర్వులం దగిలి ఘోరయుద్ధం బొనర్చి సైన్యసమేతమ్ముగ చిత్రసేను నోడించి యెల్లర నగ్రజునొద్దకు దోడ్తెచ్చిన, ధర్మజుండును సంతసించి బంధమోక్షణంబు గావించి యనుప దుర్యోధనుండును లజ్జితుండై చెదరిన సేవలం గూడుకొని కొంత దవ్వరిగి యొక్కచోట బటమందిరమ్ము వేయించి తల్పంబు పయింబడి చింతాపరుండై యిట్లు విషాదమందె.

ధన్యాసి - రూపకతాళము

ప॥ ఎంతటియవమానము ఘటి - యించె నేటికి ॥నాకెం॥

అ॥ కాంతాజనసహితముగా - గంధర్వులు బంధించి ॥ఎంత॥

చరణము

పాండవేయులే నను గా - పాడవలసి వచ్చెనా ?

మొండినై జగానబ్రతికి - యుండవలసి వచ్చెనా ? ॥ఎం॥

సీ. జనకుడు వలదన్న ♦ పనికానిపని మున
కేగెడుబుద్ధి నా ♦ కేలగలిగె ?
గలిగెబో సురనాథు ♦ కొలువిగ్గ్రుచున నట్లు
క్రీడాగృహముల ని ♦ర్మింపనేల ?
నిర్మించితినిబో, వి ♦ నీతిబాసి పయిచ్చ
రాళ్ళపై గవిసి పో ♦ రాడనేల ?
పోరాడితినిబో, వి ♦ ముక్త జీవుడగాక
యేటికి తప్పనవ ♦ పాటువడితి ?

తే. గీ నకట ! పోడిమిసెడి లోకు ♦ లపహసింప
నే మొగమ్మున బురమున ♦ కేగువాడ
బలుమరు పరాభవమున కా ♦ స్పదముగాగ
రాచకొలమున నొగి బుట్ట ♦ రాదు గాదె ?

వ. ఇట్లు విషాదవివర్ణుండై యున్న దుర్యోధనునకును గర్ణుండునేరి యిట్లనియె.

చ. అలనట సుంతయేని గన ♦ వాఖచరాధిపు గ్లాని పోరిలో
గెలిచితివోయి ! చేయదగు ♦ కృత్యము సుంతయు దోచకుంటచే
దొలగితి నేనుసైతము నె ♦ దుర్భగజాలక చిత్రసేను, నీ
బలము పరాక్రమంబు గుణ ♦ వల్లభ ! వెల్లడియయ్యె నేటికిన్.

వ. అనినం గురుపతి లజ్జితుండగుచు రాధేయున కిట్లనియె.

చ. అరులజయించి వచ్చితి న ♦ టంచు దలంచి నుతించుచుంటి వీ
వెఱుగక నేడు నాపడిన ♦ హీనపుబాటు, నిజాంగనా సహో
దర సహితమ్ముగా ఖచర ♦ తండము నన్గొనిపోవుచుండ న
త్వరమరుదెంచి బంధమెడ ♦ బాపిరి నన్గరుణించి పాండవుల్.

వ. ఇట్టిదురవస్థకుం బాలైన నేను ప్రాయోపవేశమ్మున ప్రాణత్యాగం బొనర్తుననుచు గర్ణాదులు తలడసి ప్రతిమాలినను వినకున్న నాటి రేయి దుర్యోధనునొక్క కృత్య పాతాళంబునకుం గొనిపోవ నచటి దైత్యులు వానిం గౌగిలించుకొని సంభాషించి ధైర్యమ్ము సెప్పి మఱల గృత్యచే నెప్పటిచోట నిలువ ప్రభాతంబగుడు ప్రాయోపవేశము మాని యెల్లరం గలసి కురుపతి కరిపురంబున కేగె.

శ్రీ

# మహాభారతము

## సైంధవపరాభవము

భైరవి - ఆది

ప॥ వినుడు సైంధవపరాభవచరిత్రము - వివరించెదనేడు - వీనుల విందుగ

అ॥ ప॥ కనుడు సంసారవార్ధిఁ గడచి - యనుపమానకైవల్యానందము ॥ వి॥

చరణము

దురితమనక పరకాంతారతులై - చరించుచున్న మానవులకు సతతము పరి
భవమ్ము దుర్యశము గల్గు, దనృతము; సైంధవుడే సాక్షీభూతుడు ॥వి॥

సీ. పాండుపుత్రులు ద్వైత • వనమును వీడి కా
మ్యకమున దృణబిందు • నాశ్రమమున
వసియించు చొకనాడు • పాంచాలి కా ధౌమ్యు
సాయమునుంచి వనంబు • వనిరి వేట
కా ద్విజుండు సమిత్కు • శార్థమై యందంద
సంచరించుచునున్న • సమయమందు
సైంధవోర్వీపతి • సాల్వకన్యను బెండ్లి
యాడవైభవమున • నరుగు నచట

తే. గీ. నాశ్రమద్వారమున గృష్ణ • నరసి మోహ
పడ సమీపించి కుశలమ్ము • లడిగి బంధు
భావమున నాదరించు రా • జీవనేత్రి
కిట్టు లనియెను కామితం • బెఱుకపడగ.

శహన - ఆది

ప॥ చాలుజాలు పై పైయుపచారము-శేలనే? తనివినదునామనసు ॥చా॥
అ॥ ప॥ వాలుగంటి, యొంటిగ నిన్నంటకు-వలుగంటి గన్గొంటినీసొగసు॥చా॥

చ ర ణ ము

అనుపమాన సౌధాంతరసీమల - నఖిల భోగభాగ్యమ్ము లందు నీ
వనదలం గట్టుకొని కాటిపువుల - నల్లాడగనేలా? యీలీల ॥జాలు॥

ఉ జూదరికై మె కళత్రమును ♦ సోదరుల న్నిజరాజ్య మెల్ల దా
యాదుల కోడి ఘోరంపిపి ♦ సాంతరభూములు సంచరించు ను
న్మాదుని గూడి గాసి పడు ♦ నంత యదాంతర మేమివచ్చె? భా
గ్యోదయ ముబ్బు రాణివగు ♦ మొంచూ దలంపకు నాడు ద్రోవదీ!

ఉ. మామకు నన్నుజెప్పి ప్రథ ♦ మంబున మాయదురోదరంబున
న్నీ మగ డోడినట్టి ధర ♦ నీవలయుం బఖలంబు సేన ను
న్మీమ్మ మగుడం ప్రియుంబలర ♦ మీకిడజేసితి, మీనిమిత్త మై
భామిని! నాడు నేపడిన ♦ పాటులు దైవ మెఱుంగు నన్నియున్.

క. నీ వెఱుగ వీ రహస్యము
దైవ మెఱుగు, దానికేమి? ♦ తడవేల ? యిదే
నా వెంట రమ్ము మనలిన
చో వీల్గాదేమొ మగలు ♦ జూతురు గావన్?

వ, అనిన బాంచాలి ప్రకంపితచిత్తయై రయుక్కీంత దొలగి నెమ్మనం
బున దనపతుల రాక గోరుచు గొంత కాలయాపనంబు సేయం
దలంచి వాని కిట్లనియె.

బిలహరి - రూపకము.

ప॥ తోడబుట్టు వగుదు నీకు - దుస్సల పెనిమిటివి గాన ॥తో॥
అ॥ప॥ పాడిదప్పి యీ తెన్నున - బలుకదగునె? నీకో యన్నా ॥తోడ॥

చ ర ణ ము

అరయగ ధర్మాధర్మము - లెఱిగిన వాడవుగదా నీ
వెఱిగియు నా హృదయము కో - భింప దలచితే యీగతి ॥తోడ॥

ఉ. ఒండు తలంపు వీడి వని ♦ నుండి ఫలంబులు వచ్చెదన్న యిం
దుండి కురంగమాంసముల ♦ నొప్పుగ భోజనముం బొనర్చి యా
పుండవుగాన వీడ్కొలుప ♦ బొమ్మ జయద్రథ! గౌరవమ్ముగా
పాండవసాయకాగ్ని శల ♦ భంబవుగాకు మకారణమ్ముగన్.

వ. అనవిని సైంధవుండును,

చ. వనితలపట్ల రాజులకు ♦ వావులతో బనిలేదు, కాముకుం
డనుగద! విందులేమిటికి ♦ నాకు దలోదరి! మోవిపానకం
బనువుగ నిచ్చి నన్ననుపు ♦ మావిధి జూదపుగొల్చువాడ నీ
వనటమొఱింగి యూరకొను ♦ నారలెకా? వెలిపింతు నీ గతిన్.

ఉ. రూపవతుల్ సతుల్ త్రిలుత ♦ లో ననురాగము గల్గి యింకము
లున్నపుడ రట్టి కూటమియె ♦ సొంపగు, జాగిక సేయబోకుమా
నీ పతు లడ్డగింతు రని ♦ నీ వొకవేళను శంకయింతువే
మో, పురవైరియు న్నిలువ ♦ నోపడు నాకెదురై తలోదరీ!

క. అని పల్కుచు వేగిరపడి
వనితామణి చీరచెఱగు ♦ బట్ట గడగి తో
డనె వెల్లకిలంబడ గో
పనయై సైంధవున కనియె ♦ బాంచాలి యిటుల్.

అఠాణా—ఆది

ప॥ వీరపత్నినై వీరమాతనై - వీరసహోదరినై వెలతున ॥వీర॥

అ॥ ప॥ చేరువయ్యెనొగికాలము నీకో - చెనటీ, యీనాటికిమున్మాటికి॥

చరణము

ఏది వీరుండవైన నిల్వుమీ - కింతసేపు పాపాత్మ! యూపతెద
నీదర్ప మెల్ల నేలగలియదా - నిన్ను నీవె వర్ణించుకొందువా ॥నీ॥

సీ. హిమవన్నగప్రాంత ♦ సముదఖండాలమ్ము
నెదురుట యా ధర్మ ♦ నృపు నెదురుట
గిరి గుహాంతర సుప్త ♦ హరి కేసరము లాగ
దదియుంట వాయువం ♦ దను దరియుట

క్రకచకరాళదం ♦ ష్ట్రాభీషణవ్యాఘ్ర
ముఖం గలియుట కిరి ♦ టిం గవియుట
దండతాడితసము ♦ ద్దండసర్పములపై
నుఱుకుట కవలపై ♦ నొగి నుఱుకుట

తే. గీ. నిరుపమవరాశ్రమాశ్రమా ♦ న్వితుల బొందు
తనయుల నెదిర్చి పఱచి పా ♦ తాళమందు
దాగినను నీకు మృత్యువు ♦ తప్పదింక
నొసటివ్రాత దప్పించుకో ♦ వశమె ? నీకు.

తే. గీ కర్కటియు వృశ్చికము దాను ♦ కాలమునను
చూలుదాలుచు గతి పొందు ♦ సుతుల కాలి
నైన నాడెన ద్రోహులుండ ♦ వైతి విదియు
కొనకు నీవు నశింపగా ♦ గుఱుతుగాదె ?

క. అని పల్కుచు ధౌమ్యుం బే
ర్కొని యాక్రోశించుచున్న ♦ కోమలి నరద
మ్మున నిడుకొని సైంధవుడుం
జనునెడ బాంచాలి యిట్లు ♦ సాగె మొఱలిడన్.

హిం॥ భైరవి—చతురశ్రగతి

ప॥ భరతలోక వీరాగ్రణులారా - పాండవేయు
లారా - నా ప్రాణనాథులారా ॥భర॥

అ॥ ప॥ దురితకర్మ సైంధవు బారినుండి - తొల
గింపరె నన్ను - దూషితగాత్రమున్ను ॥తొల॥

చరణము

చేటెఱుంగ కిటు సింహాగారము - జేరు వృకము వోలె మునయా
శ్రమ - మం దీతడు వ్రాలె - నేటితో వీని కాయువు సరియగు
నిముసమూలసింప - నేలారం - డీ నీచు వధింప ॥భర॥

చ. అని మొఱపెట్టుచో నచటి ♦ కల్లన ధౌమ్యుడు నేరి మందలిం
చిన వినకుంట వెంటబడె ♦ జెచ్చెర సైంధవుతోడ బాంధవం

దను లరుదెంచి యాశ్రితులును ♦ వారితోఁ బరిచారికాముఖ
మ్మున గలసర్వముం దెలిసి ♦ పోయి జయద్రథుఁ డేగు వంకకున్.

వ. ధౌమ్యుం గని నమస్కరించి యొక్కచో నిలిపి సైంధవసేనపయిం బడి సింహనాదంబులు సేయునెడ సింధుపతి ద్రోవదిం గని "వీరా నీమగలు? వీరిలో నెవ్వఁడెవ్వఁ డేవిధము వాఁడో చెప్పుమని" యెకసక్కెముగ బలుక బాంచాలి యిట్లనియె

సీ. బంగరుమైచాయ ♦ వాఁడు ధర్మసుతుండు
శరణాగతత్రాణ ♦ బిరుదు డతఁడు
దరనోష్ఠపీడనం ♦ బెసఁగు వాఁ డనిలజుం
డతని కోపాగ్ని న ♦ ల్లాఱ దెవుఁడు
ధనువు చేఁగొని వచ్చు ♦ ఘనుఁ డాతఁడే సవ్య
సాచి దుష్టుల గన్న ♦ సైప డతఁడు
రూపనిర్జిత పంచ ♦ రోపుండు నకులుండ
వ్వాఁడు సజ్జన బాంధ ♦ వ ప్రియుండు

తే. గీ. సేవనన్నిభుఁ డా సహ ♦ దేవుఁ డిప్పు
డెఱిఁగి యేమి? మొఱుఁగకున్న ♦ నేమి? వనధి
నుగ్ర మకరాహతిం బగు ♦ నోడవలె న
శింతు వీ వింక వీరిచే ♦ సేనతోడ.

మంజరులు

అని పల్కుచు నున్నంత బాండునం - దనులు సేనం దలపడి
వినిశిత బాణము లేయ గడంగిన - గినిసి సైంధవు డుఱవడి
బీరమున త్రిగర్త శిబి సింధు సౌ - వీర సైన్యపరివృతుడై
ఘోరాహవమున నిల్చె నెదిర్చె యు - కుంతితి దర్పోద్ధతుడై
తుముల మధికమయ్యె గీలాలపూ - రము మాంసపంకమగుచు
సమరాంగణ మెల్ల వాహినిం బలె - నమరె భయానక మగుచు
వెఱచి జయద్రథుడు ద్రోవదిని విగ - విడిచి రథము దోలుకొని
పఱచె నంత భీమార్జును లుడుగక - తఱిమి రాతని వెనుకొని

చ. వెనుకొనివచ్చు వారి గని ♦ వేగ జయద్రథుడున్ రథమ్ము డి
గ్గ నుఱికి గుల్మమధ్యమున ♦ గ్రన్నన దూఱుట గాంచి భీముడా
య్యన దలవట్టి యీడ్చి యెడ ♦ లంతయు బోటుల పిండికూడుగా
నొనరిచి ధర్మనందనుని ♦ యొద్దకు దెచ్చిన నాత డట్లనెన్.

ఆభోగి – రూపకము

ప॥ చెల్లెలి నెట్లంటదలం - చితి వోమానవపశువా ॥చె॥

అ॥ప॥ అల్లుడవై భరతాన్వయ - మగ్గిన గల్పితివ తులువ ॥చె॥

చరణము

నీదెస గరుణింపవలసె - మాదుస్సల మొగము జూచి
ఛీ! దురితమతీ, పాపము - నీకుడు నినుజూచు కొలది ॥చె॥

సీ. మాయలమారి కొం ♦ పలుమంచు సౌబలు
తోడబుట్టువు పెండ్లి ♦ యాడు టొకటి
యొరులయున్నతి జూచి ♦ యోరువం జాలని
కొడుకుల మాత్సర్యం ♦ బడయుటొకటి
విదురాదిసీతిక్తో ♦ విదులాడు పలుకు లె
వ్వట్టునం బెడచెవి ♦ బెట్టు టొకటి
పతిసమానునకు ని ♦ ర్భాగ్యునకు నీకు
గూతు నాలిగ నొసం ♦ గుటయు నొకటి

తే. గీ. కారణములయ్యె నీ నాల్గు ♦ గజపురీశు
డన్వయము మాపుకొన దన ♦ యంత దానె
తప్పదు స్వయం కృతాపరా ♦ ధముల ఫలము
లనుభవింప కెన్నటికేని ♦ యంధనృపతి.

వ. అని పల్కుచు దమ్ములం గని "చేజిక్కిన శత్రువు వధ్యుండు గాడు గావున వీని కెద్దియేని శిక్ష యూహింపు" డన సహదేవుండిట్లనియె.

క. తెగి తెగని క త్తితో జు
ట్టు గొఱిగి తుద కై దుకూళ ♦ ముల విడిచి విరూ

వుగ జేసి దారిబడి తి
న్నగ బొమ్మని పంపు డిదియె ♦ నా మత మన్నా!

వ. అన విని భీముం డట్లొనర్చి సైంధవుం గని.

మ. ఎవ్వరైన న్నిను నీ వెవండవన నీ ♦ వేమందు వీబూర బాం
డవదాసుండనటన్న బొమ్మనుచు నె ♦ ట్టన్, సింధుభూధవుం
డవమానంబు భరింపలేక నని పా ♦ దాంగుష్ఠ మాత్రంబుగా
భువిపై నిల్చి తపం బొనర్చె నొగి శం ♦ భుం గూర్చి ఘోరమ్ముగన్.

తే. గీ. హరుడు ప్రత్యక్షమై వర ♦ మడుగు మనగ
పాండువుల గెల్వ శక్తి గా ♦ వలయు నన, బొ
సంగదు జయుంతు వొకనాటి ♦ సంగరమున
చనుము విజయుని దక్క ద ♦ క్కున నలువుర.

వ. అని వరంబిచ్చి హరుం డంతర్హితుం డయ్యె నిట బాండవులు వన
బున పండ్రెండవ వత్సరమ్ము గడపుచో బాండవహితకారియై వాస
వుండు కర్ణుని కవచకుండలముల హరింప దలచియుండె నదియంతయు
సూర్యభగవానుండు రాధేయున కెఱింగించి బ్రాహ్మణ వేషమున
నీకడకువచ్చి యాచించు శక్రునకు నీకవచకుండలమ్ము లీయవలదని
బోధించి కర్ణుం డియ్యకొనకుండుటచే "వత్సా! వాసవునొద్దంగల
శక్తిబాణమ్ము నీవు గైకొను"మని చెప్పి చనెనంత నొక్కనాటి
మధ్యాహ్నసమయంబున గర్ణుండు సూర్యోపాస్తి సేయుచుండ
నింద్రుండు బ్రాహ్మణరూపంబున నని భిక్షాందేహి యని వేడిన
నంతసించి కర్ణుం డిట్లనియె.

శ్రీరాగము—ఖండగతి

ప॥ ఏమి సాభాగ్యమో - భూమిదేవాగ్రణీ ॥ఏమి॥
అ॥ ప॥ కామితము వేడుమా - కాదనా కేదేనినుడు ॥ఏమి॥

చరణము

పరమపావనులు భూ - సురులు భవమోచనులు
చరితార్థమయ్యె నా - జన్మ నీరాకచే ॥ఏమి॥

క. మణులో, విలసిత యువతీ
మణులో, వర వాహనములొ • మాన్యంబులొ, గో
గణమో, కోరుము మొసగెద
నణుమాత్రము సంశయింప • కవనీదేవా!

వ. అనిన విని కృతక భూసురుండును.

క. ఒండేమి వలదు కవచము
గుండలము లొసంగుమయ్య • గొని చనియెద దృ
ఢుండ నయి నీ యశము బ్ర
హ్మాండంబున దానశౌండు • డని నిండుకొనన్.

క. అన విని కానీనుం డనె
నసఘా! సురపతివి నీవ • టం చెఱుగుదు నై
న నొసంగెద నీకడ గల
ఘనశక్తిని నాకొసంగి • గైకొను వీనిన్.

వ. అని పల్కుచు కవచకుండలమ్ముల్ లొలిచి యిచ్చిన సంతసించి వాసవుండును కర్ణశరీరంబు సూర్య దీప్తిం జెలువొందున ట్లనుగ్రహించి, తన యమోఘశక్తి నొసంగి దీని నాపత్కాలంబున దుర్జయుం డగు నొక్క శత్రువుపై బ్రయోగింపు మతని వధించి నన్ను జేరుమని చెప్పి స్వర్లోకమ్మున కరిగె నది యెఱింగి కౌరవులు విచారించిరి. పాండుకుమారులు సంతసించి మఱల ద్వైతవనంబున కరిగి యుండ నొక్కనా డొక్క బ్రాహ్మణుని యరణి నొక మృగమ్ము కొమ్మునం దగిల్చుకొని పోయిన నద్ధరామరుం డది ధర్మజున కెఱింగింప దమ్ములం దోడుకొని చాపహస్తులై తన్మృగము న్వెన్నంటి వెంబడింప సోలి యొక్కచో నాహారిణం బదృశ్యంబైన విషాదమందుచు నతిశ్రాంతులై యొక్క వటవృక్షంబు నీడ విశ్రమించి యత్యంత పిపాసితులై జలంబులు దెమ్మని నకులు నంప, నతండును మునుముందట నొక తటాకముంగని యందలి జలంబులు త్రావబోవ నొక్క యశరీరవాక్యం బిట్లనియె.

మోహన—రూపకము

ప॥ ఆ సరోవరము నాయది - యందలి సలిలము గ్రోలకు ॥మా॥
అ॥ నా సంప్రశ్నములకు సరి - గా సమాధాన మిడువలె ॥కా॥

చరణము

బలిమిం జొచ్చిన వారలు - ప్రాణంబులు గోల్పోదురు
వల దీ సాహసము నీకు - వచ్చిన దారిం బొమ్మిక ॥యా॥

చ. అన విని యాదరింపకయె ♦ యా సలిలమ్ముల గ్రోలి తీర మం
దున బడెజేతసత్వమతి ♦ తోడనె ధర్మసుతుండు పిన్న త
మ్ముని ననుప నాతడమ్యోగతి ♦ బోయి సహోదరుజూచి గుందుచుం
బనివడి నీరుద్రావి ధర ♦ పై వొరిగెన్ సహజన్ముపోలికన్

ఆ. వె. మాద్రికొడుకు లిద్ద ♦ ఱు నలుంట గని సంత
సించి ధర్మసుతుడు ♦ విజయు ననుప
వాడు పోయి తొంటి ♦ వారి కరణి నీర్ద్రావి
పుడమి నొఱగె గవలు ♦ పడెనచోట.

క. కవలుం గవ్వడి మనలుట
బవమానతనూజు ననుప ♦ నా దరిగి చుహా
జవమున జలములగ్రోలియు
వివశుండై పడియె సాల ♦ వృక్షము వోలెన్.

క. తమ్ములు మనలుటకుం గత
మెమ్మియు గనలేక ధర్మ ♦ నృపుడుం జని తీ
రమ్మున బడియున్నం గని
బమ్మెరవడి నూచి కొంత ♦ వడి కిటు వగచెన్.

సావేరి—త్రిపుట

ప॥ కటకటా! నాతమ్ము లిటుబడ - గారణం బేమొకో తెలియదు ॥క॥
అ॥ కుటిలకర్మలుధార్తరాష్ట్రులు-ఘోరమేమేని సేయరుగద ॥కట॥

చరణము

తమ్ములేరి యని కుంతి యడుగ - దాని కేమి సమాధాన మిడుదు
ని మ్మహాటవి కేప్పనించిరి - నిట్లు చివరకు దమ్ముగుఱ్ఱల ॥కట॥

ఉ. వాడవు వీరిమోసములు ర • వంతయు, వైరులతోడ గూడి పో
రాడిన జాడ గానబడ • దక్షతము ల్సకలాంగకమ్ము, లీ
కిడొనగూడ నేడు వశి • కింపగ హేతువు దోచ దెంతయుం
జూడగ నీజలమ్ము వరి • శుద్ధముగాక విషాన్వితంబొకో!

వ. అని వగచి దప్పికోర్వక నీర్గ్రోవ యత్నింప నయ్యక్షశరీరభూతంబు బకరూపంబు ధరించితా నొకయక్షుండ నని పల్కుచు వారట్లు పడుటకుం గత మెఱింగించి తన ప్రశ్నంబుల కుత్తరంబు సెప్పుమన ధర్మజుం డొడంబడె నంత వారిరువురకునిట్లు ప్రశ్నోత్తరంబులు జరిగె.

సీ. నలినాప్తు నెయ్యది • నడపును? బ్రహ్మంబు,
రవి గ్రొల్చి తిరుగుదు • రెవరు? సురలు
తపను నస్తమయము నె • ద్దాన? ధర్మమున, భా
స్కరుడున్న దెయ్యది యాత? • సత్యనిరతి,
శ్రోత్రియుం డగు బుధు • డుండెట్లు? శ్రుతమున,
మెలగును మహిమను నే • మిటి? తపమున,
నతనికిని సాయమె • య్యది? ధృతి, నతడెట్లు
బుద్ధిమంతుండగు • బుధులసేవ,

తే. గీ. ద్విజున కమరత్వ మిదు నెద్ది? • వేదపఠన,
మతని నెది సాధువుం జేయు? • వ్రత నియమము,
నెతి నసాధువెట్లగును? ల • స్నియుతిలేక
మానుషుం డెట్లగు నకాల • మార్గ మెదలి.

సీ. ఎవడు జీవన్మృతుం? డిల • దేవ పితృభృత్య
కోటికిం బెట్టక • కుడుచు నతడు,
పృథివికన్నను భార • మెది? తల్లి, యాకస
మ్మునకన్న నెయ్యది • పొడవు? తండ్రి,
గాడ్పుకంటెను వడి • గలదెయ్యది? మనస్సు,
కడు దట్టమెది పూరి • కన్న? చింత,
కనుమూయకే నిద్ర • గను నెద్ది? మీను, జ
నించి ప్రాణము లేచి • దెద్ది? గ్రుడ్డు,

తే. గీ. హృదయరహిత మెయ్యది రూప ♦ మెనసి ? రాయి
వేగమున బొందు నెయ్యది ♦ వృద్ధి ? యేఱు,
తిరుగు నెల్లపు డెవ్వ డొం ♦ టరిగ ? నినుడు,
మాటిమాటి కెవ్వఁడు బుట్టు ? మఱునిమామ.

సీ. పథికున కాప్తు లె ♦ వ్వరు ! వర్తకులగుంపు,
గృహమేధి కెవ్వండు ♦ హితుడు ? భార్య,
రోగి కెవ్వాడు మి ♦ త్రుం డగు ? వెజ్జు, మి
త్రం బెద్ది మృతునకు ♦ ధర్మగుణము,
కుమరు ధర్మమ్మున కె ♦ య్యది ? దయ, కీర్తి కా
ధార మెయ్యది యగు ? ♦ దానగుణము,
సురలోకమున కెద్ది ♦ తెరువు ? సత్యంబు, క
ల్పించు సుఖం బెద్ది ? ♦ మంచినడత,

తే. గీ. మానవున కాత్మ యెవఁడు ? కు ♦ మారు, డతని
బ్రతుకుతెరు వెట్లు సెల్లు ? వ ♦ ర్జన్యు కతన
ననఘ ! యుత్తమధర్మ మె ♦ య్యది ? యహింస,
యుండు నెది పండి యెపుడును ? ♦ యోగ మదియు.

సీ. ఐశ్వర్య మెయ్యది ♦ యగును ? చచ్చిన వారి
గని తాము సుస్థిరు ♦ లని తలచుట,
వర్తించు పురుష శ ♦ బ్దం బెవ్వనికి ? కీర్తి
పైని ముట్టి భువిని ని ♦ డిన యతనికి
ముదమంద మానవుం ♦ డెది వీడి యగును స
ర్వజన ప్రియుండు ? గ ♦ ర్వంబు వీడి
తగు నెవ్వనిన్ సర్వ ♦ ధనియన ? సుఖదుఃఖ
ములపట్ల సమబుద్ధి ♦ గలుగువాని

తే. గీ. జగతి కెయ్యది దిక్కు ? స ♦ జ్జనులు సూవె
యంబు నెవ్వెడ నుదయించు ? ♦ నాకసమున
నన్న మెవ్వెడ నుదయించు ? ♦ నవనియందు
విషమనందగు నెయ్యది ? ♦ విప్రధనము.

వ. అని చెప్పినవిని సంతసించి యక్షుండు ధర్మజుంగని.

కేదారి - ఖండగతి

ప॥ భళి, భళీ, రాజేంద్ర - భవ్యగుణ గుణసాంద్ర ॥భ॥
అ॥ ప॥ లలి నీసమాధాన - ములు మెచ్చు వచ్చె మే ॥ల్భళి॥

చ ర ణ ము

చచ్చిపడియున్న నీ - సహజన్ములం దొకని
సచ్చరిత ! బ్రతికించి - యిచ్చెద స్వేదుమా ॥భళి॥

తే. గీ. అనిన విని ధర్మసంభవుం ♦ డట్టులైన
నకులు బ్రతికింపు మని వేడె ♦ నం గరంబు
సంతసిలి యక్షు డనె, బల ♦ శాలు రైన
భీమపార్థులవిడి వీని ♦ వేడ నేల ?

వ. అన విని ధర్మజుండును.

ఉ. ఆనతవైరి పాండువిభు ♦ డాతని కిద్ధరు భార్య, లందు కుం
తీసతినాత్మ, కాన్పునకు ♦ నే మ ముంటిని పెద్దవాడ ని
ట్లే నకులుండు గూడ దగ ♦ డే మనియుండగ మాద్రికన్న సం
తానమునందు ? ధర్మమును ♦ దప్పదు నామన మెన్నడేనియున్.

చ. అన విని యక్షుడిట్లనె జ ♦ నాధిప ! నీదగు ధర్మబుద్ధికిన్
ఘనతర మోదమందితిని ♦ సలుద్వరు తమ్ములు ♦ బ్రజీవులై
మనుదురు, మిమ్మెఱుంగరు జ ♦ మా ! పదుమూడగు నేట నేడనుం
డిన నెవరున్ వరం బిడితి, ♦ నే యముడ న్నిను జూడవచ్చితిన్.

వ. అని పల్కుచు హరిణావహృతం బగు నరణి నొసంగి యంతర్ధానుం డయ్యె నంతలో సజీవులై నిద్రనుండి మేల్కనినట్లు భీమార్జున నకులసహదేవులు లేచినం గని ధర్మజుండు సంతసించి సోదర సహితుండై చని బ్రాహ్మణున కరణినొసంగి పరమేశ్వరకటాక్షమ్మున గష్టసముద్రమ్మం గడచి గట్టెక్కి యరణ్యావాసదీక్షం బూర్తి గావించి యజ్ఞాతవాసంబు సలుప యత్నించుచు వెంటనున్న ధౌమ్యాది భూసురోత్తముల వీడ్కొల్పి ముందునకుం జనుచు సుఖమ్మున నుండె.

శ్రీ

# మహాభారతము

## కీచకవధ

పూర్వకల్యాణి—ఆది

ప॥ కీచకవధా కథావిధాన మితి - గీంతు నేను వినుము ముదంబున ॥కీ॥

అ॥ ప॥ ఆ చపలుడు పాంచాలిఁ గాంచి యనుచితమ్మనమేతముగా నశించె ॥కీ॥

చరణము

పాండవేయు లజ్ఞాతమొనర్పఁగ - బయనమై, విరాటపురమునకు
చండాయుధముల నన్నింటిని నొక్క - శమీవృక్షమున వ్రేలంగట్టిరి ॥కీ॥

తే. గీ. నరుఁడును ధర్మనందను ♦ నకులు దక్క
నొరులకు భయంకరముగ మ ♦ హోరగముల
యట్టు లగుపట్టి నవ్వీమ ♦ మాబ్దములను
యమతనూజుండు శాసించె ♦ నాయుధముల.

వ. అంత ద్రౌపదీసహితమ్ముగ బాండవులు మత్స్యదేశమ్ము సొచ్చి యయ్యెడఁ బ్రవర్తింపదగిన విధానమ్ము నాలోచించుకొని విరటు పురంబు బ్రవేశించి విరాటుకడ సేవావర్తనంబున మెలంగదలంచి.

సీ. యతివేషమున కంకు ♦ డను పేర ధర్మభూ
విభుఁడు విరాటు సే ♦ వింప దొడఁగె
వలలనామమున బా ♦ వని సూపకారుఁడై
కుదిరె మత్స్యాధీశు ♦ కొలువునేయ
నలరె బృహన్నలా ♦ ఖ్యం గిరీటి పేడియై
యచ్చటి కన్నియలకు ♦ నాటగఱప

తనరె దామగ్రంథి ♦ యన నకులుండు భూ
నాథు తురంగశా ♦ లాధిపతిగ

తే. గీ. నాలకాఁ రిగానుండె ♦ నచట మాద్రి
చిన్నకొడుకు తంత్రీపాలు ♦ డన్న పేర
రాణికడ మాలినియనం జె ♦ లంగె కృష్ణ
యొరులెఱుగకుండ నమవర్తి ♦ వరబలమున.

సీ. సర్వసర్వంసహా ♦ చక్రరత్నము సే
యందగు తేను న ♦ న్యాసియయ్యె
కరఘాతమున మేరు ♦ గిరినే పటుముసేయ
గల దోర్బలుఁడు నూప ♦ కారుడయ్యె
శీతాంశువంశాళి గె ♦ ల్పసజోదు బుగ్గపై
వ్రేలిడుకొని యాడు ♦ పేడియయ్యె
మహనీయ శతకోటి ♦ మదన సౌందర్య వి
గ్రహులు డబ్లు గుఱ్ఱాల ♦ రాయ డయ్యె

తే. గీ. తలకి కలసేని శీలముం ♦ దప్పబోని
పుణ్యవర్తను డటు ♦ గొల్లబోయడయ్యె
వాసిగాంచిన దొరసాని ♦ దాసి యయ్యె
గటగటా! యేమనగ వచ్చు ♦ కాలమహిమ!

క. పాండుకుమారులు విరటుని
దండ నుచితవృత్తి మెలగు ♦ తరినొకనాడు
ద్దండ బలశాలి యగు మ
ల్లుం డొక డరుదెంచి భూప ♦ రుం గని పలికెన్.

కన్నడ—జంపె

ప॥ మల్లయుద్ధమున నను - మార్కొని జయింపగల
మగవాడు లేడెంచున - యీభూమండలమున ॥మ॥

అ॥ ప॥ కల్లగా దెందటినో - మల్లుల జయించి నే
గైకొంటి బిరుదు లె - న్నొ భూవల్లభా ॥మ॥

చరణము

నీకొలువునందు న - న్నెదురగలవా డున్న
నిలువు మీక్షణమునందు - నిర్మూల మొనర్తు ద ॥నీ॥
లేకున్న జయపత్ర - మిచ్చి నన్పంపు మా
లేరు లేరంచు ము - మ్మారు వాకొని వేగ ॥మల్ల॥

క. అని పల్కు వాని యాకృతి
ఘనతరవక్షమ్ము, మేని • కండల బిగువుం
గని నివ్వెఱపడు తేనిం
గనుగొని ధైర్యమున నిల్పు • కంకుం డపుడున్.

చ. కలడుగదా నృపా! విదిత • కాయుడు మీకడ బానసీడుగా
వలలుడు, వాడు వీనిగెలు • వంగల, డాతని బాహుబలమ్మునే
తెలిసితి ధర్మసూనుకడ • దెల్లముగా నొకనాడు, కావునం
బిలువగ బంపుమా బలియు • వేగ జయింపగలాడు మల్లునిన్.

వ. అనిన విని భూపతి వానిం బిలువనంప వలలుండును సనుదెంచి రాజాజ్ఞం గొని మల్లున కెదురై నిలిచి భుజాస్ఫాలనం బొనర్చి కలియంబడి యొక్కింత బోరాడి కడకు గాసిం బట్టి కాల్సేతులు బ్రేలంబడునట్లు ముష్టిబలంబున నెత్తివైన నార్చుచు మొక్కున నెత్తు రొలుక నేలంబడి యుమ్మల్లుండును డిల్లపడి చరణాక్రాంతుడై బీరమ్ము సెడి రాజసభనుండి తొలంగి చనియె. విరాటుండును వలలుని బలంబునకు మెచ్చి యనుగ్రహించుచు నిజనివాసంబునకుం జనియె. పాండునందను లట్లు కొన్నిదినంబులు గొలుతిగా వత్సర కాలంబు గడవునంత నొక్కనాడు రాజశ్యాలకుండగు కీచకుండు తన యక్క సుధేష్ణకు మ్రొక్కం జనుదెంచి, నిదురించు నావెను సమీపమ్మున నున్న ద్రౌపదిం గని మోహావశుండై.

మోహన—రూపకము

ప॥ కలరే లోకమున నిట్టి - చెలువము గల భామాభోటులు ॥క॥
అ॥ ప॥ వలపుల వర్షించెడి యీ - కులుకులాడి యెవ్వతెయో ॥కల॥

చారు జలధరాచ్ఛాదిత - చంద్రరేఖవై ఖరి నీ
నారీమణి కడు మాసిన - చీర గట్ట హేతువేమొ

సీ. కనుగీటి చూచెనా! ♦ కాముడే యగు గాక
మతిమాలి తా బ్రతి ♦ మాలకున్న?
చిఱునవ్వు నవ్వెనా! ♦ కరిముఖుండే గాక
యిక బెండ్లికై తత్త ♦ రింపకున్న?
చెఱగు దాకించెనా! ♦ పరమహంసయె గాని
యంగలార్చుచు శివా ♦ లాడకున్న?
పలిచి మాటాడెనా! ♦ నలువయైనను సరే
సృష్టి యేమటి చిందు ♦ లేయకున్న?

తే. గీ. తలిరు విల్కాని వాడి పూ ♦ ములుకులైదు
ముద్దగా జేసి కరగించి ♦ పోతబోసి
యమృతముం జిల్కి స్త్రీరూప ♦ మమరజేసె
గానిచో నిట్టి యువతి జ ♦ గాన గలదె

క. అని మెచ్చి నెమ్మనంబున
మనసిజ రాగమున నొకట ♦ మైమఱచుచు మె
ల్లన నయ్యుగ్మలి కడకుం
జని యభిమత మెఱుకపఱుప ♦ సైరంధ్రి యనెన్

క. సిరులెల్ల దఱుగు, గలుగును
పరిభవ, మాయువు న ♦ శించు, వైరము లెసగున్,
నరకావాసము జేకుఱు
బరకాంతల గవయుటన్న ♦ పాపముగాదే?

తే. గీ. తలవిరియబోసి శివశక్తి ♦ వలె నగుపడి
చలువ మెడబాసి మాసిన ♦ వలువగట్టి
దాసి నగు నన్ను బ్రేమింప ♦ దగునె నీకు?
వ్రతము కొడ్డను ఫలమైన ♦ బడయవలదె?

వ. అనవిని సింహబలుం డనును,

తే. గీ పరసతీసంగమమున సం ♦ ప్రాప్తమైన
పాపమున కోరుకొను గాని ♦ వచ్చి చెలుతు
వాడితూపులతాకు నో ♦ర్వంగజాల
ననుచు దరికోన సైరంధ్రి ♦ యూని నదల్చె.

బిలహరి — త్రిపుటతి

ప॥ ననుముట్టకు పతివ్రతను - చెనటి! దూరముగ నుండుము ॥నను॥
అ॥ ప॥ అనఘుడవై మనరా నీ - కామబుద్ధులు లేరా ॥నను॥

చరణము

అందని పెన్మ్రమాకుల పం - డ్లాశించిన లాభమేమి
ప్రమందరొ పరసతుల గోరి - రావణాదు లెంద రెందరో ॥నను॥

ను. అతులారాతిమదద్విప ప్రకర హ ♦ ర్యక్షప్రభావోగ్రమా
ప్రతిమానూననము జ్వాలామలయశః ♦ ప్రాకట్య న చ్చంద్రికా
తతసంపూరిత దిగ్దిగంతరులు గం ♦ ధర్వు లున్నామా మత్పతు
ల్నతలోకత్రయు లేవురుం గినియు మా ♦ న ప్రాణము ల్దక్కునే?

క. అని పల్కి చివాలున నే
గిన నేయునదేమిలేక ♦ కీచకు డట మే
ల్కానియున్న యక్క చెంతకు
జని సుమశరతాప మోర్వ ♦ జాలక పలికెన్.

ధన్యాసి - రూపకము

ప॥ అక్కా! యాచిన్నది యెవ - రక్క అదీర్ఘకేశియె ॥నక్కా॥
అ॥ ప॥ చక్కదనాల్కాని నిశిత - శరములవాల్జేసి చనియె ॥నక్కా॥

తే. గీ. ఎంత జెప్పిన వినవు ర • వంత యేని
నీకు దప్పదు చావు కా • నిమ్ము నేఁడు
మధురసమ్ము దెమ్మంచు నీ • మందిరమున
కంపుదును దాని దీర్పఁగ • మ్మభిమతమ్ము.

వ. అనిన విని కీచకుండు సంతసించి నిజసదనంబునకుం జని నానావిధ మధురసంబు లొనరించి తానున్న ప్రదేశంబును విజనంబు గావించి పాంచాలి రాక కెదురుసూచుచు విరహాతాపంబున జిత్తం బుత్తల పడ నేమియుం దోఁచక కాముం దిట్టుచు, సోముం దెగడుచు, మలయానిలు నిరసించుచు బడలాడి వేదనం బొరలుచు, నడుమనడుమ జీమచిటుక్కుమన్న సైరంధ్రి వచ్చెనని భ్రమించుచు బహువిధ ప్రలాపంబులం బ్రొద్దుపుచ్చుచున్నంత సుధేష్ణా ప్రేరితయై కట్టకడకు రాక తప్పనిదయి యొక్క కాంచన చషకంబుం బుచ్చుకొని, కనుదమ్ముల నశ్రువులు వెల్లిగొల్ప, విపన్నివారణమ్మగు హరిస్మరణం బొనర్చుచు, భగవత్కటాక్షమున దన్నంగాన సదృశ్యాకారుండై యొక్క రక్కసుండు వెన్నంటిరా, జని చని బెబ్బులియున్న పొదం జొచ్చు లేడి చందంబున ద్రోవది సింహబలు మందిరంబు సొచ్చి నిజాగమన కారణం బెఱింగించి మదిర వోయింపుమన నాతం డప్పలుకు సెవిసెవిం బెట్టక బలాత్కారమ్మున వయింబడి తన్నంట యత్నించుచుండ, దగ్గఱ వచ్చిన దనుజసహాయమ్మున విదల్చి యాజ్ఞసేని విరాటుని కొలువుకూటమ్ముపంకకు బరువిడుచున్నంత, కీచకుండును బిడాలంబు బాలశారికపై బడుపడువున పాంచాలిపై బడి తల నొడిసిపట్టి తన్నె నినీ రక్షకుండైన రాక్షసునిచే వ్రాల్ల ద్రోయబడి యొకంతకు లేచి విస్మయపడి కోపంబు గదుర సత్కాంత స్వెన్నంటి కొలువుకూటమ్ము వంకకు వచ్చుచున్నంత నయ్యది సూచి పవనతనయుం డంతకాకారుండై కోపాటోపమ్మున నాచేరువనున్న యొక్క యున్నంత వృక్షమ్మును డాసి ధర్మజు దెసం జూచుచున్నంత యుధిష్ఠిరుండును కనుసన్న నివారించి యిట్లనియె.

మ. వల దా వేసిరపాటు తీయానను మే ♦ బ్బండ్లిచ్చి శాఖోప శా
ఖల నల్దిక్కుల విస్తరించి ఘనమా ♦ ర్గక్రాంతి జేకూర్చుబాం
ధులకావృతము; వంటకట్టియల కెం ♦ దు న్వ్యాజము ల్లేవొకో?
వలలా! నీబల మా కజమ్ముపయి జూ ♦ పంబాడిగా దాగుమా!

క. అని పల్క ధర్మనందను
డనిలజుకోపమ్ము సెజికెం ♦ నాలోనను కొ
ల్వున కేగుదెంచి ద్రోవది
జనవిభుం బతులు గనగ ♦ జయ్యన బలికెన్.

కావేరి — ఆది

ప॥ కంటిరే సభికులార నన్ను వెన్నంటివచ్చుతుంటరి నీకీచకు ॥౫౦॥
అ॥ప॥ కొంటెతనముమూన్పకికరణి మీావ టివార లూరకుంటధర్మమె!

చరణము

నానావిధశాస్త్రవిదులు గం - ధర్వులేవురున్నారు నామగలు
కానరెరి నాడకు తమకు-గానియటు లూరకున్నారిందఱు ॥౫౦॥

ఉ. పాయక ధర్మభంగమును ♦ పట్టున సక్రమబుద్ధి గల్గు భూ
నాయకు లెంచు దండనము ♦ నం గలుషాత్ముల నొంచుటల్ నృప
న్యాయపథంబు; కీచకు డు ♦ రాగిత కిట్లొయ్యెడ మాన్పకున్నచో
నాయువురంటుదా మనుజ ♦ నాథునకుం బ్రబలశానగ్ని తుల్యమై?

వ. అన విని పేరాటువాడు కటకటం బడి, కీచకు మంచిమాటల ననున
యించి యంపె నయ్యెడ ధర్మజుండు రోషించి ద్రోవదిం గని.

ఉ. ఈసభ వారు నీదు తెఱ ♦ గెల్ల నెఱింగిరి చేరుమా సుధే
ష్ణాసదనంబు, నీమగలు ♦ చాలకగా దిట గోపగింప రెం
తేనయయుంబుగా కునికి, ♦ యేటికిదూఱెద వాత్మనాథులన్?
దానతి బన్నముం బడు క ♦ తమ్ముగ నాథుని ధిక్కరించునే?

తే. గీ. రాజసభలందు తడవు ని ♦ ల్వగునే? కు
లాంగనకు నిన్నువోలె, నా ♦ ట్యమ్ము నూవు
పొలుపునం బలుపోకల ♦ బోవనేల?
యాలసింపక పొమ్ము మ ♦ ర్యాదగాదు.

వ. అన విని పాంచాలి రోషించి.

ఉ. సట్టువకాదు నామగడు ♦ సట్టువురాలను నేను నాపతిం
బట్టెదె కంకుభట్టు! యెటు ♦ వచ్చెను వేఱొక విద్య క్రొత్తగా
బుట్టి నటుండెగాదు కిత ♦ వుండును నామగ డట్టి జూదరిం
గట్టుక లేసిగౌరవము ♦ గావలె నన్నను నేడు వచ్చునే?

వ. అని పల్కి యచ్చోటు వాసి సుధేష్ణామందిరమ్మున కేగి నాటి
రేయి మహానసగృహంబున నిద్రవోవు భీమసేనుకడకు జని మేల్కొ
లిపి కీచకు దురాగతం బెల్ల కడముట్ట నెఱింగించి,

భూపాల—ఖండగతి

ప॥ కన్నార నాపడిన - బన్నమును గాంచి యీ
తెన్నున న్నిదురించు - చున్నాడవా నాథ ॥క॥

అ॥ప॥ న న్నొమువార లు - న్నారె మీరలు గాక
నాయెడ న్దయమాలి - నాయము చరియింప ॥క॥

చరణము

అరయ నాజన్మ న - త్కత్ర మేమో గాని
పరిభవములే గంటి - నే నాటికానాడె
దరిగొన్న రోసమున - ధర్మజుం డెత ను
నిరసించినా నట్లు - నిర్భాగ్యురాలనై ॥కన్నా॥

సీ. నృపతి కోటీర మ ♦ ణీఘృణినేష్టితాం
ఘ్రితలుండు ధర్మజో ♦ ర్వీవిభుండు
పెడ గూడు జీరయు ♦ నిడి తన్ను పోషింప
నొదిగి యొక్కనిపంచ ♦ నుంచవలసె
నీరేడులోకమ్ము ♦ లెత్తివచ్చిన బయిం
పగజాలు శౌర్య నం ♦ పన్నులైన
నీవు నీతమ్ములు ♦ నేటికి నీ చంపు
[illegible] వృత్తుల తోడ జీ ♦ వింపవలసె

తే. గీ. గుండె నీరగు మిము జూచు ♦ కొలది నాకు,
రాణికిం జందనము మేన ♦ రాచి రాచి

సలుగు పెట్టుట నట్లు ము ♦ స్వరలునాదు
కరతలమ్ములు కాయులు ♦ గాచె జూడు.

ఉ. పుట్టము లొల్చువట్టునను ♦ పో దగు ప్రాణము సింధురాజుచే
నట్టుల బన్నమందుటకు ♦ నై నిలిచెన్, మఱియంత బోవ కీ
చట్టకు గీచకాధముని ♦ చే నవమానమునంద నిల్చె నా
యట్టి యభాగ్యదేవతకు ♦ నక్కట! మృత్యువుగూడ వచ్చునే?

తే. గీ. అనుచు నశ్రుజలమ్మున ♦ మునిగియున్న
చెలియమోము పటమ్మున ♦ జేర్చి హృదయ
మలమటం బొంద వనిత నూ ♦ ఱార్చి కొంత
వడికి గోపమ్ము గదుర నా ♦ వడను డి యనె

రాగు—ఆది

ప॥ నేవధింతు గామాంధు సింహాబలు - నీరజాక్షి నీవ్రాలిడిల్లుమా ॥నే॥
అ॥ ప॥ భూవరుం డడ్డమైన - భయమ్మునబోయి పాతాళమందుడాగినను॥

చరణము

సమయభంగమగు నంచు ధర్మజూషు
జన దియ్యాది యుని నను వారించిన
రమణి నీకు కరుణి చి యొ వేళ
తమియింపు మనుచు వాకొనిన గాని ॥నే॥

ఉ. వానికి నీవొడ బడిన ♦ వైభరిగా సటియించి నేర్పున
న్మానక రేయి రమ్మనుము ♦ నర్తనశాలకు; నిన్నువోలె యం
దేను వసుండియుందు, జను ♦ దెంచు నతండును, లిప్తలో గత
ప్రాణునొనర్తు గీచకు న ♦ భంగుర బాహుబలమ్ము పెంపునన్.

క. అని పల్కిన విని ద్రోపది
చని నిద్దురవోయి వేగు ♦ జామునసే మే
ల్కని సముచిత రీతిం దన
పను లొనరుచుచుండ సింహా ♦ బలు డమ్మోదకున్.

సీ. చనుదెంచి దుర్వ్యాలా ♦ పంబులు సేయుచో
బాంచాలియును మొత్త ♦ బడినయట్లు

తే. గీ. నాకు ముదమేమిగలను సి ♦ గ్గలియున్న
తగినజోడు నా కీనాడె ♦ తారసిల్లె
నిన్ను పిల్గానికి క్షమింపు ♦ నేను దీర్తు
నాకోరికింతయుగూడ నో ♦ యుండగాడ !

తే. గీ. అని చివాలున లేచి సిం ♦ హబలుఁ డట్టి
వండెటంబట్టి యెత్తి రో ♦ షమున భూమి
తలమునం బడవేయ గం ♦ ధర్వుఁ డనుచు
లేచి భీము నెదుర్కొనె ♦ కీచకుండు.

తే. గీ. త న్నెరుంగ జూతు రేమో య ♦ టన్న భయము
సింహబలున, కజ్ఞాతమున్మ ♦ చెడునటన్న
జంకు వడముండికిం గల్గి ♦ చప్పుడించు
కేనియును సేయక యె బ్రహ్మా ♦ రించుకొనెను.

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు పోరాడి కడకు భీమసేనుండు కీచకుం గూల్చి తన్ను మెచ్చుచున్న ద్రోవదిం దడవుసేయక పొమ్మని పలికి తాను మహానస మందిరమ్మున కరిగె నిమ్మెడ పాంచాలియు నాట్యశాల వెలువడి తన పతులగు గంధర్వులచే సింహబలుండు మృతినొందెనని కావలివారలకుం జెప్పిన వారును కీచకానుజన్ము లగు నుపకీచకుల కయ్యది యెఱింగింప నుపకీచకు లెల్లరు బల వింపుచుం జనుదెంచి బిట్టువగచి సైరంధ్రికారణమున నీతని కీచావు వచ్చెనని కోపించి ద్రోవదిం బెడగేలువట్టి యగ్రజుశవం బుతో నంట గట్టి పితృవనమ్ము దెసకుం జనుచుండ యాజ్ఞసేనియు నతిరావమ్ముగా నాక్రందనమ్మొనర్చుచో నయ్యెలుంగు విని భీమ సేనుండు దోషసంభ్రముండై పరువునం బోయి యున్నతంబగు నొక వృక్షముం బెల్లగించి వారిపయిం బడి యుపకీచకుల మాట మాట యేపుర నుక్కడంచి పాంచాలీ బంధమోక్షణమ్ముగావించి యవ్వేలందిని సుధేష్ణామందిరమ్మున కనిపి తాను మహానసగృహ మ్మున కరిగె.

శ్రీ

# మహాభారతము

## గోగ్రహణము

హరికాంభోజి—ఆది

ప॥ ఘనగోగ్రహణకథావిశేషమును - వినుపించెదవినుడీ సభాసదులార॥

అ॥ ప॥ వినుతయశుడు గాండీవి భీష్మాది వీరవరులనెల్లరనోడించిన ॥ఘన॥

చరణము

కీచకుడొకగంధర్వునిచే రోషాన గూలెనన్న - వార్త వినిసుయోధనుడు

యోచించి పాండవేయు లావిటనున్నారని - సమకట్టె గుర్తింప ॥ఘన॥

సీ. కౌరవాగ్రజుడు త్రి • గర్తేశుని సుశర్మ
యనువాని విరటు గో • గణముబట్ట
నియమింప ఘనవాహి • నీ సమన్వితముగా
నరిగి దక్షిణగోగ్ర • హణ మొనర్ప
మత్స్యభూజాని ధ • ర్మజముఖ్యుల సహాయ
మున త్రిగర్తేశు నో • డ్చ్యాన జయించె
మఱునాడు నిజయోధ • వరులతో వెడలి కౌ
రవు లుత్తరమున ధే • నువులబట్ట

తే. గీ. నచటి గోపాలకులు పురి • కరుగుదెంచి
రాజపుత్రున కెఱిగింప • రాజసమున
సమరకౌతుకి మీసా[illegible] • సతులచెలి
రిత్తబీరమ్ము నూపుచు • నుత్తరుండు.

[illegible]—రూపకము

ప॥ సమయమబ్బినందుకు తగు సారథి లేడాయె నాకు ॥సమ॥

అ॥ ప॥ సమరమున నిలిచి కౌరవ - సైన్యమెల్ల రూపుమాప ॥సమ॥

1. జంకుదు రా మమ్మార్వురలు - సైతము నాపేరు విన్న
టంకారమ్మాలించిన - తావుల్దప్పి చరింపరె ॥న॥
2. సరిగా నాసామర్థ్యము - శాంతనవాదు లెఱుంగరో?
పురమున లేనటుకో! రో - సురనున నేమని తలచిరో ॥న॥

తే. గీ. అనిన వినిచెంతనేయున్న ♦ యాజ్ఞసేని
"నడుపజాలును మన బృహ ♦ న్నల యరదము
పనిగలిగెగాన నతని దో ♦ డ్కొని చను" మన
నృపతనూభవు డిట్లనె ♦ సేవగించి

చ. సరిసరి! పేడినా? గొనుట ♦ సారథిగా గతిలేక, ఏంటివ
ట్టెఱుగదు నుంతయేని యత ♦ డెన్నడు వీణియ పట్టికాని, యీ
గురుతరనాట్యశాల యను ♦ కొంటివొ? నగరభూమియన్న, న
ల్వురు నను గేలిసేయుకొకో ♦ లోకులు చుల్కనజూచి, మాలినీ!

క. అన విని ద్రోవది, క్రీడికి
మును ఖాండవదహనసమయ ♦ మున సారథ్య
మ్మొనరించె నత డెనుచు నొ
య్యన దెచ్చిన నుత్తరుడు బృ ♦ హన్నల కనియెన్.

చ. పవరము గల్గె నాకు బల ♦ వత్తరమై కురుసేనతోడ నీ
యువతి వచించె సారథిగ ♦ నొయ్యన సన్గొని పొమ్మటంచు, ఖాం
డవదహనమ్మువట్టున ధ ♦ నంజయు సారథివై తివంట నీ
వవసరమయ్యెజూచి ముద ♦ మందగ నీరథచోదకత్వమున్.

వ. అని విని కిరీటి వైరాటి కిట్లనెను

తే. గీ. ఖాండవ మ్మగ్నిసన్ప్రాను ♦ కివ్వడిక ం
ధమ్మునడపిన మాట వా స్తవమెగాని
నీరథము దోలుచున్న నం ♦ దియము దోచె
నైన నవత్తు దప్పని సరి ♦ యయ్యెగాన.

మంజరి

అని పల్కుచు భూమింజయునకు దే రాయితమ్ము గావింప
జనపాలకనందనుడు రథమెక్కె - దను చేడియ లగ్గింప

కురువీరుల జెండని వ - ల్కినబొమ్మపా త్రికలకు
గరితలెల్ల, నల్లే యని చని యు - త్తరుడు క్రీడితో బలుకు
ఆ కురుసేనం గని పాఱిపోకు - మూ! వెఱచి మధ్యలోన
నీకు వచ్చిన భయమ్ము లేదు పై - నేనున్నాను నరేన
యని పల్కుచు జనిచని కౌరవ సై - న్యంబెల్ల దేఱిపాఱ
గనుగొని వై రాటి కిరీటి కనియె - దనదు మేను గరుపాఱ.

మ. నరిలే! కౌరవసేన యన్న నిదిసూ! ♦ చాల్జాలు నీపాటి కీ
యురదమ్మున్ మరలింపు! మీనరికి సై ♦ న్యప్రాంతముం జేరుచే
పౌరపాటయ్యె దలంప బ్రాణములు తీ ♦ పుల్గావె? వేయేల నీ
తరమా, నాతరమా, కృపాదినిఖిలా ♦ ప్తప్రజ్ఞానవళిం గెల్వగన్.

వ. అని పల్క భూమింజయునకు ధనంజయుం డిట్లనియె.

చ. కురుబలము న్జయింతునని ♦ కోతలు గోసితి విఁటిరొయిద్ధ నం
గర మొనరింపకే రిపుల ♦ గన్గొని భీతిలనేల నవ్వరే
గరితలుసైత మిట్టి నిను ♦ గాంచినచో, పనుల న్మరల్పకే
పురమున కేమొగమ్మునను ♦ పోయెదవోయి నృపాలనందనా!

తే. గీ. ఇట్లు పల్కుచు తేరు వో ♦ నిచ్చుచుండ
నీపనులు పాడుగాను పో ♦ నిమ్మనుచు ర
థమ్ముపైనుండి యుఱికి ప ♦ త్తనముదెసకు
బాఱిపోదొడగెం బిక్క ♦ బలము కొలది.

వ. అట్లు పాఱిపోవుచున్న యుత్తరుం గని నిజయుడు పగ్గంబులు నొగల ముఁడిచి రథం బుఱికి వెన్నంటి పదశతమాత్రప్రదేశమ్మున నిలువరించి రాజపుత్రుతు బట్టుకొని "నీవు సారథివై రథమ్ము నడుపుము, నేనా కౌరవులంగెల్తు" నన సముత్తరుండును.

కేదారగౌళ — జంపె

ప॥ నిను సారథిం జేసి - కొని వచ్చినందులకె
నే ఖేదపడుచు ని - న్నే...రథికునిగా జేతున్ ॥నిను॥

అ॥ ప॥ కొనకు నినునమ్మికొని కురుసేనకెదురుదును
కుక్కతోకను బట్టి గోదావరీనిసటు ॥నిను॥

చరణము

సారథినిజంపితే - చంపుదురు రథికునట
సమరధర్మ మెఱుంగవో - నీవో బృహన్నలా ||సా||
పోరాడుమా నీవు - పోయి శత్రువులతో
చేరువయ్యె న్నీకు - చేటుకాలము నేడు ||నిను||

మ. అరులం గెల్చుటయున్నచో నభినయం ♦ బా? నాట్యమా? గానమా?
దురమన్న న్వెనుదీయుచుందు వొకచో ♦ దుర్వార తేజోబల
స్ఫురణమ్ముల్గల మేము; క్లీబుడవు నీ ♦ వుర్విన్ మాటలేగాని పో
టరివెట్లౌదువు? రమ్మింక బెనగులా ♦ డం జెల్లునే ప్రజ్ఞకై?

వ. అని పల్కు నుత్తరు బలాత్కారమ్మున రథం బెక్కించి నిశస్త్రా యుధంబైన జమ్మికడకునేగి ధైర్యమ్మొసంగుచు నావృక్షమ్ముపై రాజపుత్రు నెక్కించి యాయుధబంధం బందుకొని గాండీవముం బుచ్చుకొని యెప్పటియట్ల నాయుధబంధ మందు బెట్టింప నుత్తరుం డట్లొనర్చి వృక్షమ్ము దిగివచ్చి యయ్యవి పాండవుల యాయుధమ్ము లని బృహన్నలచే నెఱిగి మహాత్మా! పాండవులిప్పు డెందుండిరని యడుగ నర్జునుం డిట్లనియె.

సీ. ధర్మాత్ముడైన నీ ♦ తండ్రికి మిత్రన
త్తముడైన కంకుడే ♦ ధర్మసుతుడు
వలలనామమున మీ ♦ బానసీడా కీచ
కుని గూల్చె నతడె వృ ♦ కోదరుండు
వారువమ్ములమీది ♦ పారుపత్తెమ్మున
నెనగు దామగ్రంధి ♦ యే నకులుడు
గోపాలురకు నాయ ♦ కుండై చరించు తం
త్రీపాలుడే సహ ♦ దేవు డరయ

తే. గీ. నర్జునుడ నేను మాలిని ♦ యాజ్ఞసేని
యూర్వశి శపింప పేడినై ♦ యుంటి నిచట
గడపితిమి మీ పురమున న ♦ జ్ఞాతదీక్ష
వత్సరంబిటు మత్స్య భూ ♦ పాల తనయ.

వ. అన విని యుత్తరుండు సంతోష విస్మయంబులుం ముప్పిరిగొన మహాత్మా! నీ వర్జునుడవేయగుచో నతనికి గల పది ప్రసిద్ధనామములం జెప్పుకొని, యా యా నామంబు లెట్లుగల్గినవో చెప్పుమన.

సీ. అవదాతవర్ణుండ ♦ నగుట నర్జునుడ, ఫ
ల్గునితారబొడమి ఫ ♦ ల్గునుడ నైతి
పృథకుబట్టుట బార్థు ♦ డనైతి, హరిసమ
ర్పితకిరీటుడనై కి ♦ రీటినైతి
తెలిగుఱ్ఱము లల్గి ♦ శ్వేతవాహనుడైతి
భయపెట్టి కలన బీ ♦ భత్సుడైతి
విమతకోటిజయించి ♦ విజయుండ నేనైతి
సురలనోడించి జి ♦ ష్ణుండనైతి

తే. గీ. శరము లిరుగేల విడి సవ్య ♦ సాచినైతి
రాజసూయార్థమై గెల్చి ♦ రాజవరుల
సంగ్రహించి ధనము ధనం ♦ జయుడనైతి
నాకు నీ పది సార్థక ♦ నామములగు.

వ. అని చెప్పిన విని యుత్తరుండు క్రీడికి నమస్కరించి చేతులు మొగిచి,

శ్రీరాగము — ఆది

ప॥ శరణు శరణు రిపుమర్దన విక్రమ - పరమ
పురుష రూపా - పాండవమధ్యమ ॥శర॥

అ॥ ప॥ నరుడ వీవని మ - నంబున నెఱుగక
నాపల్కిన మాటలు మన్నింపుము ॥శర॥

చ ర ణ ము

లేదు భయము నాకింక భీష్మాది - యోధు లన్న జగదేక ధనుర్ధర
నీదయాలభ్యముగ సారథినై - నీయరదము దోలెద నొగలెక్కి ద॥

చ. అనిన గిరీటి సాధనము ♦ లన్నియు గైకొని తేరిపై గుణ
ధ్వని యొనరించి వానర ప ♦ తాకమునిల్పియు శంఖమొత్త ద
ద్ధ్వని విని కుంభసంభవుడు ♦ పల్కె సుయోధనుతోడ చూచితే?
మనుజవరేణ్య! పార్థుడు సుమా! యరుదెంచునదే మహోగ్రుడై

చ. అనిమొన దేవదానవుల • కైన నజేయు డతండు, ఫాలలో
చనుని జయించి పాశుపత • సాయకముం గొనె, ధర్మమూ రిగా
వున సమయమ్ము దీర్చి వెలి • వోసి పరాక్రమమొప్ప వచ్చెదు
న్మనలజయింపబూని, యను • మానముతే దితడంతవాడెయా.

వ. అనుచు నెద్దియో చెప్పబోవు ద్రోణుంగని సుయోధనుండు,

ఉ. పాండవ పక్షపాతమున • బల్కెద వంతియె కాని క్రీడి యొ
క్కండె పెటు గొల్వజాలు నురు • కార్ముకదక్షులనిందఱన్ మహో
ద్దండపరాక్రమక్రము డ • తండని వందివిధాన శాస్త్రవుం
గొండొకపెద్దగా నుడువ • గూడునొకో మిముబోటివారికిన్.

వ. అన విని కృపుండు దుర్యోధనుం గాంచి,

మ. విలు చేతంగల వారి కెల్లరకు నం • వేద్యంబు సిక్కంబుగా
బలభిత్సూను పరాక్రమం బతడు పో • వం డెన్నడున్ పట్టి మా
టలతో గావున జాగరూకులయి యుం • డం జెల్లునం చాడు నీ
యులఘుం బాండవపక్షపాతి యన నా • య ఁ బౌనె ? సుయోధనా!

వ. అన విని రాధేయుండు సక్రోధుడై సుయోధనున కిట్లనియె.

పూర్వకల్యాణి—ఆది

ప॥ తిన్న యింటివా సాల లెక్కించు - తీరు దోచె
నీ బావలనైజము ॥తిన్న॥

అ॥ప॥ ఎన్నదగిన శస్త్రవిదు లంచు - మన్నిం
పగ కందాలోబడి తిని ॥తిన్న॥

చ ర ణ ము

వెంట వీరిగాని పోరికి వచ్చుట - పిల్లిని గాని పెండ్లియిల్లు సేరుట
వంటిదే యగును గానిచో దగునె - పవరమందు పిటికిమందు
వోయుట ॥తిన్న॥

కి. కల్లగాదు "తాజెడ్డగోతి వన - మెల్ల జెఱిచె" నన్నట్టిసామెతయు
నెల్ల సైనికుల కుత్సాహ మూడ్చు - టేల ? తమవల్ల గాకున్న
జూాని ॥తిన్న॥

ఉ. బావలసాయ మేమిటికి ♦ పార్థివసత్తమ! నీకు, సంగరా
టోపము మీఱ నే నొకడ ♦ దుర్మద పార్థుని శీర్ష ముద్త్రుంచి
ద్యావటిమంబు తేటనడ ♦ సందఱు సూచుచుండు డా భవా
నీపతి యడ్డగించినను ♦ శేషు కిరీటికి చావు తప్పునే?

వ. అన విని యశ్వత్థామ కర్ణున కిట్లనియె

ఉ. గొల్లల నడ్డగించు టను ♦ గొంటివొ? సంగరమందు భైరవీ
వల్లభు సైతము న్గెల్చి ♦ వచ్చు కిరీటి నెదిర్చి నిల్చుటల్
చెల్లవు పొల్లుమాట లిక ♦ చేరువకుం జనుదెంచుచున్న వా
డల్లదె క్రీడి కౌరవ కు ♦ లాటవి గాల్చు కృశానుతుల్యుడై.

తే. గీ. ప్రబల దుర్మద ధార్తరా ♦ ష్ట్రికులధూమ
కేతు వన ద్రోణ నాకపి ♦ కేతు వదిగో?
శకుని దుర్మంత్రి తంత్రము ♦ ల్సాగ వింక
నెల్లరుం గూడి పోరి కా ♦ యితముగందు.

వ. అని పల్కు నశ్వత్థామాదుల వారించి యర్జునుడు సమీపంగతు డగుటచే భీష్ముండు తాలధ్వజం బెత్తించి సైన్యమ్ము దీర్చి యున్నంత విజయుం డద్దెనకు జేరవోవం బనిచి గురుకృప గాంగే యులకు బదసమీపస్థలంబులం బడ రెండును, గర్ణాభ్యర్ణప్రదేశం బులం బన రెండునుంగా సమ్ములేసిన క్రీడింగని ద్రోణుండు సంత సించి,

కల్యాణి—రూపకము

ప॥ భళిరా! శిష్యుడవన నీ - వగదా రౌరా పృథాతనయ ॥భళి॥
అ॥ప॥ అలరితి నీ గురుభక్తికి - నారాధించితివ నన్ను ॥భళిరా॥

చరణము

ఇలగురునకు బంగనామ - మిడుశిష్యులు నూర్గురేల
సలలితముగ నొకడేడియు - జాలడా నినుబోలువాడు ॥భళి॥

చ. పదయుగళింబ్రణామముల ♦ వైఖరి నేసి శరద్వయమ్ము, న
మ్ముదమున నేమహాయనెడి ♦ పొల్కు శరద్వితయమ్ము వీనులం

బడపడి సోకిసోకని క్ర ♦ మమ్మునసేసి భళీ ! కృతజ్ఞత
స్వదితము జేసికొంటివి త్రి ♦ విష్టపహూన్యుడవోయి నాయనా !

తే. గీ. అనుచు నగ్గించు నంతలో ♦ నర్జునుండు
చిత్రగతి నెట్టులో కురు ♦ సేనజొచ్చి
గోవుల మఱల్చు నంత శ ♦ కుని జయద్ర
థాదు లొకమొగి పైబడ ♦ నతిరయమున.

సీ. మండలీభూతమా ♦ గాండీవశేఖరయే
వరలు సురేంద్ర చా ♦ పమ్ముగాగ
కర్ణముల్ ప్రయ్యలు ♦ గావించు తద్గుణ
క్వణమే మహాఘోర ♦ గర్జగాగ
శకుని సైంధవముఖ్య ♦ శత్రు వీరపరాక్ర
మంబే నిదాఘుకా ♦ లంబుగాగ
కోదండ నిర్ముక్త ♦ గురుతరోత్కటశరా
సారమే తతవర్ష ♦ ధారగాగ

తే. గీ. విజయజలధర మెల్లెడ ♦ వి వరింప
గాల్వలై పాఱె రక్తమ్ము ♦ కదనభూమి
జెండి చేష్టలు దక్కిరి ♦ వీరులెల్ల
నట్టిచో దాకె వానవి ♦ నర్కసుతుడు.

వ. అట్లు తన్నెదిరిన కర్ణుం గని

దర్బారు - రూపకము

ప॥ శరము వందువమ్యో నాకు - కర్ణా నిలు పాఱిపోకు ॥శ॥
అ॥ ప॥ సరి నా కెవ్వరు లేరని - సభలం బల్కుదు వీ వట ॥శ॥

చరణము

పలుకవచ్చు గా కెన్నరయో - పలికిన యటు చేయుదర మొ
తలపగ కార్యశూరులు - తులువా ! వాచాశూరులు ॥శర॥

క. అని పల్కి ధనంజయుపై
దినమణిసూనుండు గురిసె ♦ తీవ్రశరంబుల్,

తను జుట్టుముట్టు సేనలు
కినిసి నిశాతాంబకముల ♦ క్రీడియు సేసెన్.

ఉ. అంచిత విక్రమాతిశయ ♦ మల్లన నూవుచు సైన్యముం బలా
పంచలు జేసి చేతివిలు ♦ భగ్నమొనర్చి తదంగకమ్ము న
న్నించి శరమ్ము లంగ ధర ♦ శీవిభు జోరుతొలంగజేసి పూ
రించెను దేవదత్తమును ♦ క్రీడి విరాటతనూజు డుబ్బగన్.

వ. అట్లు కర్ణుండు కయ్యంబు విడిచి పాఱినం త నమానుష విక్రముండగు ద్రోణుం డప్పార్థుం దాక నేతెంచిన నరుండు గురున కిట్లనియె.

తే. గీ. పదియు రెండేడు లడవులం ♦ బడి యిడుములు
గుడిచి వచ్చిన యట్టి శి ♦ ష్యుడగు క్రీడి
మీరు పెట్టిన దీపము ♦ మీపవిత్ర
పదములకు సేయు నిదె యభి ♦ వాదనంబు.

తే. గీ. పతిని డీకొను సుతుగన్న ♦ పడతి, గురుని
దుర్కొను నెట స్సమాప్త వి ♦ ద్యుం డటన్న
సామెతగ మీకడ సద్విద్య ♦ సంగ్రహించి
మిమ్మెదురజూచు నన్ను తు ♦ మింపుడనఘ!

ఉ. చేతులు రావు నాకు గురు ♦ శేఖర! మీపయిదొల్త సాయక
వ్రాతము లేయ, నావయిని ♦ ప్రప్రథమంబున మీర లేయుడీ
భీతిదొలంగు నాకు, నిది ♦ విన్నను నాయెడ నింక ధర్మనం
జాతుడు కోపగింపడు, ని ♦ జమ్మున కయ్యది ధర్మమే యగున్.

వ. అని పల్కిన యర్జును ధనురాచార్యుం డిరువది బాణముల నేసిన వానినన్నింటి గవ్వడి తుత్తునియలొనర్చి పోరుచో గౌరవసైన్యంబు క్రీడి కడ్డంబువచ్చిన విష్వచ్ఛం డసంఖ్యాక బాణపాతంబున సైన్యంబును దైన్యంబు నొందించుచు ద్రోణుం డేయు బాణంబుల దునియలు గావించుచున్నం జూచి విస్మయపడి గురుండు.

మోహన - ఆది.

ప॥ నిన్నాహవమున నిలువరింపగా - నేర మఘాల నేత్రుండైనను ॥ని॥
అ॥ప॥ ఎన్నదగినవిలుకాడవౌదువో-యన్నా! వినునాకన్నఘనుండవు ॥ని॥

చరణమ్ము

దేవదానవుల గెలిచిన నిన్నుం - దేటిచూడ వశమా మానవులకు
నీవంటిశిష్యునకు విద్యగఱపి - నేకృతకృత్యుడ నైతినర్జునా ॥ని॥

మ. అనుచున్నంత మహేంద్రసూనుడును ద్రోణాచార్యు పైనించి మా
ర్గణపాళి న్విరథుం బొనర్చ దగ తీక్ష్ణక్రోధులై తాకి ర
ర్జును ద్రోణాయనియుం గృపుండు, నరుడున్ రోషించి వారిన్మహో
గ్రనికాయమ్ముల బాఱదోలి మఱియుం దాకెన్ వడిన్ భీష్మునిన్.

క. హారినోర్చినవాఁ డొక్కఁడు
హారునోర్చినవాఁ డొకండు నాంబుర్వ్వరు నం
గర మొనరించుచు ఖేచర
వరనన్నుతి పాత్రులైరి భారతవీరుల్.

తే గీ. కొనకుగ్రీడి మంచాకి నీ తనయుచేతి
విలుదునిమి వక్షమున శర మ్ములనినుపగ
సో లెరథకూబరమ్మున, సూతుడంత
నరదముం దోలుకొనపోయె నచటువాసి.

వ విజయుండును యుద్ధమ్మున దనివిననక గుంపులుగట్టియున్న కురు
సైన్యంబుపై బడి యేట్లాడుచు కడకు దుర్యోధనుపై బాణకూటమ్ముల
నేయ నయ్యరగ కేతనుండు యుద్ధభూమినుండి తొలంగి చను
చుండం గని కవ్వడి సుయోధను నిట్లుపాలంభించె.

కన్నడ—ఆది

ప॥ కయ్యమన్న జాదంబనుకొంటివి-కానోలును పాపముదుర్యోధన ॥క॥
అ॥ప॥ అయ్యవారిముంగటనే చూపితి-వౌరనీపాటుబోతుంతనంబిటు ॥క॥

చరణము

ప్రతినజేసెచిన్నన్న మిము నూర్వురం-గూల్చెదననిఘోరాహవమునా
బ్రతికిపోతి వద్దాన నేడినీ! పాటిపోమ్ము - కౌరవకులపాంసన ॥క॥

సీ. అనిన రోషించి పా ర్థునిపయి గురుపతి
కవియు భీష్మద్రోణ కర్ణముఖ్య

వీరు గెల్లరు నొక్క ♦ పెట్టున వచ్చి తా
కిన విజయుండు మో ♦ హనశరమ్ము
విడువ నాయుధములు ♦ విడిచి యెల్లరు నేల
నొఱగిరి నిద్రించు ♦ చున్న యట్టు
లర్జునప్రేరితుం ♦ డై యుత్తరుడు శాంతి
నవు డున్న వంకకు ♦ న్వాక తక్క

తే. గీ. యోధవరుల యుష్ణీషమ్ము ♦ లొకట గోసి
తెచ్చి రథ మెక్కె వెనుకకుం ♦ దేరు వోవ
నిచ్చుటయు గౌరవులును ల ♦ జ్జించి భీష్ము
నానతిం జారిబట్టిరి ♦ హాస్తి పురికి.

వ. అంత నర్జునుండు తిరిగి జమ్మికడకు సేరి గాండీవాదిసాధనమ్ములు పూర్వప్రకారమ్మున నిక్షేపింపజేసి, దేవదత్త కిరీటాది పరికరమ్ము లంతర్ధానమ్ము సేయించి, కురుబలమ్ము గెల్చి యుత్తరుఁడు వచ్చుచున్నట్లు సాటింపుడని గోపాలుర పురంబునకనుపన వ్వారునని భూమింజయు విజయమ్ము విరటునకు దెల్పి చనిర య్యెడ విరటుండు కంకునితోఁ జూదమాడుచు దనకుమారుని విజయంబున కెంతయుం బ్రమోదించుచు బొగడుచున్న నయ్యాడి బృహన్నల జయంబని ధర్మజుండన గోపించి భూపతి పాచిగొని ధర్మసుతునేయ గంటువడి రక్తమ్ము స్రవించుచో తత్క్షణంబ యచ్చో సైరంధ్రి తనయుత్తరీయమ్మున నొత్తు సైరంధ్రిం గని మత్స్యమహీవల్లభుండు నీ వీ శోణితంబు పై జీర్ణంబట్టుటకు గారణం బేమి సైరంధ్రి యనుట్లనియె.

చ. కులమును శీలముం గలుగు ♦ కొండదమాన్యుఁడు కంకు డట్టి యా
యలఘుచరిత్రు రక్తము ధ ♦ రాధిప! ధారుణిపైని యెన్ని చు
క్కలుపడు నన్ని వర్షములు ♦ గల్గును కాటక మిందుగాన నే
సిలుగును నీక నిక్కతన ♦ జేకురకుండగ నిట్లు జేసితిన్.

తే. గీ. అంతలో నుత్తరుం డట ♦ కరుగుదెంచి
నరయము నెఱింగి "కొంప ♦ సె నన్న మొకు

గెలిచి వచ్చితి" నంచు స ♦ గ్గించి పలుకు
తండ్రి కిట్లని నెంతయు ♦ దత్తరమున.

సరస్వతి — ఖండగతి

ప॥ ఎంతపనిజేసినా - వీయనఘు పాలెగొని
యేసి పాపముగొట్టినా - యుత్తండెవడనుకొంటి ॥ఎం॥

అ॥ ప॥ సంతతామలసత్య - సంధుడా పాండుభూ
కాంతు నగ్రసుతుండు వరధర్మ భూనేత ॥యెం॥

చరణము

వలలుడే భీముడు, బృ - హన్నల యె విజయుండు
వారువమ్ముల నేలు నా - దామగ్రంథియె నకులుడు ॥వ॥
అలరు తంత్రీపాలు - డరయ సహదేవుండు
చెలువ సైరంధ్రియే క్షితినాథ! పాంచాలి ॥యెం॥

తే. గీ. ధార్తరాష్ట్రుల కిల్లు జూ ♦ దమున నోడి
పదియు రెండేండ్లు పాండు భూ ♦ పాలసుతులు
నలిపి వనవాస మంత న ♦ జ్ఞాతదీక్ష
గడపినారలు మసవీట ♦ కాలవశత.

వ. అని విని విరాటుం డద్భుతామోదమ్ములు ముప్పిరిగొన వినయమ్మున ధర్మజునకు మొక్కి తత్క్షణం బుత్తర నయ్యెడకు రావించి "యిమ్ముద్దియ నర్జునున కిడి పెండ్లిసేయ దలంచితి" నన నర్జునుం డక్కన్నియం గోడలిగా గైకొందు నన విరటుండు సంతసించి సుముహూర్త నిరూపణంబు సేయించి యాదవపాంచాలాది బంధుజనుల నెల్ల బెండ్లికిం బిలువం బంచెనంత పాండుకుమారులు జమ్మిపై నిడిన యాయుధమ్ముల బూజాపూర్వకమ్ముగా దెచ్చికొని యుపప్లావ్యంబున వసించియుండ నయ్యెడకు సపరివారమ్ముగ సుభద్రాభిమన్యుల దోడ్కొని బలరామకృష్ణు లరుదెంచి కుశలం బెఱింగి యభిమన్యుని భద్రగజారూఢుం జేసి విరటుపురంబున మంగళతూర్యనాదంబులు సెలగ మహావైభవమ్మున నుత్తరాభిమన్యులకు వివాహమహోత్సవంబు గావించిరి.

శ్రీ

# మహాభారతము

## పాండవ సందేశము

యమునాకళ్యాణి—ఆది

ప॥ వినుడీ పాండవసందేశ కథన్ - వినిపించెద నేడు శుభంబగు ॥విను॥

అ॥ ప॥ వననిధివోలె ప్రతిసపర్వార శోభదయ - భాసుర మగు నీ భారత
చరితము ॥విను॥

చరణము

ఉత్తరాభిమన్యులవివాహ మ - హోత్సవానంతరమున పాండవులు
చిత్తము లలర నుపప్లావ్యమునం - జేరి రెల్ల రానందభరితులై ।
వినుడీ॥

సీ. కౌరవాగ్రజుడు సం ♦ గ్రామమందున గృత
నిశ్చయుండై సని ♦ నీరజాక్షు
సాయమర్థించి నా ♦ రాయణుండును పవ
ళించ నాతనిగల ♦ యంపివై పు
నాసీనుడై యుండ ♦ నర్జునుండరిగి శా
ర్ఙ్గధరుయొద్ద జేరి ని ♦ ల్వబడియుండె
నంతలో మేల్కని ♦ హరి పార్థు జూచి సం
తసమున నెల్లరి ♦ కుశలమడిగి

తే. గీ. వెనుకనున్న సుయోధనుం ♦ గని నగార
వమ్ముగా నేమమరసి న ♦ ర్వజ్ఞుడయ్యు
నేమెఱుంగనియటుల న ♦ టించి రావ
కాగమనకారణంబేమి? ♦ యన నతండు,

తోడి—రూపకము

ప॥ కౌరవపాండవులు పెనగు - కాలము చేరువయ్యెను ॥కౌ॥

అ॥ ప॥ కోరగవచ్చితి రణమున - గోపాలా! నీసాయము ॥కౌ॥

చరణము

సరసిజాక్ష బాంధవమున - సములము నీకుభయులము
కర మనుకూలుడవు గమ్ము - కయ్యమ్మున నాకిచ్చోట ॥కౌ॥

ఉ. నే నరుదెంచితిం దొలుత ♦ నీకడకు న్నినుఁబోటి సజ్జను
ల్మానుగ ముందువెన్కల గ్ర ♦ మమ్ముగ నారసిగాదె కార్యసం
ధానము సేయుచుందురు జ ♦ నార్దన! కావున నాకు నీవు నీ
సేనయు దోడుగావలయు ♦ సెప్పగలాడవె నీకు ధర్మముల్?

వ. అని విని వాసుదేవుం డిట్లనియె.

శా. ముందే వచ్చితి వీవు, చూచితిని ము ♦ న్నర్జును న్నాకు, మీ
యం దెంతేని విభేద మేర్పడదు, సా ♦ యం బిర్వురం గోరు టీ
చందం బారయ ధర్మమేయగును, నా ♦ సైన్యమ్ము భాగింతు, మీ
రం దెవ్వారల కేది యిష్టమగునో ♦ యుద్దానిం గైకొండికన్.

ఉ. వీరులు నన్ను బోలు పది ♦ వేవురు గోపకు లున్నవార ల
వ్వారొక వైపు, సేయుదురు ♦ భండన; మే నొకవైపు, నంతయుం
బోరొనరింప; సేయుదును ♦ బుద్ధికిదోచిన సాయ; మిందులం
గోరు డభీష్ట మెయ్యదియొ ♦ కోరగజెల్లును ముందు క్రీడికిన్.

వ. అని విని యర్జునుండును,

శ్రీరంజని—రూపకము

ప॥ సారథివై రథమెక్కుము - చాలునాకు గోపాలా ॥సారథి॥

అ॥ ప॥ నీ రణమేటికివలయును - నీకటాక్షమున్న జాలు ॥సారథి॥

చరణము

నీవే యుద్ధ మొనర్చిన - నెటువచ్చును పేరు మాకు
బావా! నీ దయయున్నెడ - పగతుర గెల్చుటెంత పని ॥సారథి॥

క. అని విని సుయోధనుడు నె
మ్మనమున సంతోషమంది ♦ మాధవ! నే ద

క్కిన దానిఁ గొండు ననుచుఁ
జనె నంతట శౌరి సవ్య ♦ సాచిఁ గనె నిట్టుల్.

తే. గీ. విక్రమోపేతు లాహవ ♦ వీరులైన
గోపకుల పదివేవురం ♦ గొనక విడిచి
యాయుధము నైన ముట్టని ♦ యట్టి వెట్టి
గొల్లఁబోయని నను గోరు ♦ కొంటి వేల ?

వ. అనిన విని కిరీటియు,

ఉ. నీ కెదురై రణమ్మునను ♦ నిల్చిన నీ పదునాల్గులోకముల్
మూఁకు సహాయుమైన నిను ♦ మార్కొనజాల మనంగ, గోపకా
నీకము గోరి నిన్ను దుర ♦ నేరుమె ? నా రథమందు నిల్వుమ
య్యా ! కురుసేన గాదు త్రిపు ♦ రాంతకునైన జయింతు గేశవా !
సీ. పరమేష్ఠినోట వె ♦ ల్వడిన వేదమ్ముల
సారమ్ము శౌరియే ♦ సారథియట
పాశుపతాస్త్రమై ♦ బవరమందున నుమా
రమణు గెల్చిన క్రీడి ♦ రథికుడంట !
వరుణకుబేరవై ♦ శ్వానరాంతకమహే
శ్వరవాసవాదు ల ♦ స్త్రగురులంట
గాండీవమాదిగా ♦ గల సాధనమ్ములు
దేవతావళి ప్రసా ♦ దించినవట !

తే. గీ. సంగరమ్మున నెనబాగ ♦ జాలువాడు ?
తెలిసియే కోరితిని జుమా ♦ దేవదేవ !
హృదయ పరిశోధనార్థమై ♦ యిట్టిమాట
లాడితివి గాని బావా ! మ ♦ హానుభావ !

వ. అని పల్కి గోపాలుం డోడ్కొని ధర్మభూపాలు కడకుం జనియె నంతనట శల్యుండును పుత్రమిత్రసైన్యసమేతమ్ముగ బాండవసహాయార్థమై వచ్చుచుండ మార్గమధ్యమ్మున దుర్యోధనుం డెంతయుం దన్ను గౌరవింప సంతుష్టాంతరంగుడై కురుపతింగని 'నీ కెయ్యది యిష్టంబు కోరుమిచ్చెద' ననన.

మలయమారుతము - త్రిపుట

ప॥ కోరున దేమున్నది మద్రేశ్వర - గురుగవా
సమర...కుశలుండవు...సత్యసంధుడవు ॥కో॥

అ॥ప॥ చేరినాకమాత్యుడవై కౌరవ - సేన నెల్ల నడిపింపు రణమ్మున

చరణము

కౌరవులని పాండవులని భేదము - గలదె నీకు శూరా...
యుభయులోక రూఢ ॥కో॥
వీరలోక మగ్గింప దురమ్మున - బోరాడుము నాకు
సహాయముగా ॥కోరు॥

చ. అన విని శల్యు డట్టులె స • హాయ మొసర్తు గాక పాండునం
దనుల నవశ్యముంగని ప • దంపడి వత్తునటంచు బల్కి తా
జని వడి వారలున్నెడకు • సత్కృతుడై ధృతరాష్ట్ర సూతికిం
దనకు బొసంగుమాటల వి • ధానము దెల్పిన ధర్మజుండనెన్.

ఉ. కౌరవనాథు పక్షమున • గయ్యమొసర్చుట సమ్మతించె; నా
కోరిక దీర్పు డొక్కటియు • కోరునదేమన సూతసూతికిన్
సారథి వీవు దక్క కురు • సైన్యమునం దొకడుండు లేడు మా
మా! రణమందు కర్ణు హృద • యమ్ము గలంచి కిరీటి నేలుమా.

తే. గీ. అనిన మద్రేశ్వరుం డియ్య • కొని యుధిష్ఠి
రాదులను వీడుకొని చనె • హాస్తిపురికి
నంత సమరసహాయార్థ • మైన్నృపాలు
రేగుదెంచుచు నుండిర • య్యిరుతెగలకు.

ఉ. అంతట నాంబికేయు డొగి • నంపెను సంజయు ధర్మసంభవున్
శాంతియుతాత్ము జేయుమని, • సంజయుడుం జని యెల్లవారి న
త్యంత భయోరుభక్తి విన • యమ్ము.... సమస్కరించి తా
నెంతయు నేర్పునం బలికె • నిట్లు యుధిష్ఠిరుతోడ గొల్వునన్.

ధన్యాసి - ఆది

ప॥ సంతసించుచున్నాడుమీతండ్రి - యెంతయోమీసేమమాలించి ॥సం॥

అ॥ ప॥ సంతలన్నింటిబాసి మీరుదప్పావ్వంబు సుసుఖులై యున్నారని ॥సం॥

1. మతిమాలినవార్ధక్యము కతమునమాన్పడయ్యె దుర్యోధనుచెయిదము
వెతలకోర్చి ధర్మమ్ముదప్పకే ప్రతిన జెల్లించుకొంటివో యనఘ॥

2. కలహమాడి దాయాదులుమడియుటకన్న దారుణం బున్నదే? తలప
కులవినాశకరమా కార్యమునకు దలపెట్టరు నీబోటిమహాత్ములు॥

చ. అలవియె నిర్ణయింపగ జ ♦ యాపజయమ్ములు తొల్త, మీరలే
కలన జయమ్ము గాంచెదరు ♦ గాక, యజాతరిపుండవంచు ని
ర్మలయశమంది తుచ్ఛమగు ♦ రాజ్యసుఖంబుల కాసజెంది దా
యల ననుకంప వీడి తెగ ♦ టారువె, నెత్తురు కూడు తిందువే?

తే. గీ. పాలొసగలేదటన్న కో ♦ పమున బంధు
కోటిదెగటార్చి నెత్తురు ♦ కూడు దినుట
కన్న మేలగు నీకు భి ♦ క్షాటనమ్ము
జేసియైనను గడపుచే ♦ జీవయాత్ర.

చ. పరులకు గ్రుంగ జేయగు మ ♦ హోగ్రహలాహల మట్లు గ్రుంగగా
వారునకు, దీప్తకోపరస ♦ మల్లన గ్రుంగికొనంగ నీకునున్
వరునగ జెల్లె; శూలి కెన ♦ వచ్చు దయానిధి వీవు కాన నో
నరవర! యట్టి నీ వలిగి ♦ వన్ జగమంతయు భస్మగాసియా.

వ. అని విని ధర్మనందనుం డిట్లనియె.

కేదారగౌళ - ఆది

ప॥ భాగమీకుండ - శాంతిగూర్పమనిపంపెనానిన్ను యూపెదనాయన?

అ॥ ప॥ జోగులవై కౌరవుల - బట్టుకయూగులాడుమనియా సందేశము?

చరణము

కానివోయతని తమ్మునికొడుకుల - మేకై పడి నిర్భాగ్యులమైనను
మా కాతనిచరితము-క్రొత్త గాదు-మాన్పలేడు దుర్యోధనుమతమును

శా. "ఏనా డా విదురాదు లేమిటికి నీ ♦ కీ బాదపుంగల్మి, యె
చ్చో నింద్యంబగుగాన నాన విడు" మం ♦ చుం జెప్ప నాలింపడో
యానాడే చెడె వంశగౌరవము; భీ ♦ ష్మాదుల్ మదీయాజ్ఞకున్
లోనై బన్నములెన్నియో పడుచుటల్ ♦ గుర్తింపవో? సంజయా!

సీ. తెరపిలేకుండ గాం • డీవి ఖండనమున
గలకౌటమ్ముల వాన • గురియునాడు
కురుకుమారులతల • లురమున గద కేల
గొని భీముడు పగుల • గొట్టునాడు
తఱిమి మాద్రేయ ప్ర • ధాన యోధవీరుల
జెండాడువాడఱ • నేయునాడు
కారుచిచ్చుంబోలె • గపిసి సైన్యాలపం
జిన్నతమ్ముడు బూది • సేయునాడు

తే. గీ. తమ్మునికుమారులంచు పాం • డవులు తెలియ
నట్లు మమ్ము గాశీయాత్ర • కంపు పున్న
మాత్మజుల ఘోషయాత్రకై • యంపు పున్న
మనుభవింపగలా డిక • నంధనృపతి

శా. నీకేలోచనా • యీతడే మునెనోకి గా • సీ, బిచ్చపుంగూడు మే
ల్మాకంచున్ వచియించినాడ • దిపు ధ • ర్మంబెట్లొకో తేజోబల
ప్రాకట్యమ్ముగలట్టి రాచకొడుకుల్ • చిక్కాన్న మేమాక, యీ
పీకన్ బిచ్చపుగంజి ద్రావుదురొకో ని • ర్విణ్ణాత్ములై, సంజయా!

వ. అని పల్కు ధర్మజుని వీరరసోచితమ్ములగు వాడిపలుకుల కెల్లరు
నక్కజమందిరి. అంతవాసుదేవుండు సంజయుంగని ధర్మజునుద్దేశం
బున కనుగుణంబుగ నిట్లనియె.

భైరవి—రూపకము

ప॥ సమర మెట్లునుం దప్పదు - సంజయ! నీకేమి వెఱ్ఱి ॥స॥
అ॥ ప॥ యము డాకలిగొనియున్నా - డఖిలజనక్షయమగు నిక ॥స॥
1. పరిభవపడి చేతగాని - వారింబలె నుంటకంటె
పరిపంథుల నురుమాడుటె - భావ్యంబని తోచునాకు ॥సమ॥
2. సాగవింక మునుపటి వలె - సౌబలు దుర్మంత్రంబులు
నాగపురాధిపు నంధుని - నక్కవినయములు సెల్లవు ॥సమ॥

సీ. విసముపెట్టిరి, కర • పించిరి ఫణులచే,
గాల్పించి రిల్లు లా • క్షాగృహమ్ము

వాదమాడించిరి, ♦ సుదతికి గొల్వులో
గారాని యిబ్బంది ♦ గలుగజేసి
రఖిలరాజ్యశ్రీల ♦ హరియించి పై పెచ్చు
కట్టుగుడ్డలతోడ ♦ గాన కంపి
రట్టిమోరకులతో ♦ నిట్టు లీపాండురా
జతనూభవులకిక ♦ సంధిపొసగు

తే. గీ. రోషమయ మహాతరువు దు ♦ ర్యోధనుండు
స్కంధ మారయ గర్ణుండు ♦ శాబలుండు
కొమ్మయగు దుస్ససేనుడే ♦ కుసుమఫలము
పోల్ప నా ధృతరాష్ట్రుడే ♦ మూలశక్తి.

చ. తలపగ ధర్మవృక్షమగు ♦ ధర్మతనూజుడు, స్కంధ మారయన్
బలరిపు సూతి, శాఖయగు ♦ వాయుసుతుండు వృకోదరుండు, పూ
వులును ఫలమ్ము లౌ కవలు, ♦ భూసురులేనను నాల్గువేదముల్
విలసిత మూలసంచయము ♦ వేయి నికేటికి నమ్ము, సంజయా!

క. కాని మొక్కవరి కరిపురి
కే నేతెంతును వచింతు ♦ హిత వికనైనన్
భూనాథుడు వినినా సరి
కానున్నది కాకపోడి ♦ కన్ వినకున్నన్

వ. అనివిని సంజయుం డట్లు సేయుట లెన్న యనివల్కి యెల్లరికడ సెలవంది ధర్మజాదులు తన్ను సగౌరవమ్ముగ బనుప నుపప్లావ్యంబు వీడ్కొని ప్రొద్దుగుంకునంతకు గరిపురమ్ము సొచ్చి ధృతరాష్ట్రుం గసి పాండవుల నేమ మెఱింగించి యచ్చటి విశేషంబులం జెప్పె నిట ధర్మనందనుండును శ్రీకృష్ణభగవానుం గాంచి యిట్లనియె.

బిలహరి — ఆది

ప॥ సారాంశము తెల్పుమయ్యా నేగద! - సర్వజ్ఞు సంజయరాయబారమున
అ॥ ప॥ పోరాటము గాకుండ కార్యమేతీరునం జక్కబడదని శోచును

చరణము

తగును కార్యసాధనకునై సామ - దాన భేద దండోపాయమ్ములు
జగడమేల నీకోపినయంతకు-సంధిగూర్ప యత్నించిచూడుమా ॥పా॥

మ. మనుగాపాడగ నిన్నుజూచి చనియెన్ ♦ మాయయ్య యానీకటా
క్షమునం గష్టములన్నియుం గడచె సం ♦ గ్రామమ్ము గాకుండ ని
ల్పుము కొల్లనియు మామకోభయకుల ♦ మ్ముల్ సంధిగావించి సా
ధ్యముగాకున్నడ నానుయోధను ససో ♦ దర్యమ్ము గూర్చింపుమా!

శా. ఐదూళ్ళిచ్చినజాలు మాకనుచు, నే ♦ యంజాలమో జ్ఞాతివా
డై దుర్యోధను డింతమాత్రమును, నే ♦ లా? బాంధవశ్రేణి దా
యాదవ్రాతము గూల్చి చేకొనెడు రా ♦ జ్యం, బీ విపద్వార్ధి నెం
తే దాటింపగ గర్ణధారుడవుగ ♦ మ్మా, మాకు దామోదరా!

వ. అనివిని వాసుదేవుండు ధర్మజుంగని.

ఉ. ఎంతటి ధర్మరాజవో? వ ♦ ఱించి దురోదరమందు నంపదల్,
గాంతను గొల్వుకూటమున ♦ గాని పరాభవముం బొనర్చి, మి
మ్మంతలు జేసియున్ వనుల ♦ కంపిన దాయలు చుట్టురంచు నీ
వంతున జాలినం దెదవు బా ♦ పురె! బాచరికంపు ధర్మమే?

శా. కాని మ్మేగుదు హాస్తినాపురికి గం ♦ గానందనాదుల్ కరం
బానందింతురు మీవిధమ్ము విని, లో ♦ పాలోపము ల్లేలు, నా
పై నిందింతురు వారి నెల్లరును, యా ♦ వచ్ఛక్తియుం జూపి బా
వా! నాకోపినయంత బల్కుచు సభన్ ♦ వారింపగా యుద్ధమున్.

వ. అనిపల్కి భీమసేనుం గని సంధివిషయమై నీయభిప్రాయం బేమన నతంచును.

పూరి - రూపకము

ప॥ అడుగు దప్పరీ పాండవు - లన్నమాట కెన్నడైన ॥అ॥
అ॥ ప॥ ఇడుమ లెన్నియైనింతకు - నెక్కుడు ప్రాప్తించుగాక ॥అ॥

చరణము

కొడుకులతో బాటు నరిగ - పుడమి పంచిపెట్టుమనుము
నెడగుల మాటల వినిడి - చెడవలదను మంథువితో ॥అడు॥

శా. పాలింపన్ గదాభుజంగికి సుత ♦ ప్రాణానిలమ్ముల్ వడి
న్వాలై పో మను వృత్తి గూర్తు దనకు ♦ న్గాంధారికిం జేర్తు, దా
సీలై భానుమతీముఖాంగనలటన్ ♦ సేవించుచే గల్గు బాం
చాలిం బట్టము గట్టు దేనసుము రా ♦ జ్యంబెల మాయన్నకున్.

వ. అనిన నర్జునుం గని నీయభిప్రాయం బెఱింగింపుమన నతం డిట్లనియె.

ఉ. సాహసవృత్తిమై ననుజ ♦ సౌబల కర్ణసహాయుఁడై రణో
త్సాహమునన్ సుయోధనుఁడు ♦ తానొగి సంధి యొనంగ వీనితో
బాహుపరాక్రమ క్రమము ♦ భాసిల నుగ్రరణమ్ములోన బూ
ర్ణాహుతిసేతు నారథికు ♦ లందర సేనొకడన్ శరాగ్నికిన్.

వ. అనునంతలో నకులుం డిట్లనియె.

ఉ. వారిబలమ్ము వారు, మన ♦ వారిబలమ్ము మేము మెచ్చుకొం
టారయ నైజధర్మము గు ♦ సంగున లేదు ప్రయోజనంబు గా
దే, రణమందు సాయకము ♦ లే తెలుపంగల వీ వితర్కమే
లా, రయమేగి యోచిన కొ ♦ లంది వచింపుము సంధిగూర్పగని.

వ. అని పల్కిన విని గోపాలుండు సహదేవుం గని నీయభిప్రాయం బేమన
నతఁడిట్లనియె.

చ. అడిగితి వీవు గావున ము ♦ రాంతక ! చెప్పెద నాలకింపుమా
యొడబడ డెట్టు సంధికి సు ♦ యోధను డాలముగాక తప్ప దా
చెడుగులు నూర్వురున్ వడి న ♦ శింతురు సేనలతోడ నాజిలో
బుడమి సమస్తముల్ కమన ♦ పుత్రులపాలగు నేనెఱుంగుదున్.

వ. అని పల్కిన సహదేవుని వాక్యమ్ములు విని సాత్యకిప్రముఖ రథికవరు
లెల్లరు నభినందించి రంతలో ద్రౌపది గోపాలదేవుం గని దైన్యమ్మున
నిట్లనియె.

జంఝూటి - ఆది

ప॥ అన్నా ! సంధిఘటింపకుమా న - న్నంతలు జేసిన చెనటులతో ॥నన్నా॥
అ॥ ప॥ బన్నమొందిపగతురకుజాలక నెన్నుసంబొందుపడియునర ॥యన్నా॥
1. అవబృధమున శుచియగు వేణిం గొనియట్లీడ్చిన పాపాత్ములతో॥
2. మన్ననేను తను - వింతలింతలుగ తునియలై చెదర - గనునంతకు॥

క. కౌరవాగ్రజుని వీనుంగును గ - వ్వార ధర్మజుడు నేనుజూతు ॥ము॥

ఉ. ఓరిమి నీవరాధనము • లోరిమి జూచ్చె చికిట్టిపట్టు లే
తీరున నాటు లెన్నడును • దీనికిఁ గల్గుప త్రోడబుట్టువై
వారయు దుష్టప్రవాహుడ • వాల్మ్రణిభు ల్జగదేకవీరులే!
వేఱొక యాడుదానికి ల • భించునె సౌఖ్యము నాకు లేనిచో?

సీ. భీముండు కురుపతి • పెందొడల్ విఱచి దు
శ్శాసను తొమ్మున స • క్రమ్ము ద్రావ,
సవ్యసాచియు నంగ • జనపాలు దునుమాడ,
నలనాడు గిపు ప్రజ్ఞ • లాడినారు,
అంతకుం జాలదు • కైసనేమి? యుధిష్ఠి
రాజ్ఞ మీరరు ప్రశాం • తాత్ములగుచు
గాన నేను సుభద్ర • కయ్యమునకు జని
ఏకాట లాడించి • యేపడంచి

తే. గీ. కర్ణదుర్యోధనాదుల • గసి మసంగి
ధారవోయుదు మింక త • త్ఫలమునరసి
గాండీవమునకు, భీముని • గదకు, వారి
ప్రతినలును జెల్లు నా • మనోరథము దీరు.

వ. అనిపల్కు ద్రోవది సుచితవచనముల నూరార్చి యెల్లరికడ సెల
వంది జలజాక్షుండు మఱునాఁ డరుణోదయమ్మున శైబ్యసుగ్రీవ
మేఘపుష్ప వలాహకంబు లనంబరగు తురంగములం బూన్చి వైన
తేయ ధ్వజంబెత్తి దారుకుండు తెచ్చిన రథమ్మున సాత్యకి సమే
తమ్ముగ నెక్కి, కుంతినెంతయు నూఱడింపుమని పల్కి ధర్మజాదుల
వీడ్కొని చనిచని యొక్కయెడ నారద జమదగ్ని కణ్వాది మహాము
నులంగని నమస్కరించి వారి యాశీర్వచనంబు లాకర్ణింపవచ్చిన
యమ్మహర్షుల దీవనలంది సాయంసమయమునకు గుశస్థలమ్ము చేరి
యచ్చోట బటుకుటీరమొత్తించి విడిసె హస్తినగరమ్మున నాంబికేయుండు
శ్రీకృష్ణుని రాక విని విదురాదులంగలసి సంతసించుచుండె.

శ్రీ

# మ హా భా ర త ము

## శ్రీకృష్ణుని రాయబారము

భైరవి—ఆది

ప॥ శ్రీకృష్ణుని రాయబారచరితము - చెప్పెద నాలింపు డనఘులార ॥శ్రీ॥

అ॥ ప॥ ప్రాకట ధర్మాధర్మనిరూపిత - లౌకికజ్ఞాన సంధాయకమిదె ॥శ్రీ॥

చ ర ణ ము

శౌరి కుశస్థలినుండి కరిపురికి - జనుదెంచిన ధృతరాష్ట్రు డెదురేగి
గౌరవమ్ముగా దోడ్కొని చనియ- ర్ఘ్యపాద్యాదివిధులం పూజించెను॥

సీ. అర్చించి యుచితాస ♦ నాసీను గావించి
యెల్లరిసేమమ్ము ♦ లెఱుగునంత
విదురునిగాంచి గో ♦ విందు డిట్లనియె 'నీ
యింటికి నేడున ♦ కేను వత్తు
నామాట వల కౌర ♦ వాగ్రజుం డాలించి
యగునె? నీతికిని బాం ♦ ధవమునకును
వెలియగు నేత గా ♦ వింప నీకన, గృష్ణు
డా సుయోధనున కిట్లనియె నొత్తి

తే. గీ. 'పాండుతనయుల దూతనై ♦ వచ్చినాడ
కార్యముం దీర్చి యామీఁద ♦ గారవింపు
రాయబారి ముందుగ దిన ♦ రాదు నీవె
యుంగవే?' యన ననియె దు ♦ ర్యోధనుండు.

క. అగు గాకుండును కార్యము
నగధర! నాయింట గుడిచి • నావలన నీ కె
కగు కార్యం బెఱిగింపుము
తగునే నీకోటి కీ వి • ధమ్ముగ నేయన్ ?

వ. అనవిని దేవకీపట్టి గాంధారిపట్టి కిట్లనియె.

ఉ. పాండుకుమారు లెవ్వరును • ప్రాణసముల్ గాను నాకు, నీవు శ
త్రుండవు వారి కేగతి హి • తుండవు నాకగుదీవు? గాన శ
త్రుండిదు నన్ను ముంగుదుతు • రో! యమృతమ్ము విషమ్ము వోలెగా
కుండునె? యంగరక్ష తగ • దో, తనువస్థిర మో సుయోధనా!

వ. అని సమాధానమ్ము సెప్పి కృష్ణుండు కుంతీసదనమ్మున కరిగి ధర్మజాదుల నేమము తెలింగించి యూపె నూరార్చి విదురుగృహమ్మునకుం బోయిన విదురుండును సంభ్రమంబున నెదుర్కొని దేవోపచారంబుల నర్చించి కాంచన రత్నపాత్రమ్ముల భక్ష్యభోజ్యములు వడ్డింప జేసి పూల సురటితో విసరుచుండ బుండరీకాక్షుండు సాత్యకి సమేతంబుగ వింబారగించి తృప్తుండై నిత్యంబును బ్రాహ్మణసమారాధనం బాయింట జరుగునట్లు విదురునకు వరంబిడి యారేయి యయ్యెడ నిద్రించి ప్రభాతమ్మున మేల్కని తనకై వచ్చిన దుర్యోధనాదులం గలసి విదురుహస్తం బొక కేలను, సాత్యకిహస్తం బొక కేలను బట్టి రాజసభామధ్యంబున కరిగి తనకై యమర్చిన రత్నసింహాసనం బలంకరించి మేఘగంభీరంబగు నెలుంగొప్ప నాంది కేయున కిట్లనియె.

మోహన—రూపకము

ప॥ మానితసుచరిత్రా మా - మా, సత్యవతీపౌత్రా ॥మా॥
అ॥ ప॥ నేనీకురుపాండవులకు నేస్తము గూర్పగ వచ్చితి ॥మా॥

చరణము

1. తమ్ముని కొడుకులు నగపా - లిమ్మని కష్టపడ నేని
నెమ్మయి నై దూళ్ళేనియు - నిమ్మని కోరుదు వసింప ॥మా॥

2. పాలు నీరు గలసినట్లు - వారు వీరు గలసి పుడమి
నేలునట్లొనర్పు మిదియ - మేలు నీకు నము లుభయులు ॥మా॥

ఉ. పెంచితి తండ్రిలేని పసి ♦ పిల్లల, పెద్దల జేసితీవు, నే
ర్పించితి విల్లువిద్దియుల ద్రోణ ♦ తోడి బుత్రులతోడి పాటుగా
మంచితి వింతదన్క, నదు ♦ మ న్నిడనాకట నీకుధర్మమే ?
మంచికి జెడ్డ నన్నిటికి ♦ మామ! మఱెవ్వరు? నీవయేగదా!

ఉ. వారికి వీరి కెల్లరకు ♦ భారతవంశమునందు బెద్ద వీ
వారయ, ధర్మమెయ్యదియొ ♦ యట్లొనరింపుము పుణ్యపాపముల్
జేరును నిన్నె, యేరికెటు ♦ జెప్పగ నొంటు జెప్పకొమ్ము నీ
కీరితి నిల్పుకొమ్ముగన ♦ కేలను దిన్న నిత్రోవనుంచుమా.

ఉ. మంచితనంబెనూపుచు గు ♦ మారుల సేవనిపించెదో? స్వాంతం
త్రించెదవో? రొంకించుక యె ♦ దేనొక దారికి రమ్ము, కానిచో
మించును. కార్యమెట్లు నిక ♦ మీాదను లేదు ప్రయోజనమ్ము చిం
తించినగాని, సంధిపొన ♦ గింపవ పేని కులక్షయమ్ముగున్.

వ. మఱియు నో యాంబికేయా ! నీ యెఱుంగనివనులు లేవు. ఐనను, భారతాన్వయము ప్రియంబంద బందుగులకు హితంబు దెల్పవచ్చితి వినుము దుర్యోధనుం డాదిగాగల నీ తనయు లధర్మారంభులై స్వార్థపరత్వమున సంశమర్యాదల నతిక్రమించి మొదటినుండియు నకార్యాచరణమునకు వెనుదీయకుండిరి అట్టి మోరకులగు నీ కుమారుల నీవ మందలించి జగతింగల రాజన్యులందరు నీకు పాదాక్రాంతులుగా జతున్నమ్ముదపేలావలయితంబగు నీ ధరా మండలం బేలుటొప్పదే? ఇట్టియెడ నీ వుపేక్షాపరుండవగు నెడ కౌరవపాండవులకేగాక భూప్రపంచకెల్లం గీడువాటించిన దురితం బందెను. కౌరవపాండవులయుం దేరికి దుర్మరణమ్ము సంఘటిల్లి నను దుఃఖానుభవమ్ము నీకుగాదే ! సమానవిక్రమాఢ్యులగు వీరొండొరు లకారణమ్ముగ నిశితాశుగమ్ముల రూపుమాయుట సహింపనగునే! నీప్రాభవమ్మును నీతియు శాంతియు నెల్లరాజు

లుగాఁగడ నుభయపక్షమ్ముల రక్షించుకొనుము. నీవనుపునం బది రెండు వత్సరమ్ములు వనవాసమ్మును, నొక్కయే డజ్ఞాతమ్మును సలిపి యెల్లచుట్టమ్ములు నేడుగడయు నీవయని తలంచి ధర్మముగ నర్ధరాజ్య మర్థించుపాండవుల నందేశమ్మాలించి కులంబు పాడువడకుండ గాచుకొనుము. ధర్మంబు పాపంబునను, సత్య మనృతంబునను నశించునెడ దక్షు లుపేక్షించుట విలయమ్మునకు మూలము గాదే ? కాన వారి తండ్రి పాలు వారికిడి నీభాగ్యము నీవు సపుత్ర పౌత్రకమ్ముగ ననుభవింపు మెల్లరకు హితంబగు నిఖిల రాజన్యవరులలో నసమాన వైభవుం జేయుతలంపున ధర్మజుండు దిగ్విజయంబు సేయు ప్రాభవంబున కోర్వఁజాలక సుయోధనుండు సౌబలాదులం గూడుకొని కపటద్యూతంబు నెపంబున సర్వస్వము హరించి పై పెచ్చు సభామధ్యంబున పాంచాలి కట్టుపుట్టంబు లొలువ సద్దానికి నీ వోడఁబడుట ధర్మజుండు సహించె. సత్య సంరక్షకై భీమార్జునుల కోపాటోపమ్ము లుడిపి కంటసిరొత్తుకొని వనవాసమ్మున సమస్తక్లేశమ్ము లనుభవించియు బంధునాశంబునకు వెఱచి నన్నిట కంపిన సత్యప్రతిజ్ఞుం డగు యుధిష్ఠిరునట్లు లోభం బుడిగి సోదరసహితంబుగ ధర్మజు నిప్పుడ రావించి మీరును వారును బంచి కుడుచుట శ్రేయస్కరం బని పల్కు శ్రీకృష్ణుని వాఙ్నైపుణికి సదస్యులెల్లరు పులకాంకితశరీరులై యౌరా ! గోపాలుడింత యొప్ప పల్కునే ? యిట్టి నయ కోవిదుం డును, ధీరుండును నెందేని గలడే యనుచు సచమత్కృతులై యున్నత ధృతరాష్ట్రుండును వాసుదేవున కిట్లనియె.

ఉ. అంధుడనౌట భూవలయ ♦ మంతయు బాండునృపాలుడేలె గ
ర్వాంధులు నాకుమారు లివు ♦ డస్యాది యేలుచుండి, రెట్టిసం
బంధము లేదు రాజ్యపరి ♦ పాలనమందున నాకికేగతిన్
సంధిఘటింతు ? దూతవవు ♦ సర్వమెఱింగియు నన్ను నల్లుడా !

వ. అని పల్కు నమ్ముదుసలి వాచాకౌటిల్యమునకు వాసుదేవుం డేవగించుకొనుచు.

కన్నడ—అది

ప॥ నీమోపికకొలది చెప్పిచూడుము - నేడే నీకుటిలత విడనాడుము ॥నీ॥

అ॥ ప॥ మామోపాయము లింక సాగవో
మామా కార్యము బహుదుర్భరమా ॥నీ॥

చరణము

1. పెద్దవాడవనుచు బల్కు నానుడి - పెడచెవిబెట్టకుమా యగు నలజడి
పద్దుదీర్చివచ్చినపాండవులకు - ముద్దువచ్చినపుడెచంక కెక్కుము ॥నీ॥

2. రణమో, శుశ్రూషయో పాండవు - లోసరింపగ నున్నారు నీవల్ల
వెనుకముందు లరయుకున్న నీకుల - విధ్వంసము గాకుండదిప్పట్ల ॥నీ॥

ఉ. సూతుని మైత్రిచే దెగువ ♦ నూపుడు వచ్చిరి గాదె నీతనూ
జాతులు ? సాగెనిందనుక; ♦ సాగవు కర్ణుల వేవురన్ బలా
రాతిసుతుండె గూల్పగ గ ♦ లం, డతిమానుషతేజుడై పురా
రాతిని సైతముం గెలిచి ♦ లావు జూపడె యింత యేటికిన్.

వ. అనిన విని వైచిత్రవీర్యుండు సుయోధను నేరం బిలిచి,

సీ. కల్పాంతమగు వేళ ♦ గడలిలో వటపత్ర
శయనుడై నిద్రించు ♦ శాశ్వతుండు
భువనము ల్పదునాల్గు ♦ బొజ్జలో నిముడించి
పరిపాలనము సేయు ♦ భద్రమూర్తి
నిరత సంభవ జరా ♦ మరణ దుఃఖము లెవ్వి
యెఱుగని యోగీశ్వ ♦ రేశ్వరుండు
సనకాదిముని మనో ♦ జలజాముల నర్త
నము సేయు నచ్చిదా ♦ నందమూర్తి

తే. గీ. పాలమున్నీటిరా పట్టి ♦ వలచు మగడు
కమలభవు బొడ్డుతామరం ♦ గన్నవాడు
పార్థసారథి దూతయై ♦ వచ్చె నౌర !
చేరవకు బనిగల్గి కు ♦ మార ! నేడు

క. ఇచ్చెదో నగపా, లై దూ
ళ్ళిచ్చెదో? నీతో చిన్నట్టు • లిడి పంపుము, వి
వ్వచ్చుని గెలువగలాడని
మెచ్చకు మీకర్ణు, సంధి • మేలు, కుమారా!

వ. అనునంతలో గాంధారియు సుయోధనుం గని యిట్లనియె.

సీ. తొలుతనుండియు మన • కులమున నిలుచు రా
జ్యంబు కనిష్ఠకు • టుంబమందె
వినవో, యయాతినం • దనులలో జ్యేష్ఠుండు
యదుడు మదోన్మత్తు • డగుటజేసి
రాజయ్యె బూరు న • రపతి, దేవాపి బా
హ్లిక శంతనులలో మ • హీశుడయ్యె
శంతనుండాపై వి • శాంపతియయ్యె వి
చిత్రవీర్యుడు నదీ • పుత్రుడుండ

తే. గీ. కడగి నీజనకుని నము • కమున బాండు
నృపతి రాజ్యమ్ము సేయుటే • వెఱుగవో కొడుక?
ధర్మసుతుడు రాజగుటయే • తగును గాన
చెడక వారలతో సంధి • చేసికొనుము.

వ. అన విని దుర్యోధనుండు తలిదండ్రులం గని.

కాంభోజి—ఆది

ప॥ చెప్పదగిన వారలు గావుననిటు - చెప్పిరిచాలింపుడు మీధోరణి ॥చె॥
అ॥ప॥ ఒప్పుకొంటయైదూళ్ళిడ వారల - కోడినటుటులౌగాదేతలపగ ॥చె॥

చరణము

1. ఎటుగలియును నేడన్యోన్యమైత్రి - యిటపరస్పరాపకారులకు మా
కటకటమేగాని లోనిసగలు బ - యలిదెల్పుములుగాక మాకు వారికి ॥
2. ఊళ్లయిదింటి నొసంగుడంచు మా - యోపాయం బిటు పన్నిరేగాని
కల్లగాక నిజముగా దమకు భా - గంబున్నదనీగతి యాచింతురె ॥చె

తే. గీ. తమ్ముని కుమారులంచు బా • లిమ్మనెదవు
తమ్ముడగు పాండునరపతి, • దండధర న

మీర శస్త్రాస్త్రనులు తమ్ము ♦ లై రే? నీకు
చెప్పుకొనుటకు సైతము ♦ సిగ్గుగాదే?

చ. కలనయినం దలంపకుడు ♦ కయ్యమునన్ మము బాండవేయులే
గెలుతురటంచు, బెండ్లు మటు ♦ కిప్పుడజూచుచు నూరకుందురే?
బలముగలట్టి వారయిన ♦ బాపురె! వారికి మాకు సంధియా?
నలువురు నవ్వరే వినిన? ♦ నాకడ జెప్పకు మిట్టిమాటలన్.

శా. ఈకంసారివచించు మాటలకు నెం ♦ తేజంకుచున్నారు తం
డ్రీ! కర్ణుండును నేను నాయనుజులు ♦ న్నిల్వన్ రణంబందు ము
ల్లోకమ్ముల్ బయి నెత్తివచ్చినను ♦ గెల్తు, న్నమ్ము నామాట లీ
వాకౌంతేయులతోడి సంధివలన ♦ య్యా! నాకుమ్మాటికిన్

వ. అనవిని గాంధారి కుమారునింగని.

మం జ రు లు

విను జరాసంధ హిడింబ కీచక - భీమసేనులు నీ్నవున్
తనయా! యొక్కగురునికడను నహా - ధ్యాయులు మీ రేవురునున్
దురమున మీరొకనిచే దక్కన - ల్వురును జావగలరని
గురుడు మిమ్ము శపియించెనని వింటి - మఱి వడముడిచేత నని
బడ వీవొకడవె మిగిలియున్నావు - కడకు, నామాట వినుము
దుడుకుదనముమాని పాండవేయుల - తో సంధిజేసికొనుము.

క. అనిన సుయోధను డిట్లనె
జననీ! గురుశాప మొకట ♦ జరుగునయేనిన్
విను సంధిజేసినను త
ప్పనొకో చా, విట్లు పలుక ♦ బోలునె నీకున్?

వ. అనిపల్కు దుర్యోధనుకొఱగామికిం గటకటపడుచు భీష్మాది కుల
వృద్ధులును, ద్రోణాదిగురువృద్ధులును, నారదాదిమహర్షులును సంధి
కొడంబడుమని యెంతయును బోధింప వినకున్న సుయోధనుంగని
మధుసూదనుం డిట్లనియె.

హంసధ్వని—ఆది.

ప॥ తెలియనేరకున్నావు పాండవుల - బలిమి నేటిదనుక నో సుయోధన ॥తె॥

అ॥ప॥ గెలువజాలునొక్కొక్కడె వారిలో గలనవిలిచి పదునాల్గులోకముల॥

చరణము

ఓడింపడె మిమ్మెల్లర విజయుం - డుత్తరగోగ్రహణమునాడొక్కడె
తోడులేని క్రీడికోలది యట్టిది తోడ నేవచ్చెద నాలమునకు ॥తె॥

సీ. పడగపై గల గాలి ♦ కొడుకు చూపఱకెల్ల
భయసంభ్రమంబులు ♦ బాదుకొల్ప
పిడుగులుబడిన ట్లై ♦ వడి బిట్టు ధ్వనియించు
దిండిమ్ము గుండియల్ ♦ పెదర జేయ
తెలుపిలేకుండ గా ♦ డీవము చండాంబక
కాండము లురిసి చీ ♦ కాకుపఱుప
పాశుపతాది ది ♦ వ్యశరాగ్నికీలలు
తవిలి సైన్యాటవిం ♦ దగులబెట్ట

తే. గీ. తెల్లగుఱ్ఱాలు గూర్చిన ♦ తేరినుండి
దండముంగొని నేదోలు ♦ చుండ గ్రీడి
మొనల జెండాడుచున్న స ♦ ట్టిన మొఱలిడి
సంధికావలె నన్నను ♦ జక్కబడను.

ఉ. తమ్ముని బొమ్మ జీలిచి ప్ర ♦ థానుశమధ్యము డా బకారి ర
క్తమ్మును ద్రావునాడును, ప ♦ దంపడి నీతొడ లాజిలోన భ
గ్నమొనరించునాడు నొగి ♦ గావలె నన్నను సంధి గాదు, నీ
నమ్మిన కర్ణుడేమియును ♦ నర్వగజాలడు కౌరవేశ్వరా!

వ. అనిపల్కు మురారిం గని కోపగించుకొనుచు దుర్యోధనుండు దుశ్శాసన కర్ణ శకునులం గలసి సభనుండి తొలంగి చని దుర్మంత్రంబునకుం జొచ్చి కృష్ణుని బంధింప దలంచి పగ్గములంగొని యొకంతకు నోలగంబునకురా భీష్మ విదురాదు లెంతయు వారింప దలకొన్నను వినక దుష్కార్యమ్మున కుపక్రమింపబోవుసెడ గోవిందుండును మందహాసమ్మున గాంధారీనందనున కిట్లనియె.

మోహన—ఆది.

ప॥ ననుబంధించెదవా - దుర్యోధన ॥నను॥

అ॥ ప॥ ననుబంధింపగ నగు నా భక్తునకు, తెనటివి నీవీ చేతకు తగితివి

చ॥ నను భంజింప నెల్లనంసారబంధములు పటాపంచలై పోవు నన
పనికిమాలినట్టి నీచేతగల రజ్జువులా నన్ను బంధించునవి ॥నను॥

చరణము

భళిరా! యొక్కని జేసి నన్నిచట - బరిమార్పగ దలపోసినాడవా
తులువా నేడిక్కడ ననుకొంటివ - దురితఫలం బనుభవింప నుంటివ॥

చ॥ వలుగాకివి రాచవాడితోటాగవి - పనరంబవు నీతో నుడు లేటికి
కలవారింగూడుకొని రమ్మిక - గనువర్చెద గనుమీ నాతమాన ॥న॥

వ. అని పల్కుచు లీలామాత్రమ్ముగ నట్టహాస మొనర్చె.

సీ. ఫాలస్థలంబున బ్రహ్మ, ◆ వక్షమ్మున
నంబికాపతి, ముఖం ◆ బందు వహ్ని,
పార్శ్వంబుల మహేంద్ర ◆ పౌలస్త్య యమమారు
ద్విశ్వే లాదిత్యులు ◆ నశ్వినులును,
సవ్యదక్షిణ భుజ ◆ స్కంధమ్ముల హాల గాం
డీవ యుకులు బల ◆ దేవ నరులు,
వీపున నాయుధో ◆ పేతులై తెలుగు యు
ధిష్ఠిర భీమ మా ◆ ద్రీతనయులు.
అఖిలాస్త్రయుతపాణు ◆ లై యూరులనే యదు
వృష్ణి భోజాంధక ◆ వరులు
కరముల శంఖ చ ◆ క్ర గదానిశిత ఖడ్గ
శక్తి ప్రముఖ మహా ◆ సాధనములు
శ్రోత్ర నాసా నేత్ర ◆ సుషిరమ్ములను ధూమ
సహిత పావక శిఖా ◆ సంచయములు
ఘనరోమకూప మా ◆ ర్గమ్ముల బ్రభయార్క
సన్నిభ సత్ప్రభా ◆ సముదయములు

తే. గీ. గలిగి యెంతయు దుర్నిరీ ♦ క్ష్యమగు విశ్వ
రూపమును జూడనేరక ♦ లోచనములు
మోడ్చి యొకకట భయాన కా ♦ ద్భుతరసాంబు
నిధి సభాస్తారులెల్ల ము ♦ నింగి రంత

ఆ. వె. తనర నారదాది ♦ మునులకు సంజయ
భీష్మ కుంభజన్ము ♦ విదురులకును
వనజనాభు డిడియె ♦ దనవిశ్వరూపమ్ము
దేలిపొంగజూడ ♦ దివ్యదృష్టి.

తే. గీ. అమ్మహాసంతులం దెల్ల ♦ నాంబికేయు
డెఱిగి హరి విశ్వరూప వి ♦ జృంభణం బ
టంచు విశ్వేశు గనుగొన ♦ నభిలషింప
దేవదేవు డాతని కిడె ♦ దివ్యదృష్టి.

వ. అట్లు ధృతరాష్ట్రుండును శ్రీహరిం గని వినుతించి పరమేశ్వరుం జూచిన కన్నులతో నొండొద్దియుం జూడనొల్లక దివ్యదృష్టి నుపసంహరింపు మని కమలాక్షుని వేడ శ్రీకృష్ణుం డట్లొనర్చి తనవిశ్వరూపం బుప సంహరించి నారదాది మహర్షుల నంతర్ధానమ్ము నేయించి యెల్లరికడ సెలవంది సాత్యకిసమేతమ్ముగ బయనమ్మై పోవునెడ నాంబికేయుండు దీనవదనుండై యిట్లనియె.

నాదనామక్రియ - రూపకము

ప॥ నీసంకల్పమ్ము తెలియ - నేర దేరికైన గాని ॥నీ॥
అ॥ ప॥ వాసుదేవ నాకేగతి - వచ్చునో గదా నీకెఱుక ॥నీ॥

చరణము

మతులనూర్ధ్వగం గాంచితి - సురభోగముల నిర్మించితి
చితివిధి పాండవులచేత - జేయింతువో నాకు గడకు ॥నీ॥

ఉ. ఓపిన యంతవట్టుగ న ♦ యోక్తుల జెప్పితి నాలకింప రీ
పాపులు, ముందురానగు న ♦ పాయ మెఱుంగరు, పాండవేయులా!
సైపరు వీరి, నీవయిని ♦ సర్వము నీవొగి నిర్వహింపగా
నోపుదు వీవిపద్వ్యసధినుండి ♦ మఱందుల నొడ్డుజేర్పుమా!

క. అని పల్కి నంధన్యవు వీ
డ్కొని సర్వం బెఱుకపఱచి ♦ కుంతికి, కర్ణున్
దనయరదం బెక్కించుక
జనుచు రహస్యముగ బలికె ♦ సంప్రీతి మెయిన్.

శ్రీరాగము - ఆది

ప॥ సావధానముగ నాకర్ణింపుము - బావా నీకెఱిగింతురహస్యము ॥సా॥
అ॥ ప॥ యీ వుదయించితి వామార్తాండునికృపచే
గుంతికి కన్యప్రాయమున ॥సా॥

చరణము

1. రాధేయుండవుగావు పాండుభూ - రమణునకీ వగ్రతనూజుండవు
సోదరు లాధర్మజాదు లేవురు - సోదముగా! వారామోదింతురు॥
2. కుంతిచేత రవిచేత సాక్ష్య మి - ప్పింతు నీకు కౌంతేయుడ వీవని
యెంతయేని మేదినీవలయమే లింతు సార్వభౌమునిగా నొనర్చి ॥సా॥

సీ. అనమాన నిత్యాన ♦ త్యవ్రతరతుండు ధ
ర్మతనూభవుండు చా ♦ మరములిడగ
బలవిక్రమాతి వం ♦ పన్నుడా వాయునం
దనుడు సితాతప ♦ త్రమ్ము బట్ట
వివిధాస్త్రశస్త్రమ ♦ ర్మవిదగ్రణి కిరీటి
సారథియై రథా ♦ శ్వముల దోల
పాంచాల యాదవ ♦ పాండ్య మాత్స్యులు నేను
మినుముట్ట జయజయ ♦ ధ్వను లొనర్ప
తే. గీ. నలరి యభిమన్యు డంకమం ♦ దధివసింప
ధౌమ్యు డభిషేచనంపు మం ♦ త్రాలు సదువ
నీకు జరుగును పట్టాభి ♦ షేక మచట
గావునన్ ధర్మజాదుల ♦ కడకు రమ్ము.

క. అన్నులమిన్న, యయోనిజ,
వున్నెమ్ములప్రోవు, ద్రుపద ♦ పుత్రిక యనురా

గోన్నతిమై పెండిలి యగు
నిన్నువభర్తగాగ • నిజ మిది కర్ణా!

కేదారగౌళ — ఆది

ప॥ బావాయని పిల్చినయప్పుడే నీ - భావ మెఱింగితి నందనందనా ॥బా॥
అ॥ ప॥ నేవింటెసిరవిచేత, శచీజా - నికి గవచకుండలములిచ్చితాను ॥బా॥

చరణము

పెంచి పెద్దజేసిన తలిదండ్రుల - వంచించుట తగునే నాబోటికి
కొంచెపుమానిసియని కర్ణుబలికి వా - సించదే జగం బాచంద్రార్కము.

ఉ. నాదగు విక్రమక్రమము • నమ్మిగదా ధృతరాష్ట్రసూతి దా
యాదులతోడి కయ్యమున • కాయితమయ్యె దలంప నట్టి దు
ర్యోధను వీడి శాత్రవుల • లోబడుటన్నను నీచమున్నె? దా
మోదర! కర్ణమానసము • నూప దలంచి వచించినాడవో?

ఉ. నీదయచేతనే గెలువ • నేర్తురు పాండుకుమారు లాజి దు
ర్యోధనముఖ్యులన్, మది నె • ఱుంగుదు నయ్యది, ధర్మసూనుడే
గాదగు తేను, ధర్మమెట • గల్గెనొ గల్గు నటన్ జయమ్ము, దా
మోదర! భూభరమ్ముపడువ • నోపుదుమీగతి సూత్రధారివై.

చ. తెలుపకు మీరహస్యము యు • ధిష్ఠిరభూపతి కీవు, కృష్ణ! య
య్యలఘున కన్న నౌదునని • యాతడెఱింగిన నంతరాయముల్
జెలగును నీకు నాకు, దయ • నేయుము నాకిదియే వరమ్ముగా
సెలవిడు మింకబోయెద, న • శేషజగజ్జనవంద్య! కేశవా!

వ. అనిపల్కి కర్ణుండు గోపాలుని వీడ్కొని యనుష్ఠానార్థంబు భాగీ
రథికిం జన నయ్యెడ కుంతి యేకాంతముగా నతని వచనవృత్తాం
తం బెఱుకపఱచి ధర్మజానుజులం గలియుమను నాకానీనుం డిట్లనియె.

సింహేంద్రమధ్యమము — రూపకము

ప॥ ఇందులకా పనిగట్టుక - యింతదూరగ మేతెంచితి ॥ఇం॥

అ॥ ప॥ నందనుడను ప్రేముడియు - న్నం జెప్పవే? యింతదనుక ॥నం॥

చ ర ణ ము

1. రక్కసిచేత ఘటించితి - వొక్కట కన్నకుమారుని
   యక్కటికము లేక గంగ - కర్పించిన గొడ్డురాల ॥ఇం॥

2. జాతిచెడియె నీకతమున - సూతధర్మము లాంచితి
   నీతి తెలుచుకొమ్మనుచు - నీ యుపదేశము చాలు ॥ఇం॥

ఉ. కన్నులుసైతముం దెఱువ • గా నవశస్థితినున్న కూననా
   నన్నటు గంగలో గలిపి • పాపము ప్రేముడిజూడ వచ్చి తీ
   తెన్నున నేటికిం, గడుపు • తీపియెఱుంగని నీకు బుట్టుటన్
   వన్నియు వాసి లేక తల • వంచుక గ్రుమ్మరనయ్యె కర్ణుడున్!

ఉ. పాతకమేమొ? నీదు చను • బాలకు నోచని నేను నీతనూ
   జాతుల పాలుపంపులకు • సైతము నోచెద నెట్లు? కర్ణుడే
   జాతికి చెందబోని కుల • వంకరు డయ్యెను నీకతాన నా
   రా! తలవంపుమారి బ్రతు • కయ్యెగదా రవిగన్నవానికిన్?

ఉ. కొడుకు లపణ్యము లనగ • గూటికి గుడ్డకు మోమువాచియుం
   జెడి పగవారికొంపలకు • జేరితి, వంతియెగాని చెప్ప వె
   న్నడిదు; యుధిష్ఠిరాదులకు • నావలనం గలనం బ్రమాద మె
   క్కడి ఘటియించునో యనియె • గా! యిటువచ్చితి నమ్మఅల్పగన్.

ఉ. దోనమటంచు నుంతయును • దోచక గన్నకుమారు గంగపా
   ల్జేసినదానికిన్ గడన • నీమ సహోదరులన్ వధించు
   దోనమటంచు నీమదికి • దోచెన, యేమిటులైనగాని నం
   జాసితసద్వ్రతమ్ము గొన • స్వామిఋణమ్మునె తీర్ప నెంచితిన్.

క. విను ధర్మజ యింతకు నా
జననరహస్యమ్ము దెలుప • జనకుము, రాధే
యుని పూతజీవితము జెఱ
చినపాపము గాక నీకు • జెందు గదమ్మా!

జలముల ద్రోయగాబడి వె • నక్ జనయిత్రికిగూడ భారమై
నలువురజుల్కనౌటకు మ • నంబున గుందను, పెంచి పెద్దగా
నలిపిన రాధ, నంగవిభు • నల్పు సదా మనసిచ్చి మిత్రుడై
యలరు సుయోధనుం బ్రము • ద మందగ జేయగ నుందు కై వడిన్.

అని పల్కి కర్ణుండు దక్కిన నీకొమరులు యుద్ధమ్మున నాచేజిక్కినను జంపనని పల్కి కుంతికి నమస్కరించి వీడ్కొని నిజ నివాసమ్మున కరిగె నట శ్రీకృష్ణుండును గౌరవసభావిశేషమ్ముల ధర్మజాదుల కెఱిగించి రణోత్సాహులం జేసి ధృష్టద్యుమ్ముని సేనానాయకుం బొనర్చి ద్రుపద విరాట సాత్యకి ప్రముఖుల దండనాథులగా నొనర్చి యుద్ధభేరి మ్రోయించె నంత పాండవులు మంగళతూర్యారావమ్ము లెనగ నాంగికమాంగల్యసూచకంబులు సేకొనుచు సైన్యసమేతమ్ముగ కురుక్షేత్రంబుం దఱియంజొచ్చి హిరణ్వతీనదీతీరమ్మున స్కంధావారంబు లేర్పఱచుకొని యందు విడిసిరి. కౌరవులును సైన్యసమేతమ్ముగ నా కురుక్షేత్రమునకుం జేరి యొక్క రమణీయ ప్రదేశమ్మున విడిసిరి.

శ్రీ

# మహాభారతము

## చక్రధారణము

ఆనందభైరవి — ఖండగతి

ప॥ చక్రధారణకథా - శ్రవణమే సార్థకము
జనసమందిరయందుకు...నఘానదులార ॥చ॥

అ॥ప॥ విక్రమానూను డమ - రాఘగానూనుడు
త్రివిక్రము ప్రతిజ్ఞా వి - భంగుజేసిన మహా ॥చ॥

చరణము

గాంగేయు నాధిపత్యమున కౌరవసేన -
కదనమేదిని నిల్చెను - యుద్ధసన్నాహమున
సంగరారంభులై - సైన్యాధిపతిగ పా
ర్థుని గావించి ని - ల్చిరి పాండునందనులు ॥చ॥

సీ. తన్నర్థరథు జేసె ♦ నన్న రోసమున రా
ధేయుండు భాగీర ♦ థీసుతుండు
దురమునం బడుదాక ♦ శరశరాసనముల
జేముట్టనని బాసజేసె ♦ గినిసి ;
సమరమం జేయెడం ♦ జనియించినం గాని
యస్త్రసంఘాతమ్ము ♦ నందకుండ
సంజయుం గదుణించి ♦ సాత్యవతేయుండు
నిలిపె యుద్ధవిశేష ♦ ముల దెలుపగ

తే. గీ. నాంబికేయుని సౌజన్య మ ♦ నన్యసామాన్య
ధర్మజుం డాయుధంబు లర ♦ దించన బెటి
చేతులు మొగిడ్చి భీష్ముని ♦ చెంత కేగు
చుంట గని సోదరుల్ వెంట ♦ నంటి చనిరి.

బిలహరి - ఆది

ప॥ అన్నా! పోదువిదేమివిపరీతమోగుమాగు మెందేగదలంచితి ॥అన్నా॥
అ॥ ప॥ వెన్నునూవు వెన్నడు మనకులమున
నున్నె? రాచరికంపు ధర్మమే ॥అన్నా॥

చరణము

తాతకుభీతిల్లితివో, ధన్విప - తంసగురుని విఖ్యాతి కోడితివో?
గౌతమునకు వెఱచితివో? ద్రోణిగని -
కంపించితివో కల తెఱఁగు చెప్పుమన్నా॥

ఉ. కౌరవసేనగాదు త్రిజ ♦ గమ్ముల్లెం బెబకుగాక పోరిలో
శూరతమై జయింపగల ♦ జోదులు నీయనుజన్ము; లేటికిన్
ధీరత గోలుపోవ? నల ♦ తిం గనరే? నగరే విరోధు లీ
తీరు దలంచి, శోకిని ♦ దెచ్చెదనే తలపంపు? లగ్రజా!

సీ. పదరానిబన్నము ♦ ల్పాసిన పాంచాలి విం
తట దిక్కుమాలిన ♦ దాని జేసి
భువనమ్ములేలు త ♦ మ్ముల పాహువీర్యసం
పదలబ్టి తుద ముట్టు ♦ సమ్మెనర్చి
సాయమై వచ్చిన ♦ సకల దేశాధీశ
పాళి కెంతయు దల ♦ వంపుగూర్చి
కడలెల్ల పేర్వాసి ♦ గాంచిన భరతాన్వ
యపు గౌరవము మొద ♦ లంట జెఱచి

తే. గీ. చనెదవా పరిపోవ భా ♦ జనముగాగ?
పాఱిపోతుదనమ్ము నా ♦ ప మనయింటి

కుక్కలకునైన లేదు, ర • మ్మెక్కుమా ర
థమ్ము; లెగటార్పుమన్న ! శా • త్రివచయమ్ము.

చ. అనవిని నూడుపల్కన యు • మాత్మజుడేగు నెడన్ మురాంతకుం
డని కనుగొంటి నీఘనుని • [illegible] గురు వృద్ధ వీరుల
న్గని ప్రణమిల్లి [illegible] • [illegible] నటంచు, ధర్మనం
దనుడును [illegible] • [illegible] జుట్లనున్.

శ్రీరాగము - ఆది

ప॥ తే నమోస్తు గాంగేయాయ, జగత్త్రితయగేయాయ పితామహాయ

అ॥ప॥ మానితాంఘ్రి [illegible], [illegible] మర్దనాయ, నత్యవ్రతాయ భవతే

చ ర ణ ము

సకలాశ్రిత రక్షణధురీణాయ - సమర [illegible] భార్గవ రామాయ
ప్రకట చాపకళావిశారదాయ - భరతాన్వయ దీపాయ భీష్మాయ॥ తే॥

చ. ప్రియమున దండ్రికిదెలిపి పసి • బిడ్డల బెంచితి పెంతదన్క వి
ద్దియ లెఱిగించి మించితివి • తిన్నగ బెద్దలజేసినాడ వ
న్వయమునబుట్టి నేటికి ర • ణం, బటుగావున నీయనుజ్ఞ నే
గయికొన వచ్చినాడ నన • ఘా ! నిను మార్కొని పోరొనర్పగన్.

ఉ. తాతవు, మేము మన్మలము, • తప్పక వచ్చె రణమ్మనేని, నీ
చేతను దీవనల్వడని • శ్రీఘను గెల్వ రిపువ్రజమ్ము నీ
వాతెఱ గట్టిదాను, పగ • వారము కాముగదా ? నమాను లీ
జ్ఞాతులు, పోరిలో జయము • గాంచగ దీవనలిచ్చి పంపుమా !

వ. అన విని గాంగేయుండు ధర్మనందనుం గని.

క. వచ్చితివి నీకు మేలగు
నచ్చిన మనుమడవు నాయ • నా ! రాకున్నం
జెచ్చెర శపించిచంపుదు,
నచ్చపు ప్రేముడిని వేడు • మా వరమిత్తున్.

వ. అనిన ధర్మజుండు.

చ. వలసెడిదేమి? సర్వము భ ◆ వత్కరుణాంచితన్ లభించు, నీ
వలఘు పరాక్రమక్రమము, ◆ వాయుపుత్రముఖాదిన వాడెవాక వి
గ్గలన నెదుర్చువా డెవడు? ◆ గావున వేసుట దేమి? పోర ని
గ్గెలుచు నుపాయమేమొ యెఱిం ◆ గింపుము నాకిపుడో పితామహా!

వ. అనిన విని భీష్ముండు సస్మితాస్యుండగుచు ధర్మజుంగని నాయనా! నాచేత నాయుధం బున్నంతదనుక రుద్రునకేని వధింప సాధ్యంబుగా దిప్పటి కేగుము. క్రమ్మఱ నే తెలుపుదు ప్రాతఃకాలమున. ధర్మపుత్రుండు ప్రణమిల్లి వీడ్కొని ద్రోణుని పాలికిం జని

శ్రీరంజని—రూపకము

ప॥ గురువరేణ్య! యిదే శిష్య - పరమాణువు ప్రణమిల్లెను ॥గురు॥

అ॥ ప॥ కరుణ నన్ను గాచి జయము - గల్గునట్లు దీవింపుడు ॥గురు॥

చరణము

1. మీపై జూపగనాయెను - మీరొసగ నేర్పిన విద్యల
సైపందగు నీ యెడ యప - చారము వీరాగ్రగణ్య ॥గురు॥

2 సురలకేని నిన్నెదుర్చ - నెంతయు సాధ్యము కాదన
నరమాత్రుల మేగతి నిలు - వరింపగలమో తెల్పుము ॥గురు॥

చ. తనయునికన్న నెక్కుడుగ ◆ దద్దయు బ్రేముడి మమ్ముజూచి తీ
వనఘ! కృతఘ్నత న్నెయివు ◆ మాశయమెట్లని నిన్ జయింప మే
మన నొకపాటివారమె? ద ◆ యామతి నాకెఱిగింపు మేగతిం
బనివడి నిన్ను గెల్వగల ◆ భారమొ? తెలిపి గెల్వనేర్తుమే?

వ. అన విని శరగురుండు యానందించి,

ఉ. మంతిరిమై మఱిదియాయు ◆ మాధవుడే పెనుప్రాపుగాగ, మ
మ్మింతగ వేడనేటికి? జ ◆ యింతువు నీవ, సమస్తమేదినీ
కాంతుడవై చెలంగుదు వ ◆ ఖండరమావిభవమ్ములార నీ
వంతున కేర్పడెన్ జయము ◆ వశ్యము మేమెన రెంత పోరినన్.

తే. గీ. కాదు నిటలాక్షునకును న ◆ న్గెలనగెల్వ
వినుము! వినరానిమాటను ◆ వింటినేని
యస్త్రసన్న్యాసమొనరింతు ◆ నద్దిపల్కు-
వాడు సత్యవ్రతుండు గా ◆ వలయునయ్య!

వ. అనవిని కౌంతేయాగ్రజుండు సంతసించి కృపుడు చిరంజీవి యగుట వధ్యుండు గామి, యాతనికడ సెలవంది శల్యుని యనుజ్ఞ వడసి, కౌరవసేనం దేటిపాటిజూచి సేనాపతుల్మన యుద్ధము సేయనెంచు వారిందెవరే నుండిన రండు. వారిని నాతమ్ములట్లం జూచుకొందు నని పలుక నిజసేనాసమేతమ్ముగ యుయుత్సుండు ధర్మనందను బలమ్ములం గలసె నంతలో శ్రీకృష్ణుండు కర్ణునికడకుం జని,

సరస్వతి—ఆది

ప॥ పార్థసముని నిన్నా గాంగేయుం - డర్ధరథు జేసెనా - రాధేయా॥పా॥
అ॥ ప॥ వ్యర్థమనోరథు జేసినీకు తల - వంపుదెచ్చెనే నిపుడువిన్నాడా॥పా॥

చరణము

దీన నీకు లోటేమియును లేదు - గాని లోకువగుదు మెల్లరకును
మానధనుడవిదిచాలదా నీకు - మార్గమొకటె తెలిపెద నాలింపుము॥పా॥

చ. అతనికి నీకు గయ్యమగు ◆ నన్న సమంచితమౌను, జాహ్నవీ
సుతుడు గతించుజాడ నిజ ◆ సోదరపక్షమునందు నిల్వు మీ
గతిపగ దీర్చుకొమ్మదియు ◆ గాక సహాయమొనర్చినట్లగున్
హితమతి, పాండవేయుల, కి ◆ దేతటి సౌభ్రాత్రఋణమ్ము దీర్చగన్.

వ. అనిన విని కర్ణుండు నెమ్మనంబున,

శా. ఏ నాభీష్ముని చేత గూలదొసటకొంటినో? కా ◆ దేవిన్ నదీనందనుం
డే నాచేబడుటో తటస్థముగ నె ◆ ల్లేసిరి సమాధానమే
యూహా నీమాయలమురారి కృష్ణునకు న ◆ స్నవ్యక్తిగా నెంచెనో!
కానిమ్మాతని మాయలో బడుటకుం ◆ గర్ణుండు మూఢుండొకో!

వ. అనితలంచి వాసుదేవున కిట్లనియె.

యువల దుచ్చ్రపెరుగు ... ◆ జన్మ సుభోగముల కాన
గొనుకన్న బిడ్డప్రు ◆ గూకుమేలు
కులనాశనము సేయు ◆ కులధర్మముల డంగు
కులధర్మ హీనులై ◆ కుమురు నరక
కూపమ్ములకు; నిట్టి ◆ క్రూరకర్మ మొనర్చ
సమ్మతింపదు నామ ◆ నమ్ము కృష్ణ!

తే. గీ. అని విషాదమ్ము గదురాయు ◆ నమ్ము పడగ
బాణబాణాసనమ్ముల ◆ నవ్వదలి కంటి
నీరు దొరగ రథమ్మునం ◆ గూరుచున్న
వాసవకుమారుతో శౌరి ◆ పలికె నిట్లు

ఉ. శూరులు నవ్వరో కొడుకు నిను ◆ జూచి ధనంజయ! సద్వివేకివై
పోరిజయమ్ము గాంచి, యశ ◆ మున్ గడియింపుము నిత్యుడాత్ముడ
ప్పూరుషు జావుపుట్టుకలు ◆ బొందవు నీవు నిమిత్తమాత్రమై
వైరులు గూల్పు వీర్యమతిన ◆ పాపము నొందదు నిన్ను ఫల్గునా!

వ. అని పల్కుచు తత్త్వజ్ఞానోపదేశంబు సేయం దలంచి యిట్లనియె.

ఆనందభైరవి — చతురశ్రగతి

ప॥ వినరా తెలియగ వివరించెద నీ - కాత్మబోధ పార్థా పార్థా ॥వినరా॥

అ॥ప॥ తనువులు బుద్బుదములపోలిక నిత్యములుగావు నిజమాత్ముడు నిత్యుడు

చరణము

1. తెలుపను చెడదీపురుషుడున్నది - పురుషోత్తముడే నై తెలుపింతును
తెలియుము నీవు చెడుదురు శాత్రవులని - చింతింపకుమోయి ధనంజయ!
2. రణము క్షత్రియ ధర్మము రాజులకును - గణనీయము మోక్షప్రదమ్మగు
అనుమానింపక ఱెమ్మనమ్మున - మొనరింపుము మేలో నీవీరాగ్రణి॥

సీ. అవ్యక్తరూపుడ ◆ నై వ్యాపకంబు గా
రము వోలె నఖిలభూ ◆ తముల నుందు
జగములన్నిటికి బీ ◆ జము మదీయాంశము
నన్నెఱుంగుట మొ జ్ఞా ◆ నం బనబడు

నా నిర్మితము కర్మ ♦ గాన తత్ఫలకాంక్ష
నెడసి నాయందె క ♦ ర్మార్పణముంచి
యనహంకృతియు నిస్పృ ♦ హత్వమ్ముగలిగి గ
ర్వోపహతి సమబుద్ధి ♦ నుండువాని

తే. గీ. కే విచారమ్ము నందదో ♦ యూ కిరీటి!
వివిధకర్మఫలమ్ము ల ♦ ర్పించి నాక,
నను శరణుబొందు, మట్లేని ♦ నిను సమస్త
పాపములనుండి తొలగించు ♦ వాఁడ నెమ్మి

వ. ఇట్లు పల్కుచు వివిధప్రకారంబుల సంశయం బడిగిన వానికెల్ల సదుత్తరంబు లిడి యింకను మనసు కిసటువాయకున్నం గని విశ్వరూప ప్రదర్శనం బొనర్పం దలంచి సవ్యసాచికి దివ్యచక్షుర్జన బొనర్చి,

సీ. తనయందు దేవగం ♦ ధర్వాది ముఖ్యులౌ
సచరాచరం బెల్ల ♦ జగము దోఁప
మకుట కేయూరాది ♦ మకరాంక భూషణ రాజి
తనర చక్రాద్యాయుధ ♦ ధనువులు వెలుఁగ
రవి సోము లక్షులై ♦ దివ్యగంధాలంకా
రంబులై మీఱ సం ♦ ఖ్యంబు లలర
నారదాదిమునీంద్ర ♦ వారమ్ము తనుజుట్టి
ప్రస్తుతించుచు బరా ♦ బరులుసేయ

తే. గీ. భూ నభో దిగ్దిగంతర ♦ మ్ముల దనొప్పి
పావకజ్వాల లోకట వె ♦ ల్వడు నిజాస్య
గహ్వరమ్ముల భీష్మాది ♦ ఘనులు సొఱఁగ
విశ్వరూపమ్ము జూపె నా ♦ విజయునకును.

వ. అట్లు చూపి వెఱఁగంది ప్రస్తుతించుచు నిలిచిన బలారికుమారుంగని,

శా. నే లోకత్రయ కర్తనౌ యమితశక్తుం ♦ డ శ్రీనందనా! యెల్లర
న్నాలోఁ జేరుచుకొందు భీష్మముఖు లీ ♦ నాచేతనే చత్తు రీ

లీలన్నీవు నిమిత్తమాత్రుండవునై ● తె మ్మాజి గెల్పింపు మిం
కేలా జాలము? గెల్పునీకె కపటము ● యీవాదము పర్జునా!

వ. అని పల్కి వ్యాసయనంచుత సూక్తిని ధరిషుం జ్ఞానోపదేశం బొనర్చి విశ్వరూపంబు ప్రసంహరించి, విజయుని సమరోత్సాహం గావించి నంత యుద్ధప్రారంభమగుటయు సింహనాదంబులకు దోడు శంఖరావమ్ములు చెలంగ నుభయసైన్యంబులు వివిధవ్యూహంబు లం బన్నుకొని యుద్ధపడించి పోరాడునెడ సముద్దండవేదండతుండ శీకరతురంగలాలాజాల రక్తధారాపరిషిక్తంబై సంగ్రామ ధరణీరజం బడంగ నసంఖ్యాక బాణపాతంబున సూర్యబింబము మఱుగై చీకట్లు గ్రమ్మ, ధర్మభీమార్జున నకుల సహదేవ ధృష్టద్యుమ్న ఘటోత్కచాభిమన్యు ద్రౌపదేయాదులును భీష్మద్రోణకృపాశ్వత్థామదుర్యోధన దుశ్శాసనాదులును తమతమ బలంబులం బురికొల్పుకొనుచు ఘోరమ్ముగ బోరాడుచుండ నుత్తరుండు మున్నగువా రెందరో లెక్కకు మిగిలి వీరస్వర్గ మలంకరించుచుండ నడుమ నడుమ భీష్ముండు విజృంభించి పాండవసైన్యాటవి పై బడి కాల్చిచ్చు మచ్చునం దగులం బెట్టుచు నేరికిం దేఱిచూడరాక చిత్రగతుల యుద్ధంబుసేయుచు మూడవనాటి యుద్ధంబున గోటిసూర్యప్రభా భాసమానుండై ప్రళయరుద్రుండన నరవీరుల జిందరవందరసేయుచు కృష్ణార్జునులపై బెడిదమ్ములగు బాణమ్ములం గురియించుచు బిట్టలయించుచున్నంత జనార్దనుండు తలంచినంత మాత్రమ్మున సన్నిహితంబైన సుదర్శన చక్రమ్మును దక్షిణకరంబున సమర్చి పగ్గంబుల నొగల ముడిచి,

కల్యాణి—ఆది

ప॥ నగధరుండు స్యందనము పైనుండి-యుఱికి ధరకు గుప్పించి లంఘించె॥
అ॥ గగన భాగమెల్ల స్వీయకుండల - కాంతిపుంజ మెంతేనిగప్పికొన॥
1. అవనియెల్ల గంపింప - లలిత పీతాంబరంబు చెఱగు దూలియాడగ
నవిరళముగ నుద్యోతస్సుదర్శనవర - భానుగరోచులు తుఱంగలింపగా ॥ప॥

2. పులిగన్న లేళ్ళగములపోలె క్షత్రభూపాలకులు ద్వేష్ములై నూడ
వెలవెలబడవిజయుండు చేష్టలు దక్కి మిన్నకుండెదయమసింపాలుండై!

మ. నను వృద్ధుండగు వానిగా దలచి యేనాన్నేమొ? చాలింపుమొ
క్కనిమేషమ్మున చక్రధాత వధియింపన్ జేతునన్నన్ సుయో
ధను ద్రోణాదుల నెల్ల సైనికుల నా ♦ ధర్మమ్మునన్, ధర్మనం
దను నేడే యభిషిక్తు జేయుదు మహేం ♦ ద్ర ప్రాభవంబేర్పడన్.

తే. గీ. జనకు డొకసేళసీకు స్వే ♦ చ్ఛామరణ మొ
సంగెనుగదా యటంచు లో ♦ బొంగదేమొ
సంతసింపకుమీ సుద ♦ ర్శన రథాంగ
మిపుడ నీపని దీర్చు మి ♦ న్నిటికొదుక!

వ. అనిన విని శాంతనవుండు చేతులు జోడించి దేవా! లీలామానుష విగ్రహా!

శుద్ధసావేరి—ఆది

ప॥ అంతకన్నపలసినదేమున్నది-యచ్యుతానుగ్రహితార్థునింజేయు ॥అం॥
అ॥ప॥ యెంతవారికి లభించు నిన్నిసే-వలెంతగాని నదలించికడతేరు ॥యెం॥

చరణము

వీరమాతయను యశము దెనఁ భాగీరథీదేవి నాతల్లి నేను
నారాయణ! శంతనుభూపతి మోహితముపుత్రవంతుడయ్యెనీనాడు ॥అ॥

గీతమాలిక

అట్లుజమదగ్ని నందను - నాశ్రయించి
నేర్చినట్టి నా యీ ధను - ర్నిగమమెల్ల
భువన విఖ్యాతమయ్యె, నా - భవము పావ
నత గనెన్, నద్యశమ్ము మి - న్నంటె కృష్ణ!
ధర్మమూలకమైన వే - ద ప్రపంచ
మందు తెలియందగిన వాడ - వౌదు వీవు
విజయునకు విజయమ్ము గ - ల్పింప దలచి
సమర మొనరింపనని ప్రతి - జ్ఞం బొనర్చి

నాకసేనాని యుద్ధమ్ము - సల్పు తలపు
వరలఁజూచో నీకు విశ్వరూ - పప్రదర్శ
నమ్ముతోడ భారతసంగ - రమ్ము సాగియు
వలసినదిః యమసేత కు - ప్రక్రమించు
ఇంతయు మదీయశౌర్య వి - క్రాంతి కోకట
నోపాటించు ధనంజయు - బాహుబలము
బలియు బుగిఁ గెల్చుటకు బన్ను - పన్నుగడయొ!
వనజనాభుండుదక్క శాం - తనవు గెలువ
జాలు విల్కాఁడు లేడు ము - జ్జగములందు
టన్న సద్యశము గూర్చ - నభిమతంబో?
శిష్టరక్షణమును దుష్ట - శిక్షణమ్ము
నీవనులు గాన నే నని - నీతుఁడైన
కౌరవేంద్రుడు పక్షమ్మున - గయ్యమాడు
కారణమ్మున దుష్టుని - గా దలంచి
చంప నెంచితొ సుద - ర్శనము విడిచి
రిత నాకుఁ డ నాకర - ము తలంచి
నెమ్మి సన్ను నీలోఁ గల్పు - కొమ్ము సంత!
అవ్యయానంద! గోవింద! - హరి! ముకుంద!

వ. అట్లు పలుకుచున్నంతలో నర్జునుండు రథంబు డిగ్గనుఱికి దీర్ఘబాహువుల నాచినచక్రంభ దుం గ్రుచ్చిపట్టి రణావేశంబున ముందునకుం బోవ నుంకించు గోపాలుని నీడిగిలంబడి నిలువంబెట్టి యిట్లనియె.

యమునాకళ్యాణి—ఆది

ప॥ కరుణానిధి కాంతిః పంక్తి దే-యాకయ్యమాడు సంరంభ ముడిగివడి॥
అ॥ప॥ హారినీవేగ మొలరించినచో-నాగునె యాపదునాల్గులోకములు॥

చరణము

గీతల్సెప్పితి వందులకా - భూనేతల్నవ్వగ బాలునేయుటకా ॥గీ॥
చేతులోడ్చి నమస్కరించు నాఖ్యాతిన్నిల్పుము పొల్లునేయకుము॥

ఉ. తాతయు మన్మథున్ సమర ♦ ధారుణి నోర్చుటతీపు నీవయే
చూతువు గాక లెమ్ము మధు ♦ సూదన! నీవిటు విక్రమించుటల్
నీతియె? కాక వల్కొగను ♦ నే దలయెత్తగ నేర్తునే? యప
ఖ్యాతిగడించి యీవిజయు ♦ డన్న మొగంబెటుజూచు నచ్యుతా!

చ. అరివిజయమ్ము పట్టున నొ ♦ కప్పుడు గొంటొకొ హెచ్చుతగ్గు లీ
వరుసఘటించు టేటికి నన్ ♦ భావము గాదొకొ యంతమాత్రనే
దురమొనరింప బూనితివి ♦ తోయజనాభ! యిదేమినాయమో
యురయుము, సాత్యకిం దునిమి ♦ నల్లిన మున్కొన కేగితేనియున్.

వ. అని పల్కు సవ్యసాచి సమయజ్ఞతా పరిజ్ఞానమునకు శౌరి సంత
సించి యతనికి బ్రియమ్ముగా నిట్లనియె

ఉ. అతడు నీవునున్ సముడె ♦ యందుల కేనెవ్వ డొప్పుకొందు, నీ
తాతగదా యటన్న దయ ♦ దాల్చెద, వంతగ, నొవ్వగొట్టవీ,
వాతడు నీవయిన్నె యవ ♦ డెక్కటి, యిట్టుగాన జక్రముం
జేతధరింపగా వలసె ♦ నీయెన దేటిక నూరకుంటివో?

వ. అన విని యర్జునుండు,

శా. ఈయుత్కృష్టులు నే నెఱుంగనివి కా ♦ వే నాడవ క్షేత్రమో
నేయుద్ధం బొనరింప గొంకుటయు నేన్ ♦ నీ గీత బోధించి నీ
వా యజ్ఞానము వాపుటల్ గడచె నా ♦ కాలాటి కారుణ్యమే
పోయెం దావక విక్రమస్ఫురణమే ♦ పోల్కిన్ సమర్థింతువో.

ఉ. చిన్నతనంబునందు చెయి ♦ జేతుల నెత్తి యొంటసుము మా
యన్నలదమ్ములన్ బెనిచె ♦ నందఱ గాచిన నొక్కటేళ మా
యున్నతి గోరు నీతనికి ♦ నుంతన నుండగవచ్చుబేర్చె, నా
కెన్నగలేదు భీష్ముని ప ♦ యిన్ దయ నిక్కము దాపనేటికిన్?

వ. అనిపల్కి గోపాలు నొగలెక్కించి దేవదత్తంబొత్తి భీష్మాదులగ్గింప
సవ్యసాచి సమరనైపుణిం జూపె.

శ్రీ

# మహాభారతము

## భీష్మపతనము

హంసధ్వని - రూపకము

ప॥ వినుడు భీష్మపతనకథా - విశేష మెఱిగింతు మీకు ॥విను॥

అ॥ ప॥ ఘనమైన భారత మ్మిందు - వీనులకుం జేయు విందు ॥విను॥

చరణము

జనకునకై యతడు బ్రహ్మ - చర్యవ్రతి మూని
తనునమ్మిన దుర్యోధను - నెరవు కయ్యమాడబూని॥

సీ. తనదు తాటిసిడంబు ♦ తళతళ మెఱయ నా
ల్గవనాటి రణమున ♦ గంగకొడుకు
ద్రోణశారద్వతు ♦ లిరు సూడుకొని పార్థు
పైఁ బడుచుండ సౌ ♦ భద్రుఁడు దఱిగి
తన్నడ్డి పోరుచో ♦ దున్నగాసక కౌంత
వడికి శాసనపాత్రు ♦ గడచి సవ్య
సాచితో డీకొని ♦ సమరం బొనర్ప ని
వ్వెఱపడి చూచి రె ♦ ల్లరు నిరుదెసల

తే. గీ. ద్రౌణి భూరిశ్రవులు శల్య ♦ తనయు చిత్ర
సేను లొకపెట్ట నభిమన్యు ♦ పైని బడగ,
నగుచు గురుపుత్రు నురమేసి, ♦ నటికి చిత్ర
సేనుధనువు, భూరిశ్రవు ♦ సిడము ద్రుంచె.

వ. అట్లు పెక్కండ్రతో బోరాడు కుమారుం గని విజయుం డార్చి వారిపై జాఱుకుటమ్ములం గుఱియునో గురు కృప శల్య కృతవర్మాదులును కేకయులును ముప్పదేనువేల రథమ్ములతో ద్రిగర్తలును గవిసి సౌభద్రుం బొదువ నయ్యెడ గని ధృష్టద్యుమ్నుండు శౌర్యోద్రేకమ్మున దిసింద ననుదెంచి నారిం దాకి పోరుచు శల్యతనయుం గూర్చి శల్యునితో యుద్ధముసేయుచుండ నంతలో దనకు తోడువచ్చిన పిన్నతండ్రులం గని సౌభద్రుండు దఱికల్పరూపుడై శాత్రవులం గూల్చుచుండె నట్టియెడ గదసారించుచు దీవ్రకోపుండై భీమసేనుండు కురుసైన్యంబుపై బడి నురుమాడుచు కదనోర్విం బీనుంగుపెంట గావించుచు, ధార్తరాష్ట్రులం బెక్కురం గూల్చ కురుసైన్యంబు చెల్లాచెదరై పాఱుచుండ దుర్యోధనుం డొక్కండ భీముందాకి మూర్ఛిల్లె నంతలో నరకాసుర కుమారుం డగు భగదత్తుండు తన మత్తగజమ్ముం బాండవసైన్యముపై బఱవ నయ్యది పెక్కండ్ర యోధులం జదిపె నంతలో ఘటోత్కచుం డంతకాకారుండై యుద్దామగమన దుర్వారంబగు నొక్క వారణం బెక్కి భగదత్తుపై బడి పొదివి యాతనిం బలాయితుంజేసి యాచార్య ప్రభృతులపై బడి నొప్పించుచో భీష్ముండు వెఱచి నాటికి పోరు చాలింప నాజ్ఞాపించె నిట్లు సమరం బతిఘోరంబై చూపట్ట గ్రమమ్మున దొమ్మిదవనాటి యుద్ధమ్మున భీష్ముండు ప్రళయరుద్రుని భంగి మూర్తీభవించి విజయు నొప్పించి పాండవసైనికుల గొఱియలమందలంబోలె దోలుచుండె.

చ. పుడమి వడంక, దిక్కరులు ◆ బ్రమ్మొగ్గతిలంబడ, జచ్చె జచ్చె భీ
ష్ముఁ డనెడి పేరెలుంగు దివి ◆ ముట్టగ, చక్రముచే ధరించి కృ
ష్ణుఁ డుఱికి చేరినుండి రిపు ◆ సూదనతాభరమూని భీష్ముపై
బడునెడ సవ్యసాచి పడి ◆ వచ్చి జనార్దనుతోడ నిట్లనున్.

కాఫీ—చతురశ్రగతి

వ॥ యదుకుంజర! కోపము సంహరింపు - మార్తావనలోలా యిది మేలా।

అ॥వ॥ రథమెక్కుము శౌరీ మదీయశర - లాఘవంబు కన్నారజూడుమిక॥

చ ర ణ ము

నీవండగ పైనుండినం జాలు - నిఖిలజగములు లవలీల జయింతును
దేవదేవ! తలవంపు గూరుపే - నీ వీ విజయునకో దయాసింధో ॥యదు॥

చ. అనవిని తేరిపై నిలిచె ♦ నద్దనుజాంతకుఁ డంత నింద్రనం
దనుడు సురాపగాతనయు ♦ దాకి రణం బొనరించె నంతలో
నిను దవరాబ్ధి మాటుపడె ♦ నెంతయు జింతిలి ధర్మసూతి తా
ననుజులు దోడరా నని ము ♦ రాంతకుపాలికి, మ్రొక్కియిట్లనెన్.

ఉ. ఎచ్చట దానవైమసల ♦ నెల్లరు గాల్ప దొడంగె నిట్లు తా
ర్చిచ్చువిధాన భీష్ముఁ, డిక ♦ నేయుసదేమి? ముకుంద! యుండఁగం
బచ్చిన వెన్క రాజ్యము వ ♦ శంబగుగాక, ప్రమోద మిచ్చునే?
కచ్చియమాని పోవుదుము ♦ కానలకుం దపమాచరింపగన్.

తే. గీ. మున్ను నా కారణమున నె ♦ న్నెన్నొ యిడుము
లనుభవించిరి నాతమ్ము ♦ లట్టివీరి
గనులజూచి ధృతిమోదంబు ♦ గంచుగాని
చంపుమని తాతకే నప్ప ♦ గింపజాల.

వ. అనవిని వసుదేవనందనుం డిట్లనియె.

చ. వినుము రహస్యవర్తనము ♦ మై జని యెల్లర మా సురాపగా
తనయుని గాంచి మ్రొక్కి "నిను ♦ దాకి రణమ్మున నిల్వనోప మే
మనువున నిన్ను గూల్పనగు ♦ నయ్యది మా కెఱిగింపు" మంచు వే
డిన నెఱిగించు నాతఁడు క ♦ డింది యనుగ్రహ మూని ధర్మజా!

వ. అనవిని ధర్మజుం డనుజుల న్వెంటనిడుకొని నాటిరేయి నిగూఢమ్ముగ గాంగేయుమందిరమ్మున కరిగి తత్పాదములకుం బ్రణమిల్లి నతండును వేరువేర నెల్లరినేమంబు లడిగి వచ్చినపని యేమని దీనాననుండగుచు ధర్మసూనుం డిట్లనియె.

ధన్యాసి—రూపకము

ప॥ నేమమే విధాన గలుగు - నీ పాదాల్లకు తాత ॥నేమ॥
అ॥ నీమనుమల మాఱిబడి - నేటికి బ్రతుకుచునుంటిమి ॥నేమ॥

1. సైనికులకు నీపేరొక - సారి విన్న నిదుర రాదు
గాననైతిము నిన్నిగతి - కయ్యము గావింతు మంచు ॥నేమ॥
2. వచ్చెద కనుమూసి యొకట - జేత్రిశూలమ్ముదాచి
వచ్చిన రుద్రుడ వోర్వగ - వచ్చునె యెన్నరికైన ॥నేమ॥

చ. అనవిని జాహ్నవీతనయు ♦ డయ్యమనందను గాంచి పల్కె, చే
ధనువుగల తడన్య నను ♦ దాకి రణమ్మున నిల్వ బాల రా
యనిమిషు లేని, కావున ద ♦ యామతి మీ కెఱిగించువాడ నా
ల్మునకగు మార్గమున్, సుకృతమ్ముం గయికొందు దదీయసంగతిన్.

తే. గీ. అంగనను, సంగనాపూర్వు, ♦ నంగనాభి
ధాను, దలచీర వీడిన ♦ వాని, భ్రాత్రు
హీను, ననపత్యు మార్కొన ♦ నెన్న దేని
యిది మదీయవధోపాయ ♦ మిద్ధచరిత!

క. తనర శిఖండిని మున్నిడు
కొని పాండవనూతి నన్ను ♦ గూల్పగల డనిన్
నను గెల్చినచో గౌరవు
లను గూల్పగ మీకికన్ సు ♦ లభముగు గాదె?

వ. అని పల్కిన దేవవ్రతుచే ధర్మజాను లనుజ్ఞాతులై నమస్కరించి వీడ్కొని విడిదులకుం బోవునెడ విజయుం డచ్యుతున కిట్లనియె.

భూపాల—ఆది

ప॥ పెంచి పెద్దజేసిన తాతను వం - చించి గూల్ప నాచేతు లెట్లాడు॥
అ॥ప॥ కొంచెపుమానిను లీపాండవులని - కోవిదులీపై మమ్ము దూషింపరే॥

చరణము

లోకమాన్యుడు దయాభిమాని ధర్మ - లోలుడు కులవృద్ధుడు గాంగేయుడు॥
యాకిరాతకృత్యమ్ము గావించి - యిహపరమ్ములకు దూరమగుదునే ॥పెం॥

సీ. స్వార్థపరిత్యాగి ♦ యై తండ్రికా నన్య
పతి నాలిజేసిన ♦ బ్రహ్మచారి

మము దండ్రిలేని లో ♦ వము దీర్చి యెంతయో
కాపాడినట్టి ద ♦ యావయోధి
పలుమారు సభలలో ♦ బాంధునంపసులు ధ
ర్మాత్మ్మలం చాదు యు ♦ ధార్థశాది
యస్త్రవిద్యార్థహా ♦ న్యము లన్నియు న్మాను
దెలియ బోధించిన ♦ దేశికుండు

తే. గీ. తనవధోపాయ మిట్లు శా ♦ త్రవులమైన
మా కెఱింగించినట్టి యు ♦ మాయకుండు
సురనదీసూను డట్టి ధ ♦ ర్మరతు భీష్మ్మ
మోనగించి కూల్చుటకన్న ♦ దోషమున్నె ?

వ. అనిన విని కృష్ణుండును,

ఉ. పున్నెము పాప మంచు దల ♦ పోయక వైరుల నిట్లు గూల్చగా
తిన్నగు నట్లు గూల్చి జగి ♦ తీపలయు న్ఖలమ్ము నేలుటే
తిన్నని రాజధర్మమగు ♦ దీనికి నీమది సంశయింపగా
నన్నె ? బలారినందన ! వి ♦ షాదము వీడి జయమ్ము గాంచుమా.

వ. అనవిని ఫల్గునుండు,

తే. ఆపగేయవధార్థమై ♦ యా శిఖండి
జననమందెగదా ! నదీ ♦ తనయు నతడె
గూల్చగాక, నే సన్యూలం ♦ గూల్చువాడ
చేతులార దారుణ మిట్లు ♦ సేయజాల.

వ. అనినవిని కవ్వడికిం గమలనాభుం డిట్లనియె.

చ. అనితరవధ్యకాయుడను ♦ నా! తటినీసుతుం డీవ్రనక్క యు
య్యనఘుని జావనేయగల ♦ యంతటి వీరుడు లేడు కావునన్
మనమున సంశయింప కను ♦ మాత్రము భీష్ముని గూల్చుమా శిఖం
డిని వడి ముందునిల్పుకొని ♦ నిర్భయమా మననేన కవ్వలన్.

వ. అనవిని పార్థుం డియ్యకొనియె నాటిరేయి గడచునంత సూర్యోద
యంబగుడు నుభయసైన్యంబులుం గదిసి పోరాడునెడ శిఖండిం

బురస్కరించుకొని యాఖండలనందనుండు మందాకినీనందను నెదిరి పోరాడుచో నేయుటమాని భీష్ముండు కురుపతింగని.

దర్బారు—రూపకము

ప॥ బడలితి నిన్నాళ్ళదనుక - బవర మొనర్చినకతమున ॥బ॥

అ॥ ప॥ ఒడయడ! నీమనుపుచినబుణ - మొగిదీర్చితిలావుకొలది ॥బడ॥

1. పదివేవుర జంపుదునని - బాసజేసితిని నీకు
నదయత శాత్రవుల దునిమి - యటు కృతకృత్యుడనైతిని ॥బ॥

2. మానవుండ పాండవుల న - మానుష విక్రముల గూల్ప
కానివనిగదా యెనను - కనుగొనుమా నేటికలను ॥బడ॥

క. అనివల్కుచు నిర్ధూమద
హనుపోలిక పాండవేయ ♦ యాదవబల కా
ననముల దహించుచు మా
ర్కొనుటయు నవు డాహవమ్ము ♦ ఘోరంబయ్యెన్.

సీ. అన్యోన్య శరసమూ ♦ హా సక్తబాహ్వంఘ్రి
వీనకంధరు లగు ♦ వీరభటులు
విగతహస్తంబు లౌ ♦ వే దండములును, హా
టాంగమ్ములైన శ ♦ తాంగములును
పరలోకనీతులై ♦ పరగు సూతులు సము
ద్ధూతపుచ్ఛమ్ములౌ ♦ తురగములును
జర్జరీభూతమౌ ♦ శస్త్రాస్త్రనిచయముల్
సంఖండిత పతాక ♦ సంచయములు

తే. గీ. కలిగి కదనోర్వి కడుభయం ♦ కరముగాక
తుములమయ్యె; బాకారి సు ♦ తుడు శిఖండి
ముందునిడుకొని భీష్ముపై ♦ ములుకులేయు
సమయమున నడ్డుపగిలె దు ♦ శ్శాసనుండు.

తే. గీ. అడ్డుపడిన దుశ్శాసను ♦ సంతలోగి
రీటి బాణపాతమున మూ ♦ ర్ఛిల్లజేసి

తనకు భీమాభిమన్యు సా ♦ త్యకులు తోడు
గాగ గాంగేయుపై నంప ♦ గములు నించె.

వ. అట్టియెడ భీష్ముండు నవ్వుచు శిఖండి నుద్దేశించి యిట్లనియె.

భైరవి—ఆది

ప॥ మగువనీవు మగవాడవై యిట్లు-మరలజన్మించినావా పగదీర్చుకొనగ॥
అ॥ప॥ నగరే నను నీతో బోరాడిన-నాపాటి రాచవారు శిఖండీ ॥మ॥

చరణము

పరశురాముప్రాపునమానపోయి - పాంచాలతనూభవులనాశ్రయించితివి॥
శరములేసి కసివాపుకొమ్మిదే - చాలింపదలంచితి నామేనిక ॥మ॥

చ. అనుచు రణమ్మునేయునటు ♦ లల్లన ధర్మజు డాసి 'మన్నడా!
పనివడి మీరలెల్ల రొక ♦ పట్టున పైబడి యేయు డాలసిం
చిన జెడు-కార్యమం' చనగ ♦ నేసలకుం బురికొల్పె ధర్మనం
దను డటుపై జెలంగి కద ♦ నంబు భయానకమై రయొకంతలో.

ఉ. తమ్ముల దక్కు-జోదులను ♦ దా బురికొల్పి సుయోధనుండు ద
ర్పమ్మున నాపగేయునకు ♦ బానటయై నిలువన్ వృకోదరుం
డమ్మున బాఱదోలి ప్రళ ♦ యాంతకురీతి దురమ్మునన్ విహా
రమ్మొనరించె దన్నొగి ను ♦ ర ప్రకరమ్ము నఱింప పెంపునన్.

వ. అట్టిచో నర్జునుండు శిఖండిం దఱిమి తెఱపికొని దేవవ్రతు నేయు
మనుచు నిట్లు పురికొల్పె

శా. ఏమున్నాడ భయమ్ములేదిక శిఖం ♦ డీ! యేయుమా భీష్ము నీ
పైనెప్పట్టున నీకసై నను సరే ♦ ప్రాలంగనీ నట్టిదో
నీనాడే పగదీర్చుకొమ్ము తఱి య ♦ య్యె న్నీదు ప్రాణాలకే
బ్రాణంబొడ్డుద సంశయింపకుము నా ♦ రాచమ్ము సంధింపుమా.

వ. అనునెడ శిఖండి గాంగేయుపై నాడిములుకులం గురియించు
చుండ శల్య కృపాశ్వత్థామ కుంభసంభవకృతవర్మాది యోధు
లొక్క పెట్ట ధనంజయుం బొదువ నప్పార్థుండు వాయవ్యాస్త్ర
ప్రయోగమ్మున వారెల్లరను దూరస్థులం జేసి శిఖండిమాటుననుండి

భీష్మునిచేతివిల్లుం దునిమి యనేకమ్ములగు నారసమ్ములం దనువు పారనేయ జెలిపిగొనక దివిజనదీసూనుం డిట్లని వితర్కించె.

నీలాంబరి - చతురశ్ర

ప॥ ఇవి శిఖండిబాణములే యగుచో నింతగా నొప్పిదెచ్చునా ॥యివి॥

అ॥ ప॥ అవశమగుచు కర్కటిగర్భమువలె దవిలి నను బ్రతుకనిచ్చునా॥

చరణము

మఱియు బ్రహ్మదండముల పాటియై మర్మములింక నొనాటునే
పురుషకారమున గములభృగీటు - గరుడన్న డైన దాటునే ॥యివి॥

సీ. జననమందితిని బ్ర ♦ శస్త మౌ భరతవం
శమున భాగీరథీ ♦ శంతనులకు
చివరంట నభ్యసిం ♦ చితి ధనుర్నిగమంబు
రవితేజు భార్గవ ♦ రాముగొలిచి
పాలించుకొంటి యా ♦ వజ్జీవపర్యంత
మటు బ్రహ్మచర్య వ ♦ త్య ప్రతముల
నేలించితి ధరిత్రి ♦ నెల్ల నక్రమముగా
సాత్యవతేయ వం ♦ శజులచేత

తే. గీ. కడకు నమరమ్ము గావించి ♦ కౌరవేంద్రు
ఋణము సైతము దీర్చుకొం ♦ టిని, సుతేమిం
గావలయు నాకు, నిశ్చింత ♦ గా శరీర
మింకజాలింతు, గలియుదు ♦ నిందిరేశు.

క. అని వాలుంబలకయు చే
గొని యరదము డిగ్గ నుఱుక ♦ గొబ్బున నవి తు
త్తునియలొనర్ప నరుడు, శాం
తనవుడు బడె నంత దూర్పు ♦ తలగాగ వడిన్.

తే. గీ. తల్పముంబలె శరములూ ♦ తగ నిలువగ
తనువు ధారుణి సోల ద ♦ య్యెను కిరీటి
తాతకు దలాడగా శర ♦ వ్రాతి మునిచె
నట్లు శరతల్పగతుడయ్యె ♦ న య్యనఘుడు.

వ. అంత మునివరులు హంసరూపంబులం జనుదెంచి గాంగేయునకు దక్షిణాయనం బగుటెఱింగించి చనిరి. ఉభయసైనికులును యుద్ధమ్ము మాని గన్నీరుగార్చుచు సమ్మోహనీయుం జుట్టునిలువ నొకంతకు శాంతనవుం డిట్లనియె.

నాటకురంజి - ఆది

ప॥ మునుమలార నాకొఱకువిచారము - మానుఁ డింకఁ దేహముఁ బాలించెద॥

అ॥ప॥ ఘనునింకెటనైననుమీరాక్లేరు- సమరమునస్మానినంధింపడుటయే ॥ము॥

చరణము

జనకు డొసంగిన వరబలమునన్స్వ - చ్ఛందమరణంబునాకు లభ్యమగు
నినుఁగొల్చుచునుత్తరాయనమువఱ - కిట్లేనుండుదునంపపాన్పుపై ॥ము॥

క. నాకంతదనుక రక్షం
జేకూర్పఁగ వలయుననఁగ ♦ క్షిప్రమున వారుం
బ్రాకారము గట్టింపఁగ
నాకనదీనందనుం డ ♦ నంతర మనియెన్.

సీ. శరవేదనమున నా ♦ సర్వాంగ మెరియఁగ
దప్పిక బుట్టెఁ బా ♦ తాళగంగ
గావలె శరతల్ప ♦ గతుఁడనై యున్కి న
న్యజలమ్ము సేవింప ♦ నన, మునులు
వెఱగంది పరికించు ♦ తఱి కవ్వడింజూచి
తేనేరుఁదీవు తే ♦ తెమ్మనంగ
క్రీడి తాతకుఁ బ్రద ♦ క్షిణము గావించి ప
ర్జన్యాస్త్రనామక ♦ సాయకమున

తే. గీ. ధరణి గాడంగ నేసిన ♦ తక్షణమున
నెగయువారిధారల గ్రోలి ♦ తృప్తినందె
శాంతనవు డెల్లవారు వి ♦ స్మయులుగాగ
నంతలో లోకబాంధవు ♦ డస్తమించె.

వ. అట్లు సూర్యాస్తమయం బగుడు నెల్లరు శిబిరంబుల కరిగిరి. తద నంతరంబ కర్ణుండు గాంగేయునికడకుం జని ప్రణమిల్ల భాగీరథీ సుతుండు కౌగిలించుకొని రక్షకాదిజనంబుల ననలకుం బోవ బనిచి కాసీనున కిట్లనియె.

తోడి—రూపకము

ప॥ నీయెడ గోపమ్మునాకు - నిజముగ లేదిది నమ్ముము ॥నీ॥

అ॥ ప॥ దాయలకుం బగగొల్పుట - దగదని పల్కితిని గాని ॥నీ॥

చరణము

1. కౌంతేయుడ వీవుగాని - కావుణమా రాధేయుడ వింతయు సాత్యవతేయుం - డియ్యది నాకెఱిగించెను ॥నీ॥

ఉ. పాండుకుమారు లా వారికి ♦ ప్రాణసముల్; విజయుం డజేయుడా ఖండల ముఖ్య ♦ నిర్జరులకైనను; నిక్కువమట్లుగాన నీ వొందుతలంపుదక్కి నను ♦ సూచితరీతి సుయోధనాదులం బాండవులన్ రణంబుడిగి ♦ భద్రగతిం జరియింప జేయుమా!

వ. అనిన విని కర్ణుం డిట్లనియె

ఉ. కన్నియనాడు కౌంతికి వి ♦ కర్తను వల్కురణ జ్జనించు టే మున్నయెఱుంగుదున్ గడచి ♦ పోయినదానికి నేడు లాభమే మున్నది చింతసేయ, నెటు ♦ లో యిక యుద్ధముగాక తప్ప దీ యున్నప్రాణ మా కురుధ ♦ రాధిపుబా లొనరించితింగదా!

చ. అరయుదు పాండవేయులు మ ♦ హాబలులంచును, మురారి ప్రాపుగా పరలునటంచు, వారిగెలు ♦ వం దర మేరికి గాదటంచు, నీ కురుపతి సేయుమన్ననల ♦ కుం దలయొగ్గిన నాకుసెల్లునే? పరమవిరోధులై పరగు ♦ పాండుకుమారులతోడి పొం దికల్.

ఉ మాటల జేతలన్ దురభి ♦ మానము పెంపున పాండవేయులం జాటి పరాభవించితిని ♦ సంగర మిట్లు పొసంగునంత యీ

నాటికి సాటివాడనని ♦ నమ్మినసామికిఁ మోసగించి నే
కూటికి గుడ్డకై బ్రతికి ♦ కుంతికుమారుల జేరు టొప్పునే ?

చ. సకల జగత్త్రయంబగుట ♦ సత్యము, సంగర మందు కేశవుండెం,
దికమక లెల్లబాపి జగ ♦ తీభర మెల్ల నడంప బుట్టె దే
వకికొడు కింతసిక్కనము, ♦ వచ్చునొకో విధినేత మాన్పగా ?
యిక గణించి యాజ్ఞయిడు ♦ మే జని నాపని నిర్వహించెదన్.

వ. అని పల్కు కర్ణుని మనోనిశ్చయంబున కలరి దేవవ్రతుం డిట్లనియె.

శంకరాభరణము—రూపకము

ప॥ నీతిమంతు డీయుగమున - నీవొకండ వేకర్ణా ॥నీతి॥
అ॥ ప॥ జాతితోబనేమి ? తలప - నీతిగదా వన్నె దెచ్చు ॥నీతి॥

చరణము

స్వామికార్యభారవహన - సామర్థ్య విశేషమందు
రామభక్తుడా హనుమడె - రాధేయా నీకు సాటి ॥నీతి॥

ఉ. శూరు లజేయులున్ బలయు ♦ సోదరులంచు పృథాకుమారు లీ
వారసియున్ సుయోధనుని ♦ యందలి నేస్తమునే గణించి నీ
పౌరుషవిధంబు సర్వమును ♦ పూజ్యతగాంచు; ననుజ్ఞ నిచ్చితిన్
వీరవరేణ్యా ! పోష్మునికి ♦ విశ్రుతకీర్తి వహింపు మెల్లెడన్.

వ. అనిపల్కు గాంగేయునకుం బ్రణమిల్లి కర్ణుండు నిజశిబిరంబునకుం జనియె.

శ్రీ

# మహాభారతము

## పద్మవ్యూహము

బిలహరి — రూపకము

ప॥ అభిమన్యుడు పద్మవ్యూ - హము సొచ్చిన కథవినుడీ ॥యభి॥

అ॥ ప॥ అభవాదులకు చెన్నుడ - నట్టిజోదు కిరీటికొడుకు ॥అభి॥

చరణము

శరగురుండు పన్నిన మొ - గ్గరము నట్టి సింధినాడు
అరిమర్దనత వారికి మే - నల్లుం డనిపించుకొన్నా ॥డభి॥

సీ. శరతల్పగతుడైన ♦ సురనదీ నందను
గోలకు విచారించి ♦ కురువిభుండు
కర్ణాదియోధులం ♦ గలసి పాండవసైన్య
మునకు మార్కొన దల ♦ పోయునంత
తనసేన నడువగా ♦ దగిన నాయకుడు ద్రో
ణుండని పల్కగ ♦ ర్ణుడు, సుయోధ
నుడు కుంభజుం డున్న ♦ యెడ కుంజని మహాత్మ
యఖిలసేనాధిప ♦ త్యమ్ము నిర్వ

తే. గీ. హింపు మీవే యటంచు ప్రా ♦ ర్థించి పావ
నోదకమ్ముల దెప్పించి ♦ యుచితరీతి
నపుడె యభిషిక్తు నొనరింప ♦ నస్త్రగురుడు
గోరు మిదియే వరం బన ♦ గురుపతి యనె.

దర్బారు—రూపకము

ప॥ పట్టితెమ్ము ధర్మపుత్రు - బ్రాణమ్ములతో నాకడకు ॥ప॥

అ॥ ప॥ ఇట్టియెడ న్నాకీవర - మిచ్చెదేవ గురువర్యా ॥ప॥

చరణము

నీకారుణ్య విశేషమె - సకలాభీష్టములగూర్చు

నీకౌరవ సైనికులను - జేకూరు శుభములింకిట ॥పట్టి॥

వ. అనవిని ద్రోణుండు రారాజున కిట్లనియె.

చ. శమనతనూజు డెంతయు న ♦ జాతరిపుండను మాటలెల్ల ని
క్కములగు, నతని ♦ గయ్యముసం దెగజూడ గోర కీ
క్రమమున బట్టితెమ్మని తి ♦ రమ్ముగ గోరెదవే నృపాల! వ
ల్కుమిపుడ నన్ను నీకిటుల ♦ గోరినకారణ మోసుయోధనా!

వ. అనిన దుర్యోధనుండు.

ఉ. అన్ననుజుం బురో విజయు ♦ డల్గి మహాన్ వధియించు, వారినే
తెన్నననో వధించినను ♦ దేవకిపట్టి మమున్వధించి కుం
తిన్నిలబెట్టుచాణిగ, యు ♦ ధిష్ఠిరు జూదమున జ్జయించి భా
గ్యోన్నతి నేలుకొందు భువి, ♦ నుగ్రవనమ్ముల కంపి వారలన్.

వ. అనినల్కు దుర్యోధను కౌటిల్యమునకు ధనురాచార్యుం డేవగించు
కొనుచు నిట్లనియె.

చ. సురలకునైతమున్ గెలువు ♦ నున్న కిరీటియె నిల్చియున్న సం
గరమున, నాకుమాత్రమెటు ♦ కవ్వడి నోర్వగనౌ? ధనంజయుం
డురువడి నిల్చి యడ్డపడ ♦ కున్నను, దా వెన్నునూవకున్న చో
స్థిరమిది, బట్టితెచ్చెద యు ♦ ధిష్ఠిరు నీకడకున్ సుయోధనా!

తే. గీ. అనినవిని కౌరవాగ్రజుం ♦ డలరె, గురుని
ప్రతిన చారులచే విని ♦ పాండవాగ్ర
జుండు వెఱగంది "నాయున్న ♦ చోటనిలిచి
సమర మొనరింపు" మన ధనం ♦ జయుడు పలికె

చ. నవ్వులచేటుగాక ప్రతి • నల్ సెఱిసేయ్యఁగొనంగ శక్యమే?
శస్త్రడిమేన బ్రాహ్మణులు • గల్గిన ద్రోణుడె గాదు స్థాణుడున్
దవ్వుల నిల్చితీఱవలె • ధర్మతనూజునకున్ బరాభవం
బెక్కువిధిగల్గు? గల్గునెడ • శోషముగావొకో? సప్తవార్ధుల్.

వ. అనిపల్కి నిజబలంబు స్వాంతనిష్ఠుఁగొని రణభూమిం జొచ్చి శత్రు బలంబుం దాఁకునంత ద్రోణుండు పెలరేఁగి పాండవసైన్యంబుపై దివ్యాస్త్రమ్ములం గురియించుచు మధ్యందిన మార్తాండుబలె నెరికిం దేఱిచూడరాక ముందుకంజయ్యును కుమారమూర్తి నొప్పుచు ధనంజయ ధృష్టద్యుమ్నులతో పెద్దపెట్టుగ యుద్ధం బొనర్చునెడ నభిమన్యుండు కౌరవసైన్యంబుపై బడి నఱుమాడుచు సైంధవప్రముఖులం బాఱదోలుచున్నంత రోషించి గదాధరుండై శల్యుం డభిమన్యు నెదుర్కొను నంతలో భీమసేనుండు మద్రపతి నెదుర్కొని బలద్వయమ్ము వెఱగంద మోహరించె నట్టియెడ ధనురాచార్యుండు తెలిసికొని ధర్మసూనుపై బడి శరవర్షంబుం గురియింప విజయుం డడ్డుపడి ధర్మజుం గాచికొని సమరతలంబెల్ల మేదోమాంసపంకంబును శోణితనదీ ప్రకరమ్మును గావించె నమ్మఱు నాడు సుశర్మాదులగు సంశప్తకు లనేకరథికముఖ్యు లర్జునుం దలపడి పోరుచున్నంత ద్రోణుండును పాంచాలురపై బడి నుఱు మాడుచు పాండవసైనికుల కందఱకు నన్నిరూపులై యేట్లాడునెడ నొకవంక భగదత్తుండు సుప్రతీకం బను తనయేన్గుచు పాండవ సైన్యంబుపై గవియంజేసిన నయ్యది దూరమునసుండి కని తేరటు పోనిచ్చి భగదత్తు నెదుర్కొనునంత నా ప్రాగ్జ్యోతిషాధీశ్వరుం డింద్ర నందనుపై వైష్ణవాస్త్రంబుం బ్రయోగింప వాసుదేవుం డయ్యది తన యురంబున ధరించె నంత క్రీడియు దంతిని భగదత్తునిం బరిమార్చె, మఱునాడు ద్రోణుండు పద్మవ్యూహమ్ము నంఘ టింప నర్జునుండు ధర్మరాజరక్షణార్థమై భీమాదులనుంచి తాను త్రిగర్తులతో యుద్ధమ్ము సేయుచున్నంత నిట ధర్మజుండు తత్పద్మ వ్యూహమును భేదింపనేరక సౌభద్రుం బిలిపించి యిట్లనియె.

తోడి—ఆది

ప॥ కయ్యమాడ జనుదెంచె త్రిగర్తుల-గనిరి నీతండ్రి నేడు నాత్రండి ॥క॥

అ॥ ప॥ అయ్యవారు నన్ను బ్రీయిత్తునని- యుభయమొసగిరాముర్యోధనునకు

చరణము

గురుడు నేడు ప్రళయోగ్రుడై వెలుగు- తెరువేమియు నాకీయుడదోచదు
పరువునిల్పు మీపాండుకుమారులు-బవరమున్న వెనుదీయరంచువడి॥క

చ. పారియును క్రీడి తేనితటి ♦ నస్త్రగురుండు రచించె తమ్ముమౌ
గ్గర మదిమాకభేద్యముగు ♦ గావున నిశ్చలిపించినాడ నే
పెరవున నోడ్డుసించి రిపు ♦ వీరుల గర్వముమాని పాండుభూ
వరుని యశమ్ము నిల్పెదవొ? ♦ భారము నీయది నమ్ము నాయనా!

ఉ. అయ్యకు దీసిపోవు రణ ♦ మందు రవంతయు నీవు, గాని "మీ
రెయ్యెడ బోరి కంపవల ♦ దేనుపమీావమునందు లేనిచో
నియ్యభిమన్యు" నంచు వచి ♦ యించె ధనంజయుడోక్క-నాడుమా
కయ్యది నెమ్మనమ్మనకు ♦ నారటముం గలిగించు నాయనా!

వ. అని పల్కు-నంతలో ఒకవెరి బాలుంగని.

ఉ "పొమ్ము చెటుగాని వెల్గమట ♦ నుంత యొఱుంగనీకుఱ్ఱడంచు" వా
క్రుచ్చెనుభద్ర "కూర్చెద వి ♦ రోధుల నాపెదతమ్ము డింతలో
వచ్చునటంచు" జెప్పిగోన ♦ వచ్చితి నిన్నిట జూరిమాపి నం
దిచ్చినజాలు శాత్రవుల ♦ నేబడ గూల్తు గదాధరుండనై.

వ. అనిన విని యభిమన్యుండును.

చక్రవాకము—ఆది

ప॥ నన్నింతగ బతిమాలగా వలయు-నాయేమి మీారలో తండ్రులార॥

అ॥ ప॥ అన్నన్నా! యనిసేతకీకరణి-యూాంచువాండ్రయంగీకృతివలయున॥

చరణము

కలనైనన్ గలనన్న సెలతునే-పిలుకాడగు నాక్రీడికొడుకునై
పులికడుపున లేడికూన పొడముసె-పుట్టినయది రాచపుట్టువేకద ॥న॥

చ. చవిగొని లేకదా ! విజయు • సంగరముం గృపకర్ణకుంభసం
భవు లపుడిప్డు; వారలటు • పై జవిజూతురు నుంతి నేటినా
బవరము, తారతమ్య మగు • పట్టిన నయ్యది వెల్లడింతు రా
హవమున పందువేయుగుగ • దా ! పరువందిన రాచబిడ్డకున్.

వ. అనిపల్కు సౌభద్రు శిరంబు మూర్కొని ధర్మజుండును,

ఉ. బాలుడవీవు, శాత్రవులు • భండనపండితు, లందు ద్రోణుతో
నాలమునగ్గలేరు, మరి • రాధియు క్రీడియు నెంతలేరు, చూ
లాలువిరాటుకూతురు కు • లాంగన, తల్లికొకండ వందుచే
బాలిగ గుండె బెంగుపడె • సంగరభూమికి నిన్నుబంపగన్.

వ. అనవిని సౌభద్రుండును.

సీ. కనువెట్టజేసి చూ • చిన లోకములు భ
స్మీకరించుమగండు • మేనమామ
పిడికిటం గొండల • బిండిసేయుగజాలు
విక్రమాటోపుండు • పెద్దతండ్రి
యిందుశేఖరుని మె • ప్పించి పాశుపతమ్ము
గైకొన్నలావరి • కన్నతండ్రి
యుగపరసమితి బా • హ్యాక్రాంతులనొనర్చు
వీరాగ్రగణ్యులు • పిన్నతండ్రు

తే. గీ. లిట్టి నాకేమిటికి • భీతి ? యింతయేల ?
కౌరవపరమ్ముగాగ జ • క్రధర విజయు
లరుగుదెంతురుగాక, క • య్యమునసిలిచి
పడయుదు జయమ్ము సెలవిడి • పంపుమయ్య !

మంజరులు

అనిపల్కి ధర్మజాజ్ఞనంది భీ - మాదులు తనువెన్నంట
చనుదెంచునంత దనకు బార్థ్వతీ - జానివరంబొకటుంట
నడ్డపడియె పాండుకుమారులకు జ - యద్రథుం డంతలోన
కొండ్డు భేదించి సౌభద్రుడు గురు - నొంచి సొచ్చెను బిరాన.

సీ. శరనిధిం దిరుగు మం ♦ దరనగమ్ము విధాన
కాననమ్మున రేగు ♦ కారుచిచ్చు
కైవడిం గాలప ♦ క్త్యాజనసమాజ సం
హారణవిక్రీడనం ♦ బాచరించు
శూలిపోలిక బవాలు ♦ కేళీగతుల నొప్పి
కురు సేనపై బడి ♦ యురవడించి
కేతువులం గూల్చి ♦ యాతపత్రమ్ముల
నుఱుమాడి తేరుల ♦ నుగ్గుజేసి

తే. గీ. గెడపిహాయముల సూతుల ♦ గీటడంచి
కాల్బలమ్ముల జదుపగ ♦ కౌరవాగ్ర
జుండు సౌభద్రునిం దాక ♦ జూచి ద్రోణు
డల్లసైనికవరుల కై ♦ లెత్తి పలికె.

మోహన—రూపకము

ప॥ చూతురేమి? యభిమన్యుడు - సుయోధనుని దాకుచుండ ॥చూ॥
అ॥ ప॥ అటడర్జునాత్మజుడగు - నర్భకుడు ఘనుడౌంటి రేమొ ॥చూ॥

చరణము

వరజనదుర్భేద్యంబగు - పద్మవ్యూహా బీగని
సరనిముసములో సించుట - యెవజూడరా! యూరక ॥చూ॥

చ. అని పురికొల్పుచుం గపిసె ♦ నయ్యభిమన్యుని ద్రోణు, డంతలో
మునుకొని కర్ణశల్యకృప ♦ ముఖ్యులు పల్వురు చుట్టుముట్టి, రా
యనిమిషరాజపుత్రుడు ర ♦ ణావని సందడి కన్నిరూపులై
తనరుచు నీరసంపదచె ♦ తత్కురుసైనిక వీరవారమున్.

సీ కవచమ్ము దూటి యుం ♦ గముగాడిపో నేయ
తొలగె నూతనుతుండు ♦ నిలువలేక
వాడితూపుల తాకు ♦ వడి బిట్టలసి యట్టె
మూర్ఛిల్లె నామద్ర ♦ భూవరుండు
విల్లు ద్రుంచి మేనికండలు ♦ సెక్కె నాదున్న
సేనుండు పడె సొమ్మ ♦ సిలి రథమున

శిరము కుండలకాంతి ♦ జెలగ లక్ష్మణకుమా
రుండు నేలంబడి ♦ యాఫమాసె

తే. గీ. పేర్వడిన యోధులెల్లరు ♦ విరథులైరి
కదనమేదిని నెత్తుటి ♦ కాల్వలయ్యె
నంత నపరాహ్ణమయ్యెను తే ♦ రస్త్రగురుని
పైకి దోలించి సరసూతి ♦ పల్కెనిట్లు.

ఉ. పట్టిరొయొసంగుదుం గలన ♦ పార్థుఁడు లేనిచో ధర్మసుతు నం
చొట్టిదుకొంటివేగద! సుయోధనుతోడఁ జత గాచికొందు నే
పట్టిరియొసంగుదుం గురున్న ♦ పాలుని నాపెదతండ్రి నిష్ఠ నీ
యట్టి ధనుర్వేదగ్రణుల ♦ నందఱిగెల్చు మహీసురోత్తమా!

వ. అని పల్కి రారాజుపయిం గవియు గురు కృప కర్ణాశ్వత్థామ శల్య దుశ్శాసనాదులెల్ల రొక్కపెట్టున సౌభద్రుపైఁ బడ నతం డెల్లరం గాందిశీకులం గావించునంత సుయోధనుండు ధనురాచార్యుని పాలికిం జని,

కేదార—ఆది

ప॥ కప్పకూఁత భుజగంబవై యిట్లు - కౌరవపక్షమునందు జేరితివి ॥క॥
అ॥ప॥ ఎవ్వఁడు పాండవపక్షపాతివే - యెఱిఁగి మోసపోయితిని బావఁడా॥

చరణము

బాలుఁడిట్లు మొగ్గరము భేదింప - జాలు నీవుపేక్షించితివిగాక
నీలావు స్మరనమ్మి లక్ష్మణుని - గోలుపోతి కులవర్ధనుడగుసుతు ॥క॥

వ. అని పల్కు దుర్యోధను నేవగించుకొనుచు కర్ణాదులం గని ద్రోణుం డిట్లనియె.

చ. అలతులఁబోవఁడీ బుడుత ♦ డర్జునతుల్యుఁడు, చేత గార్ముకం
బలరిన యంతదన్క నిట ♦ లాత్మునకైన నజేయు డిట్టిలో
విలు దునుమాడి వెన్దరిమి ♦ వే విరథుం బొనరింపు డందఱుం
దలపడి యొక్కపెట్టున ప ♦ దంపడి గూల్పగవచ్చు నీతనిన్.

చ. అనవిని కర్ణుడున్ వెనుక ♦ గ్రక్కున వచ్చి మహాశుగమ్మునన్
ధనువును ద్రుంచె, వాజులబ ♦ దంపడి గూల్చె గురుండు, సారథిం
దునిమె కృపుండు, సౌబలుడు ♦ ద్రోణసుతుండును శల్యుడాదిగా
దనరు మహారథుల్ శరస ♦ ంతానమునం గడు నొంచి రయ్యనన్.

వ. అంత నా క్రీడికొడుకు వాజిబలకయుం గొని వైనతేయునిమాడ్కి నింగి కెగయ దత్సాధనమ్ముల ద్రోణరాధేయులు తుత్తునియలు గావింప సౌభద్రుండు తన తేరిపైగల చక్రముం గొని యుపేంద్రు ననుకరించుచు సమరావేశుండై.

సీ. కలయబూచిన కింశు ♦ కముల లీల నెమ్మేని
రక్తారుణప్రభల్ ♦ రచ్చకెక్క
చక్రరోచులం మణి ♦ స్థగితకంకణకాంతు
లంబరవీథి మే ♦ లంబులాడ
సింహనాదము వైరి ♦ సేనాపయోనిధి
నల మందరాచల ♦ మైమథింప
ప్రథితవిక్రమ విహారము ♦ రత్నహారమై
భరతమాతకు వన్నె ♦ బాదుకొల్ప

తే. గీ. ద్రోణుపైబడి తన్నడ్డు ♦ సైనికులను
చించి చెండాడుచున్ దున్న ♦ సేనుతనయు
తోడ బోరాడి పోరాడి ♦ క్రీడికొడుకు
కడకు దాశ్శాసనిం గూల్చి ♦ పుడమి బడియె.

క. అది విని ధర్మతనూజుడు
హృదయము పగులంగ చేష్ట ♦ లెడసి యొకింతన్
గుదులుపడి సుతవియోగము
నెద పైపగలేక యేడ్చె ♦ నీవిధి నంతన్.

ముఖారి — జంపె

ప॥ నిను చేతులార నే - నసికంపి జంపించుకొన నాయెనా
నేటికి - నేకిరాతుడను నాయన ॥నిను॥

అ॥ ప॥ నినువంటి కొమరుని - న్నెందున్నముల నెత్తి
గనజాలుదుమె నీకు - నూతేండ్లు నిండెనా ॥నిను॥

చరణము

ఎదురురాడేమి యభిమన్యు డేడియటంచు
గదిసి యగుడుకిరీటికి - నే నేమనినాడుదు ॥నే॥
కదనమున ద్రోణాది - ఘనుల పెనుజూచు నీ
వదన మీనాటితో - గన నోచమైతిమా ॥నిను॥

చ॥ కులమును నిల్పగా డగిన • కుఱ్ఱడా వంశవినమ్మి క్రీడి యీ
కల నొనరించునట్టి నిను • గయ్యమునం దెగజూచి తొల్త నే
బలము బలంబు జూపి వగ • వారివధించి యికేమి బ్రాముకో
దలచి రణమ్మునేత కిక • దాపు గడంగుదు రయ్య పాండవుల్ ?

చ. కొనకు సుభద్రకుం గడుపు • కోత, మురారికి జింత, యుత్తరా
వనితకు దీఱరాని పెను • వంత, కిరీటికి పుత్రశోకముం
బొనరించినట్టి యీ పనటి • బొందియ బ్రాణము పాయదేల ? పా
పునకు చిరాయువన్న నుడి • పొల్లగునే ? విధినేత దప్పునే ?

వ. అని పలవించు ధర్మసూనునికడకు పారాశర్యుండు సనుదెంచి దుఃఖోపశమనం బొనర్చి సనినంత సాయంసమయము నగుడు పోరు చాలించి కృష్ణార్జునులు శిబిరమ్మునకు వచ్చుచో నర్జునుండు గోపాలుంగని,

ధన్యాసి - ఆది

ప॥ కలగుమానసముదుర్నిమిత్తములె - గన్పట్టెడు నామేనువ్రాన్పడెను
అ॥ ప॥ తలవనిద్దానికేమి హేతువో - తెలియజాలబావాలోకేశ్వర ॥కల॥

చరణము

అన్న లేమైరో ? తమ్ములెట్టియో - పన్నులైరో యాచార్యునికతమున
కన్నుగవకు గానంబడు వెలవెల - నున్న యట్లు శిబిరము గోపాలా ॥క॥

తే. గీ. రణము చాలించి నే శిబి • రమ్ము జేర
వచ్చునపుడెల్ల నేత్రప • ర్వమ్ముగాగ

ఎదురుగ నను డెంచి నను గౌగి ♦ లించు కొడుకు
నేడు గృహాంతరమ్మున ♦ లేడు, కృష్ణ!

వ. అనివలుకుచు నడుగుటకు తొట్రుపడు ధర్మజు విడిదల కరిగి వారిలో నభిమన్యుడు లేమిం జూచి యిట్లనియె.

క. గురుడు రచించిన యొగ్గర
మొరులకు జొరరా దటంచు ♦ నూహించి తుటన్
ద్వారవడి సౌభద్రుని పం
పరుగాదే తెలివిమాలి ♦ బవరము నేయన్?

క. అనివల్కి నిరుత్తరుడై
తనయా! యనుచేడ్చు ధర్మ ♦ తనయుని యాక్రం
దన మాకర్ణించియు ని
ల్వున గూలంబడి కిరీటి ♦ పొగులదొడంగెన్.

సింహేంద్రమధ్యమము - త్రిపుట

ప॥ పుడమియంతయు నేలుదీవని - పుట్టెడాస వహించి యుంటిని ॥పు॥
అ॥ కొడుక! నీవిటు కూలినాడవ - కటకట మాఱడి బుచ్చినాడవ ॥పు॥

చరణము

వరలు పున్నమచందురున కెన - వచ్చు నీ వదనమ్ము జూడక
ధరను భద్రార్జునుల కీగతి - తనువుల ప్రాణములు నిలుచును ॥పు॥

ఉ. దైవతకోటికిం బ్రభుడు ♦ తాత బిడౌజుడు, కన్నతండ్రి గాం
డీవి, జగన్నియామకుడు ♦ నీరజనాభుడు మేనమామ, నీ
వా వివిధాస్త్రసంచయ వి ♦ దగ్రణి వీగతి దిక్కుమాలి యు
ద్ధావని గూలినావె విప ♦ దంబుధి ముంచి మముం గుమారకా!

వ. ఇట్లు పలవించి చేయునది లేక యత్యంతం బొడమిన కోపావేశమ్మున నచటి వారింగని.

ఉ. నందను గాచియుందురని ♦ నమ్మి త్రిగర్తుల గెల్వబోవ మీ
రందరు నాడువాండ్రవలె ♦ నర్భకు నొంటిగనంపి యీగతిన్
ద్రుంపగజేసి రిట్టి యన ♦ మర్థులు మైమఱపుల్ కృపాణముల్
అందము లోటుగాంచునసి ♦ యౌరా! తగువారమటంచు దాల్పుటల్

తే. గీ. అకటా! మిముఁబట్టు లారని • యుక్తివాని
బదియునాతోఁడ బాలు గుం • భభవకర్ణ
ముఖ్యుల నెదిర్చి పోరాడి • మొగ్గరమ్ము
సింప బంపి చంపించిన • చెనటి సౌమకు?

వ. అనిపల్కి విజయుని శిబిరమ్మున కేగి ధర్మజుండు సమీపించి.

చ. హరియును నీవు లేనితఱి • నస్త్రగురుండు రచించినట్టి మొ
గ్గరము ప్రవేశమార్గ మెఱవు • గానక బాలకు నంపినట్టి ము
ష్కరుడను కులాంతకుండను సుత • ఘాతి నిశోకసంక్షోభను డీతడే
శిరము సముత్తరింపు మొగి • చెచ్చెర పున్నముగొమ్ము తమ్ముడా

క. అనిపల్కు ధర్మనందను
వనజాతుఁ డూరడించి • పార్థున కనె నీ
తనయుని తెగుటకు హేతువు
కనుగొన సైంధవుండు, వాని • గడతేర్పుమికన్

వ. అనిపల్కిన విని విగ్రహప్రవేశ పుత్రఘాతియగు శత్రుని వధంబునం గాని శోకం బుపశమింపదని తలంచి యేలకు వినధర్మనందనునితో నిట్లనియె

పూర్వ కళ్యాణి—ఆది

ప॥ చంపుదు నా సైంధవు నెల్లి యుదియ -
వలువు ప్రతిన యున్నా ... చీటికి డకమున్న ॥చం॥

అ॥ప॥ చంపలేకున్న గాండీవమ్ముతో-జ్వలనజ్వాలల భస్మమైపోదు॥చం॥

చరణము

నిన్ను శరణుజొచ్చకున్న గాప్రమని - నీరజాతుని నొగిప్రార్థింపకున్న
వెన్నుజూపి చనకున్న సురాసుర వీరులడ్డమై వచ్చి కాచినం ॥చం॥

తే. గీ. అనిపలికి గాండీవమ్ము న • జ్యంబొనర్చి
నారి మ్రోయించి శంఖము • నాదమెల్ల
దిక్కుల నిండజేయు భీ • తికొని యిట్లు
సింధుపతి కౌరవేంద్రుతో • జెప్పుకొనియె.

ఉ. అందఱుఁగూడి చంపిరిక దా ♦ నా! యభిమన్యు, బలారిసూతి న
న్నిందగఁజేతు నంచుఁ బ్రతి ♦ నం బొనరించె నిఁకేమిపాపమో?
బందుగు లస్త్రకోవిదులు ♦ పల్కుఁడు నన్నెటకేని పాఱిపో
మ్మనరో? రక్షసేయఁగల ♦ మందురొ? మీఱెదియేని ముందుగన్.

వ. అని వెఱచు సైంధవుని భుజముతట్టుచు సుయోధనుం డిట్లనియె.

సీ. విలుకాండ్రకున్ మేటి ♦ తలమానికంబన్న
ఖ్యాతి గాంచిన యట్టి ♦ కర్ణుఁడుండ
బహుళాస్త్రశస్త్రసం ♦ పన్ను లీగురుకృపా
శ్వత్థామముఖ్యులా ♦ చార్యులుండ
నలఘువిక్రమధురీ ♦ ణులు శల్య సుబలరా
జాత్మజ సోమద ♦ త్తాదులుండ
బాంధవమ్మునకు నీ ♦ బావమఱందులై
నుతిగన్న యోధులు ♦ నూర్వురుండ

తే. గీ. వెఱ్ఱవడిన వీరవరుఁడవై ♦ విజయు ప్రతి
దలఁచి నీవింత గుందఁగా ♦ దగునె? చెప్పుము,
మా మఱువుసొచ్చి నిను సుర ♦ స్తోమముఁ గ
డంగి కనువిచ్చి తేఱిచూ ♦ డఁగ వశమె?

వ. అనిపల్కి ద్రోణుచే నభయమిప్పించి యాతనిదైన్యమ్ము వాపె నట్ల
ర్జునుఁడును మాధవోపదేశమ్మున నిజసదనమ్మున కరిగి పాద
ప్రక్షాళనమ్ము గావించుకొని దర్భశయ్య గావించి గంధపుష్పాక్ష
తమ్ముల నలంకరించి యాయుధమ్ము లర్చించి నాఁటిరేయి స్వప్నం
బున శంకరుధ్యానించి కృష్ణసహితమ్ముగ గగనమ్మున కెగసి
యుత్తరాభిముఖుండై చని కైలాసమ్ముఁజేరి పరమేశ్వరు నభినుతించి
పాశుపతం బర్థించి దానిం బ్రస్ఫుటమ్ముగాఁ బడసి మరల నిజశిబి
రంబు సొత్తెంచి యట్లుగని కొంతవడికి మేల్కాని సూర్యోదయమ్ము
నకు వేచియుండె.

శ్రీ

# మహాభారతము

## సైంధవవధ

మోహన — రూపకము

ప॥ వినుడు సభాసదులారా - వినిపించెద సైంధవవధ ॥వి॥

అ॥ ప॥ వినవిన జవులూరు భరత - వీరుల సచ్చారిత్రము ॥విను॥

చరణము

తేరుదోలుకొని హరిరా - నారోహించెను కిరీటి

మేరు శిఖరమున దినమణి - తీరున దాశోభిల్లెను ॥విను॥

సీ. ధర్మజరక్షణా ♦ ర్థము సాత్యకి న్నిల్పి
కడల కపిధ్వజ ♦ కాంతులీన
సంగరోత్సాహుడై ♦ శంఖమ్ము పూరించి
ప్రకటగాండీవ గుణ ♦ ధ్వని మ్రోయునర్చి
పైబడు యోధుల ♦ బడనేయుచు గజాశ్వ
వితతి గూల్చుచు మహా ♦ వీరమూర్తి
యై కురుసైనికుల్ ♦ హరిగన్న తేళ్ళుపో
లిక భీతి నల్దిక్కు ♦ లకును బాఱ

తే. గీ. శరగురుండు రచించిన ♦ శకటనామ
కోజ్జ్వలవ్యూహముం జింప ♦ నొడ్డునేని
ద్రోణు గన్గొని నిలిచి చే ♦ తులు మొగిడ్చి
యునియె భయభక్తులెనగ జం ♦ భారిసుతుడు.

వ. అనవిని భారద్వాజుండును.

మ. కవచంబొండు ధరింపు మిచ్చెద కురు ♦ క్ష్మానాథ! యుద్దాన శా
త్రవనిర్ముక్త శరాళి సీతనువునన్ ♦ దక్షత్వమ్ముగా దాని దీ
యవశాళమ్మున కవ్వడింగెలుతువు ♦ యామ్యా! యిందు నేనుండి పాం
డవసేనంగలగింతు భద్రమగు ♦ దీనన్ సింధుభూజానికిన్.

వ. అనిపల్కి తత్కవచమ్ము సమంత్రితమ్ముగ సుయోధనునకుం దొడిగి దీవనలిచ్చి యంపి వికర్ణ వివింశతి చిత్రసేన బాహ్లిక దుశ్శాసన శల్య శకుని సోమదత్తాదులం గలసి భీమ నకుల సహదేవ ఘటోత్కచ ధృష్టద్యుమ్న సాత్యకి ప్రముఖులతో ప్రచండభంగిబోరాడు చున్నంత నక్కడ గాండీవి సైంధవుం డున్నదెనకుం బోవుచు బిందానువిందులను మహావీరుల ప్రమందించి యసంఖ్యాక రథగజ తురగపదాతిబలంబులం గూల్చుచు గురుసేనం గనుపుట్టి నవ్వు కవ్వడిం గని గోపాలుండు రథాశ్వమ్ములు డప్పిగొని డస్సియున్న వననానవ్యసాచియు,

తే గీ. దివ్యశరసంహతుల ధరి ♦ త్రిం బగిల్చి
కొలనుగల్పించి యిలుగట్టి ♦ ములుకులగమి
హాయముల నీళ్లుద్రావించి ♦ యరదమెక్కి
వచ్చు రిపువీరవరులు దే ♦ వతలు బొగడ.

చ. కలరు కృపాదియోధు లట ♦ గాని యొకండును జేరబోవ డా
బలరిపుసూను నబ్బురము ♦ బైకొన జూచెద రంతెగాని కే
వలము గతాశులై రి కురు ♦ నద్యులు సైంధవుపట్ల, నంతలో
నిలిచి రణావనిం బలికె ♦ నేయపుమై కురురాజుక్రీడికిన్.

శాంకె—ఖండజాతి

ప॥ మేటివిలుకాడవను - మాట లీనాటితో
బూటకము గావింతురా - వేల్పుతేసికొడుకా ॥మేటి॥

అ॥ ప॥ నేటివో రాటమున - నీపస గనంబడెదు
నే లేనిచోట మును - నీకుబిరుదము సెల్లె ॥మేటి॥

చ రి :౨ ము

సరిలేరు నాకన్న - దురభిమానము వీడి
సమరమొనరింప రారా - మగటిమిని నీకిప్పుడ
పరువుగల పాండు - భూపతనయ జయించుచో
శరధాటికోర్చి మీ - శౌర్యమగుపింపరా ॥మేటి॥

సీ. అనిపల్కిన కిరీటి • కినిసి పెక్కస్త్రాలం
బరగించుటంత ని • ష్ఫలములౌట
గని విస్మయంబంది • కవచధారణమున
నస్త్రాల గురియించి • యమరవిభుడు
తనకు మున్నిచ్చిన • ఘనతరాస్త్రమ్మున
దానిభేదింప య • త్నింపఁబూనంత
ద్రౌణి యద్దాని జి • త్రముగ ద్రుంచియు వమ్ము
గావింపగా క్రీడి • కనలి చేసి
తే. గీ. విరథుగావించి తఱుముగ • గరతలముల
నారసము లెన్నియో నాట • గౌరవపతి
కటకటంబడి లేదు కం • కటమువలన
లాభమని పారవైచి తో • లంగిపోయె.

వ. అంత వృషసేన కర్ణ భూరిశ్రవ సైంధవ కృపాశ్వత్థామాది యోధులు పెక్కండ్రు క్రీడిపై బలపడి పోరాడుచుండి రిట ధర్మజాదులు ద్రోణాదులం గలిసి పోరుచో బకునితమ్ముండగు నలంబసుడు పాండవసేనపై బడి మాయాయుద్ధం బొనర్చుచు భీమాదుల జిక్కుపఱచుచున్నంత ఘటోత్కచుండాతనితో బెద్దతడవు పోరాడి వానిం బోకార్చునంత పాంచజన్య ధ్వనులు మిక్కుటమ్ముగ వినవచ్చుటచే మనంబు కలంగి పాండవాగ్రజుండు సాత్యకిం గని యిట్లనియె.

ఉ. ఎచ్చట బాంచజన్యరవ • మే వినవచ్చెను, క్రీడి యేరిచే
నొచ్చెనొ, యొక్కడయ్యెనొ క • నుంగొనుమా ధరణీరజ మ్మదే

నెచ్చెలియు న్గురుండుగద ♦ నీకు గిరీటి, బిరాననేగి వి
వ్యచ్చునికై వడి గాచికొమ్ము బక ♦ వైరియు తోడగు నీకునవ్వలన్

క. అని పల్కిన విని సాత్యకి
 చని కౌరవబలము నెల్ల ♦ నమయించుచు ద్రో
 ణుని దాకి పోరి కడకొ
 య్యన లోనికి సేరె నొగి మ ♦ హావీరుండై.

సీ. కృతవర్మ సత్యక ♦ సుతునితో బోరాడి
  వారింపగా లేక ♦ పాఱిపోయె
 జలసంధు డను ధరా ♦ జాని సైనేయుతో
  సమరమ్ము గావించి ♦ సమసిపోయె
 నడరి సుదర్శనుం ♦ డను తేజు సాత్యకి
  తో యుద్ధమొనరించి ♦ పోయె దివికి
 శినివరుతో దున్న ♦ సేను జాలమొనర్చి
  చేవసాలక కాంగి ♦ శిథిలుడయ్యె

తే. గీ. విజయుపోల్కి మురాంత ♦ కానుజుడు బెక్కు
 యోధులం గెల్చి పోరాడు ♦ చుండునంత
 ధర్మజుం డంప బకవైరి ♦ దర్పమెసగ
 తరలి సేనాముఖమ్మున ♦ గురుని గవిసె.

క. కవిసిన భారద్వాజుం
 డవురా! నీవెట్లు పోదు ♦ వసుమతి గొనకే
 భవదీయానుజు డెటు నని
 నవలోకింపవో? యటన్న ♦ ననిలజు డనియెన్.

మోహన—ఆది

ప॥ ఎన్నడీ యొడ్డి విందుజేయించు - కొన్నరీతి మాటాడ నేర్చితి ॥ఎ॥
అ॥ప॥ పున్నెమునకు బోనిత్తువే నన్ను పన్నినమొగ్గర మందు కేర్పడినా ॥ఎ॥

చరణము

కాదు వీడు జేజేరాకొమరుడు - కదన భీముండు భీముండెల్ల గాని
చూడమిచటగురుడని దైవంబని - పాడియెఱుంగకపల్కెదో బాపడ ॥ఎ॥

క. అని పల్కుచు గద చేకొని
వనివడి సారించి వైవ • బాలుడు పఱచెన్
ఘనరథ్యమ్ములు గూలెను
వనరుచు సారథియు దెళ్ళ • వైరులు వడకన్.

ఉ. బెబ్బులిగన్న లేళ్లగమి • పోలిక జిందర వందరై బలం
బుబ్బుసెడన్ బకారిసన నొం డరదమ్మున ద్రోణుడెక్కి తా
దెబ్బున నమ్ములం గురియ • తెంపున వాయుసుతుండు చే నొక
ల్దబ్బున బట్టి వీచెను ర • థమ్ము విరోధులు విస్మయంపడన్.

ఉ. అంతకసన్నిభుం డగు బ • కారి ధనంజయుఁగాంచి యెంతయుం
గాంతసమంది సూతసుతు • జయ్యన దాకి తొలంగఁ జేసి తా
నంతన బోక కౌరవుల • నమ్మెడ బెక్కుర గూల్చి కర్ణున
త్యంతము గాసిపెట్టునెడ • నర్కసుతుండును రక్తనేత్రుడై

తే. గీ. అనిలజు నిరాయుధుం జేసి • యుంపవాన
గురిసి కుంతి కొసంగిన • వరము దలచి
గెడపుటుడిగి నవ్వుచు వింట • గడుపు బొడిచి
పలికె నీవిధి నవమాన • పడ వడఁకుఁడి.

కన్నడ—ఆది

ప॥ కడవలాదిగా గంతులేల తిని-మిడుకకేయునికే నడచివచ్చితివ ॥క॥
అ॥ప॥ బడుగ! నీకేలభండనంబింటి-కడన యుండుమాయడచిపడక యుటు॥

చరణము

వనమునం గందమూలమ్ములు దిని-మునివై యుండక నీకేలకలను ?
ఘనయరాకునను బోటితో నెపుడు-చేయు లతిం గనినేయు మాహవము॥

తే. గీ. బడలినాడవు కాబోలు • పాప మీవు ?
కలరుగా నరనారాయ • ణులు ననని యట
నేడదీఱితో మ్రొక్క • చేతగాని
భండనమునకు రాకుమో • తిండిపోత !

వ. అనిపల్కి వృకోదరుండును విన్ననిమొగంబుతో సవ్యసాచి కడకుం జనియె. సాత్యకియు కురుబలంబుల నేట్లాడుచు గడకు భూరిశ్రవునితో బెనంగిపోరు నెడ సయ్యిరువురు గొ తవడికి పాదచారులై మల్ల యుద్ధంబొనర్చుచో భూరిశ్రవుండు పెద్దయుం బ్రొద్దుపోరి డస్సి యున్న కృష్ణానుజు నేలంబడవైచి మొగిచి యురంబు నిరుగాలం ద్రొక్కి కృపాణమ్మున కంఠమ్ము నరుకనేయుచున్నంత గోపాలుం డది కని వేగిరపడి యర్జునుం గాంచి,

శా. నీకుందోడ్పడవచ్చి నాయనుజుఁ డెం ♦ తే డస్సి భూరిశ్రవుం
దాకంజాలక సెందశాని మనన ♦ స్తంభించుచో జూతువే
లా? కంఠం బిపుడుత్తరింప గరిమా ♦ లంబెత్తె, వే ద్రుంచు మో
యీ కౌంతేయ! శరం, బన న్నిపుడము న ♦ క్షుద్రుం చెతజ్జ్వాలావున్.

తే. గీ. తునిసిపడి బాహువు భుజంగ ♦ మనజెలంగ;
నతడు గాండీవికనె తను ♦ నయ్యో! నీకు
జలజనాభుని దురుపదే ♦ శంబునఁజేసి
పరునితో బోరు సన్న్యాయ ♦ మరయ, పార్థ!'

వ. అనవిని విజయుండును,

ఉ. దూఱెదవేలనన్నిటుల? ♦ దోడ్పడవచ్చి బిరాన గాచితో
నేరని వీరబలాధిపుల ♦ నీవొగి దూఱుదుము, ధర్మమున్నచో
మారసమాను నట్టి యభి ♦ మన్యుకుమారుని గూల్తురో కో? తా
ర్మారగు ధర్మముల్ దుర్భి ♦ మాని సుయోధను కారణమ్మునన్.

మంజరులు

అనిన నిరుత్తరుడై భూరిశ్రవు - డపసవ్యకరమ్మునను
రణభూమి శరమ్ములు పఱచుకొనుచు - బ్రాయోపవేశమునను
ప్రాణాయామపరుండై యుండఁగ - బొకించి శినిసుతుండు
చేనున్న కత్తితో జేసె శిర - శ్ఛేద మతితకోపుండు!

క. అదిగని రాధేయుం డ
చ్యుదనున శైనేయు దాక ♦ నతఁ డాకర్ణుం

బదునగు నారసముల జే
టొదవగ గొట్టంగ బాఱె • నొండువలనికిన్.

వ. ఇట్లు పలాయనుం డై కౌంతవదికి కవ్వడి నెదుర్కొన నలిగి కిరీటి రాధేయున కిట్లనియె.

కాంభోజి - రూపకము

ప॥ ఏటికి భీమున్దూఱితివి - నిప్పుడు సాత్యకి గెలువడె ॥ఏ॥

అ॥ప॥ ఓటమియు న్గెలుపు గలుగు - యుద్ధములో నెట్టిఘనుల ॥ఏ॥

చరణము

అలతినై బకాంతకు నీ - వాక్షేపించితివి గాని
తులువా నీకాలము గూడు - దోచెఁ బ్రజకెల్లరకును ॥ఏ॥

ఉ. పాడిదొలంగి చేతిపలు • భగ్నముసేర్చి మహాత్మజాతు డు
న్నాఁడిఁక నేను లేనపుడ • యమ్ముల; దానికి నీవునూడగా
పాడిమొలన్ ద్విజాత్మభవు • భవ్యశిరం బ్రొక్కవాగికోల దు
న్మాడుదు, నిన్ను ఖండనము • సన్ బలిపెట్టుదు భారతాంబకున్.

వ. అనిపల్కి కర్ణుఁడతిమి తక్కుంగల సైనికులపై బడి యేట్లాడుచున్నంత సుయోధనుండు రాధేయున కిట్లనియె.

చ. చలమున భీమసాత్యకులు • సాహసము రావిజయుండు సింధుభూ
తలపతి యున్నచక్రకటు • గర్వమునం జనుచున్నవాఁడదే
జలజహితుండు గ్రుంకుతఱి • సన్నిహితం బగునంతదాక
యలవు బలమ్ముజూపి మఘ • వాత్మజు నెట్టులో నిల్వరింపుమా.

వ. అనిన విని కర్ణుండును,

చ. వడముడి వాడితూపులకు • బాల్పడి దేహము చాలనొచ్చె ని
య్యెడ, నగుగాక, నాతను వ • ధీనము జేసితి నీకు గాన క
వ్వడి నెటులో వికర్తనుడు • పశ్చిమశైలము జేరునంతకుం
గడమిదలిర్ప నిల్పుదును • కయ్యమునం దిటుపై సుయోధనా!

వ. అని పల్కి,

చ. జలరుహమిత్రనందనుడు ♦ సైనికులం బురిగొల్పి కవ్వడిం
దలపడి విక్రమం బెసగ ♦ దారుణభంగి రణమ్ము సేయుచో
బలరిపునందనానలుడు ♦ సైనికులాటవి గాల్చుచుండ నా
జలరుహనాభుడిట్లనియె ♦ సంగడికానికి కూర్మిక్రీడికిన్.

ఆభోగి — ఆది

ప॥ కనుగొంటివె పార్థా! నేరబోయె - దినకరు డా
యస్తాచలసీమకు ॥కను॥

అ॥ ప॥ పెనగులాడ జన - దింక వీరితో
దునుమాడందగు - సైంధవుశిరమును ॥కను॥

చరణము

పాశుపతము వింటన్ సంధింపుము - పార్వతీరమణు నెద ధ్యానింపుము
నేనదుపాయం బొందగ గల్పింతు-నీ సల్పిన ప్రతినం జెల్లింతును ॥కను॥

చ. మఱుగుపడం బొనర్తు రవి ♦ మండల మేనొక మాయ జేసి చూ
పఱకు తిమంబగుం బ్రతిన ♦ భంగము నొందెనటంచు సింధు భూ
వరుడును కౌరవుల్ బరవు ♦ వాసి యుధేచ్ఛగ సంచరింతు రీ
వెఱవున సైంధవుం దునిమి ♦ వేగ కృతార్థుడ వౌదు యర్జునా!

వ. అని పల్కి మాధవుండు మాయాతిమిరంబున తిమిరారిం గప్పిన,

తే. గీ. తరణి గ్రుంకెనటంచు సైం ♦ ధవుడు తేరి
పైని నిలుచుండి తలయెత్తి ♦ పడమటిదెస
జూచుచున్నంత సురరాజ ♦ సూను డొక్క
సాయకమ్మున వాని మ ♦ స్తకము దునిమె.

వ. అప్పుడు సత్వరుండై శ్రీహరి పార్థుంగని,

చ. ఇలబడరాదు వాని శిర ♦ మించుక నీవు లోకనమ్మునన్
నిలువు మటన్న క్రీడియును ♦ నేర్పున బంతివిధాన ద్రవ్వుచున్
ములుకుల మోవున నభము ♦ ముట్టగ గొట్టుచు నెంతొకాల మీ
నిలువుట పల్కవే? యనిన ♦ నీరజనాభుడు క్రీడికిట్లనెన్.

తే. గీ. ఏమఱగ వీని శిరము ఖం ♦ డింపబడు న
టంచు నశరీరవాణియు ♦ న్నాఁటి యీయ
ధరణి బడవేయు వీని మ ♦ స్తకము మొదలు
వానిశిరము ముక్కలై నూఱు ♦ వ్రక్కలగు న
టంచు సైంధవుఁడెంతయు ♦ వినఁగఁ దపసి.

వ. కావున నావృద్ధక్షత్రుఁడు సంధ్యావందనమొనరించుచుండు సమీపమున జపంబొనర్చుచుండు నీశిరంబు బాణముతోడనె పడునట్లు గొట్టుమన నతండట్లు సేయ తచ్ఛిరంబు బాణముతోడమీఁద బడిన దగ్గనలేచి క్రోధించిన నది భూమిపయిం బడుటయు నత్తపస్వి శిరమ్ము సహస్రఖండములయ్యె నచ్యుతుండును మాయాతిమిరంబు హరింప వృద్ధార్కుండు లోచన గోచరుండయ్యె నంత క్రీడి సహిష్ణుండై గోవిందునకు సాష్టాంగపడి,

కాఫీ—ఆది

ప॥ పరమపురుష గోవింద రఘునాథ-పద్మనాభ శౌరీ దయానిధీ ॥ప॥
అ॥ప॥ గరుడగమన క్షీరాంబుధిశయన-దురితదమన సరసీరుహనయనా ॥ప॥

చరణము

హరిముకుంద గోపాల పరాత్పర - ఆదిదేవ శరణాగతరక్షణ
కరివరదా విశ్వేశ మురారీ - నరసింహా కేశవ నారాయణ ॥ప॥

చ. కలశభవాదిమౌనీంద్రు లటు ♦ గావలియున్న మురారి కేవియు
న్నలువగ జెల్లునే ప్రతిన ♦ సైంధవుగూల్ప ? మహానుభావ ! నీ
యలఘుకృపావిశేషమున ♦ నట్లు కృతార్థుడనైతి గాక భూ
తలమున గడ్డిపోచయును ♦ దప్పగ శక్తుఁడనే ? పరాత్పరా.

వ. అనిపల్కు క్రీడిభుజము దట్టుచు జగన్నాథుం డిట్లనియె.

సీ. అతిమానుషమ్మైన ♦ నర్ధరాత్రమున నం
గారపర్ణు జయింప ♦ వోరి నాఁడు
మాయాకిరాతుని ♦ మార్కొని నెఱించిన
త్రిపురారితో మోహ ♦ రించునాఁడు

త్రిపురారితో మోహ ♦ రించునాఁడు
వారిధిమధ్యమున డా ♦ గిన కాలకేయాది
దనుజావళిం గూడి ♦ పెనగునాఁడు
గోవులకై భీష్మ ♦ కుంభసంభూత క
ర్ణాదులలంగూడి పో ♦ రాడునాఁడు

తే. గీ. నీ కెవరు సాయమైరి లో ♦ కైకవీర!
భవ్యభవదీయశౌర్య సం ♦ పదయెగాక,
మనకొఱకు వేచియుండు ధ ♦ ర్మజుఁడు సైంధ
వుని వధించుట దెలుపబో ♦ వుదము రమ్ము.

క. అనిపల్కి క్రీడి దోడ్కొని
వనజాక్షుఁడు ధర్మజునకు ♦ బవరమ్మున న
ర్జునుఁడు జయద్రథునిం గూ
ల్చినవిధ మెఱిగింప ముదము ♦ జెందె నతండున్.

శ్రీ

# మహాభారతము

## ప్రచండపార్థతము

కమాచి - ఆది

ప॥ వినిపింతు ప్రచండపార్థతంబిదె వినుడు సభికులారా ముదమ్మున ॥ వి॥

అ॥ప॥ పనివడిపార్థుడు దాకలశభవునిబవరమ్మున దునుమాడిన చరితము॥

చ ర ణ ము

కురువిభుడా సైంధవుని చావునకు బరితపించి మిగుల రయమ్మున
గురునికడకునని నిందింపగనా - కుంభసంభవుం డతనికిట్లనియె॥వి॥

మ. నను నిందించెదవేల? దేవతలకై ♦ న న్గెల్వగాబోల ద
ర్జును, గాంగేయునివంటి వీరుడె పరా ♦ స్తుండయ్యె, నీ కౌరవు
ల్మనరంచు న్మది దోచె; గయ్యమున కే ♦ లావచ్చితీ వంచన
ధనురాచార్యుడనన్న పెద్దరభిమా ♦ నంబిట్టు లేడ్పించెదు.

సీ. సమవర్తి నందను ♦ శకునితో దబ్బిబ్బు
పాచికలాడించు ♦ ఫలితిమిదియొ
ద్రౌపది నేక వ ♦ స్త్రను రచ్చకీడ్పించి
పరిభవించిన యట్టి ♦ ఫలితమిదియొ
కూడుగుడ్డకు దూర ♦ గులజేసి దాయల
వనుల కంపించిన ♦ ఫలితమిదియొ
సంధిపొనంగింప జను ♦ దెంచిన మురారి
పలుకు లాలింపని ♦ ఫలితమిదియొ

తే. గీ. చేతనగునేసి బవరమ్ము ♦ సేయు మట్లు
చాలకున్నెడ ధర్మజు ♦ శరణు జొరుము

చీటికిన్మాటికి న్మించి ♦ చెడ్డ లరయు
కెంతయు న్నిపు న న్నుడి ♦ కింతు వేల?

తే. గీ. ధర్మవర్తనులగు పాండు ♦ తనయపంచ
కమున కంతలుచేసిన ♦ కఠినకర్ము
లైన మాపక్షమున యుద్ధ ♦ మాచరించు
నట్టినేను నిజముగ బ్రా ♦ హ్మణుడగాను.

వ. అనికనలి మరల నొకంతకు శాంతించి యభిమానవశమ్మున దుర్యో ధనున కిట్లనియె.

హంసధ్వని - ఆది

ప॥ వినుదుర్యోధన పలుకులతోనిక-నను బోటికి పనిలేదువా ప్రతిన విను॥
అ॥ ప॥ కనుము నేడు పాంచాలుర జంపక కవచంబూడుచువాడగాను నే॥ విను॥

చ ర ణ ము

పురికొల్పుము సైనికుల నెల్లరను-పరికింపుము నాశక్తినీ రేయి
దురమున నాచేతికి దాటువారి బరిమార్పుమంచుబల్కు-ము ద్రౌణికి॥ వి॥

చ. అనిన సుయోధనుండు సని ♦ యంగవిభు న్మాటి తక్కు-యోధులం
బనివడినిల్పె కయ్యమున ♦ పాండుకుమారులు సేనతోడ మా
ర్కొ-న దుముల మ్మ్నసాగె నట ♦ కుంభభవుండు మహాపరాక్రమం
బెనయగ సంపవాన గురి ♦ యించుచు నుండె విరోధిసేనపై.

వ. భీముం డొకవంక కురుకుమారులతో యుద్ధమ్ముసేయుచు దుర్మద దుష్కర్ణులంజంపి ద్రోణు నెదుర్కొ-న సాత్యకి ధృష్టద్యుమ్న ఘటో త్కచ ప్రముఖులు కర్ణసోమదత్తాదుల నెదుర్కొ-ని పోరాడుచుండ ద్రౌణి ఘటోత్కచుని కొడుకగు నంజనపర్వుం గూల్చి రోషించి ఘటోత్కచుం డశ్వత్థామపైబడి భీముంబుగ సంగ్రామం బొనర్చ గురుసుతుం డద్దానవు గాటించి పాండవ సైనికులం బెక్కండ్ర నుగ్గాడి పాంచాలుర నేట్లాడుచున్నంత బకారి యొక్కచో గురు వృద్ధుండగు బాహ్లికుంజంప నర్జునుండు ధృష్టద్యుమ్నాదులంగూడి ద్రోణుపైబడ దుర్యోధన ప్రేరణమ్మున గర్ణుండు విజయుం గూల్తు నని ప్రగల్భములాడు నెడ కృపుండు రాధేయున కిట్లనియె.

ఉ. నవ్వుదు రెవ్వరేని విని ♦ నం బెనురజ్జులు గట్టిపెట్టు, మా
కవ్వడి గెల్తునంచు బలు ♦ క న్మతి సిగ్గటు లేకపోయె? నీ
క్రొవ్వులు ఘోషయాత్రకును ♦ గోగ్రహణంబున కెందుబోయెనో
యెవ్వరెఱుంగ రావిజయు? ♦ హీనబలు న్నిను, సూతనందనా!

వ. అనవిని కర్ణుండు రోషించి,

చ. పలికినయంతవట్టు నలు ♦ కంగలవాడను నన్ను నీవిటు
ల్పలికిన లోపమున్నదె? నృ ♦ పాలునిజూచియె యూరకుండగా
వలసెను కాదయేని కర ♦ వాలమునం దెగగోయకుందునే
తలపడి నీదునాలుక? నృ ♦ ధాకలహం బిటులాడ కెన్నడున్.

తే. గీ. మామనిట్లాడ గోపతా ♦ ప్రమాతుఁ డగుచు
గత్తిదూసి యశ్వత్థామ ♦ కర్ణుని దెస
కేగునెడ నడ్డుపడి కౌర ♦ వేశ్వరుండు
ద్రోణిశారద్వతుల వేడె ♦ దత్తరమున.

సావేరి — ఆది.

ప॥ నన్నుజూచి చాలింపుడు కలహము-న్యాయమానె? మనలో మనకీవిధి
అ॥ ప॥ అన్నన్నా! పగవారు చుల్కనగా నవలోకింతురుగాదె మనలనిక॥

చరణము

గురుడు మీరు మద్రేశ్వకర్ణులు - ధరయేలింపగ నున్నారు నన్ను
నిరుపమాన విక్రమసంపన్నులు - ధరణీసురలయ్యో! శాంతింపుడు॥న॥

చ. అని నరపాలు డాకలహ ♦ మాపెను, సాత్యకి సోమదత్తునిం
దునిమె, రణమ్ము ఘోరముగ ♦ దోచెను సూతతనూజుడాకి యె
య్యాన పహదేవుడు న్విరథు ♦ డై యవమానపడెన్ ఘటోత్కచుం
డనుపమశక్తి మీర దెగ ♦ టార్చె నలంబసదైత్యు నుగ్రతన్.

చ. అనిలజసూతి రాత్రిసమ ♦ యంబగుట న్బలమెక్కుడై విక
ర్తనసుతుడాకి పోరునెడ ♦ ప్రాణము గాచుకొనంగ కర్ణుడు
న్దనకు బిడౌజు డిచ్చిన ఘ ♦ నంబగుశక్తిని వైవ దానవేం
ద్రునియురమ్ముంబగిల్చి యసు ♦ రుల్గొని వాసవుజేరె నద్దియున్.

క. మృతుడైన హిడింబాసుతు
గతిఁగని పాండవులు వగవ ♦ గమలదళాక్షుం
డతిమోదమంది వలమురి
నతిరావంబెసగ నూఁగ ♦ నర్జును డనియెన్.

శా. బావా, దేవ, మహానుభావ, బలసం, ♦ పన్నుండు హైడింబుడే
జీవమ్ముల్దొఱఁగ న్విచారపడకీ ♦ సింహారవం బేటికో
గావింపన్మణిపాంచజన్యమిటు లు ♦ ద్ఘాటించి పూరించి తే
లా? విన్పింపుము మావిచార మెటు నీ ♦ కానందమై తోఁచెనో?

వ. అనిన వాసుదేవుం డిట్లనియె

చ. కవచము కుండలమ్ములును ♦ గైకొని కర్ణునకిచ్చె శక్తి వా
సవు డది యున్నచో గెలువ ♦ సాధ్యముగాదతనిం బురారియున్,
దివిజనిభుండు కర్ణుడు, గ ♦ ఱించెను వానికి శక్తి, నీకు మృ
త్యువు తొలఁగెం గదాయని కు ♦ తూహలమందితి, శంఖమొత్తితిన్.

తే. గీ. నాకు నాప్రాణములకన్న ♦ లోకపాల
నమునకన్న నెక్కుడు నీవ ♦ సమరమందు
నిన్ను రాధేయు డిక జంప ♦ నేర డంచు
హాయిగా నిద్రబోదునీ ♦ రేయి, పార్థ!

వ. అని సమాధానమ్ము సెప్పి హిడింబానందనుని చావునకై శోకించు నెల్లవారిని వారించె; నంతదమోమయం బగుడు కొంతదడవు యుద్ధమ్ము సాలించి చంద్రోదయం బగునంత నుభయబలంబులుం దాకి పోరుచో శరగురుం డేరికిం దేరిచూడరాక పాంచాల బలంబుం గూల్చుచు విరాటద్రుపదులం జంప ధృష్టద్యుమ్నుండు మండిపడుచు ద్రోణుంగూల్తునని బాసజేసి కురుబలంబుపై బడి సైనికుల నుఱుమాడుచు సూర్యోదయంబగునంతకు నేకవీరుండై యరివీరులం దెగటార్చుచు ద్రోణు నెదుర్కొని పోరాడుచున్నంత కవ్వడితోడ్పడి ధనురాచార్యునితో బెనంగుచున్నెడ కమలనాభుండు పార్థున కిట్లనియె.

శంకరాభరణము — రూపకము

ప॥ చేత నను వున్నవఱకు - జేజేలు జయింపలేరు ॥చేత॥

అ॥ ప॥ వీతభయుని నిరుపమాన - నీ కలశభవుని ॥చేత॥

చ ర ణ ము

దీనికొండుపాయ మేను - తెలిపెద నాలింపు పార్థ!

వీనికి వినరానిమాట - వినిచిన ధనువుం దృజించు ॥చేత॥

క. భీమునిచే బడె నశ్వ
త్థామయనంబరగు దంతి ♦ దానినెపముగా
నామాట జెప్పు డశ్వ
త్థామ గతించెనని యాయు ♦ ధము త్యజియించున్.

వ. అంతః బరిమార్పవచ్చు నని పలుక ధర్మజార్జును లొడంబడకుండిరి. భీముండు నని కేకవెట్ట భారద్వాజుండు నమ్మకుండె నట వాసు దేవుండు ధర్మజుంగని సాభిప్రాయమ్ముగ కర్తవ్యమేమన నతం డిట్లనియె.

ఉ. సేయునదేమి? కుంభజు డ ♦ జేయుడు, సందియ మందు లేదు, నే
నేయొదిరింతు నయ్యనఘు ♦ నెట్టులనో నను బంపుడయ్య లే
దా, యనినేత మానుకొని ♦ యందరము న్వెపినాంతరమ్ములం
బోయి తపంబు సల్పుదము ♦ పుణ్యులు మాను లుపన్యసింపగన్.

వ. అనినవిని కృష్ణుండునవ్వుచు.

ఉ. అమ్మహనీయుతో బెనగ ♦ నక్కఱలేదు నృపుండ వాటచే
దమ్ములతో వనమ్ములకు ♦ ధర్మజ! పోబసలేదు, పోయిన
న్నిమ్ము గురుండు తావిడుచు ♦ నే? యడియాసయెగాని, మాటసా
యమ్మెన్నరింపు మీావనృత ♦ మంచు మనంబున గొంకకియ్యెడన్

భైరవి — రూపకము

ప॥ తెలిసె నీమనోభిమతము - తెల్లముగా గోపాలా ॥తె॥

అ॥ ప॥ పలుకు మందు వానితో - బిలుకుమా రెనంచుద్రోణి ॥తెలి॥

చరణము

కల్లలాడి గురుని జంపు - కన్నను మఱి పాపమున్నె?
చెల్లరే! యిహపరములకేటు - జెడిధర్మజు జేవకాసిక ॥ తెలి॥

ఉ. బ్రహ్మసురు డయ్యరయో! చదువు ♦ సంచెలు నేర్పిన దేశికుండు వి
శ్వాసములేక దబ్బరలు ♦ పల్కఁగ తాసుని జేయుటన్న రా
కాసులుగూడ సేయని య ♦ కార్యము, తుచ్ఛపురాజ్యకాంక్షచే
వాసియు వన్నెయుం జెఱచి ♦ భారతవంశము పాడొనర్తునే?

చ. వెలదిని గొల్వులో బరిభ ♦ వింపగజూచుట, కాననాంతర-
మ్ముల వసియించుటల్ విరటు ♦ పొంతవసించి వినింద్యవృత్తులం
గొలుచుట సత్యధర్మముల ♦ కుం జెడిపోదుమటంచుగాదె, కా
వలు డనిపించుకొంటినొకొ? ♦ పాయక రిత్తవచించి కేశవా!

వ. అనిన కృష్ణుండును

ఉ. పాండవరక్షణమ్మునకు ♦ పాయము జెప్పితి నాలకింతువా
గండముదప్పు, నాకొఱ ♦ గా, దనృతమ్ము వచించి నీవు తు
చ్ఛుండవుగాకు, ద్రోణునకు ♦ సోదరులందరి నప్పగింతువో?
చండతరాటవి స్థలము ♦ నల్పెదొ? తోచినయట్లసేయు, మిం
దుండబనేమియక్కా? చనెద ♦ నొయ్యన ద్వారకకోయిధర్మజా!

వ. అనిన విని ధర్మజాతుండు వాసుదేవుం గని

చ. అనృతములాడజాల కిటు ♦ లంటినిగాని మహాత్మ! పాండునం
దనులకు దైవము, న్గురుడు, ♦ తల్లియు, దండ్రియు, సర్వమీవె; నీ
వినిచినదెల్ల వీరలకు ♦ వేదము గాన నసత్యదోష మిం
యొయ్యనువున నంటకుండ విజ ♦ యంబొనగూర్పుము మాకు మాధవా!

వ. అనిపల్కిన జనార్దనుండును

తే. గీ. అనిలసూను డశ్వత్థామ ♦ యను గజమ్ము
సేసె, దన్నెపమున నెలు ♦ గెత్తి పల్కు
మవల మెల్లగ కుంజరం ♦ బనుము దీన
ననృతదోషమ్ముగాదు కా ♦ ర్యమ్ము ఫలించు

మంజరులు

అనిపల్కి సమ్మతించి ద్రోణుకడ - కాధర్మజు డేతెంచి
తనకుంగృష్ణుడు చెప్పినవిధమున - ననగుంభజు డాలించి
తనయునికై శోకించి బ్రహ్మాస్త్రం - ధ్రమున ప్రాణమువాసె
గని పార్షతుండు గురునికంఠమ్ము - ఖండింపంగ వడి డాసె.

వ. అట్లుడాసి ధర్మజాదులు వారించినను వినక కరవాలమ్మున ధనురా
చార్యుకంఠమ్మెదెగగోయ సహింపక సాత్యకి ధృష్టద్యుమ్నుంగని

సారంగ - రూపకము

ప॥ క్షత్రియ చండాలుడవై - శవకంఠము గోసినావ ॥క్షత్రి॥
అ॥ ప॥ పాత్రాపాత్రము లరయక - పాంచాలకుల కళంకా ॥క్షత్రి॥

చరణము

ద్రోవది తలవంపవలసె - తోడబుట్టు వీవగుటను
బావమఱదివై పాండవ - భవ్యయశము జెఱచినావు ॥క్షత్రి॥

తే. గీ. కౌరవులు పాండవులు మించి ♦ గారవించు
దేశికునకిట్లు ద్రోహమ్ము ♦ జేసి యెవడు
బ్రతుక నేర్చును నామరూ ♦ పములుగలిగి?
పాండవ శ్యాలకుడవౌట ♦ బ్రతికినాడవు.

వ. అనిన ధృష్టద్యుమ్నుండు సాత్యకింగని,

చ. పరులకు దెల్ప నెల్లరును ♦ ప్రాజ్ఞులెపో! తమతప్పు లెవ్వరో
యెఱుగరు సౌమదత్తిని వ ♦ ధించితి వీవెట్లు? భీష్మునేగతి
న్నరుడు జయించె? నేడు ఘట ♦ నందను గూల్పగ ధర్మసంభవుం
డరిగిన మార్గమెట్టిదియొ? ♦ యందఱకి న్విశదమ్ము గాదొకో?

వ. అని సమాధానముంజెప్ప పార్షతుని చుఱచుఱం జూచుచు నర్జునుం
డిట్లనియె.

ఉ. కల్లలువల్కి నేను కుల ♦ గౌరవముం జెడగొట్టుకొంటచే
నెల్లరిలోన మేముతల ♦ లెత్తక సిగ్గులుచుండ నయ్యయో!
చెల్లని సాహసమ్మున ని ♦ సీ! శవకంఠముగోసి నేటికి
వల్లన నచ్చమైన ద్రుప ♦ దాన్వయము న్మలినం బొనర్చితే?

వ. అనవిని కటకటంబడుచు ద్రుపదసూనుం డర్జునునకిట్లనియె.

చ. ద్రుపదకులమ్ము నల్పువడె ♦ ద్రౌపదినిచ్చిననాఁడె మీకుఁ; మా
కిపుడది క్రొత్తగాఁగలుగ ♦ దేమనుకొన్నను లాభమేమి? చు
ట్టపు మఱియాదనెంచి జగ ♦ డమ్మున సాయముసేయ వచ్చుట
న్నెపమిడి బుద్ధిచెప్పితివి ♦ నిన్ననగా బనిలేదు, వాసవీ!

చ. కలశభవు స్వధించుటకు ♦ గా జనియించితి జన్మమందు కే
వల, మటుగాన గుంభజుని ♦ ప్రాణము వాపితి, దోసమెట్లగున్?
తలపుము, నీతనూభవు న ♦ ధర్మముగా విలుద్రుంచి పోరిలో
బలువురు చుట్టుముట్టి యటు ♦ ప్రాణము దీయగ హేతు వీతఁడే.

వ. అనిపల్కినం గోపించి సాత్యకి,

ఆఠాణా-ఆది

ప॥ సిగ్గుమాలి నోర్మూసికొన కిట్లు - చేసిన చేత సమర్థింతువేల ॥సిగ్గు॥
అ॥ప॥ తగ్గశాస్త్రినీకియ్యెడజరుగమి త్రాగుబోతువలెవదరుచున్నావు ॥సిగ్గు॥

చరణము

శిరమింకను పగులందేల నాలుక - చీలికలై చనదేల? పాపాత్మ!
గురుపరాభవ మహాపాతకమున - కొడిగట్టిన చండాలుఁడ వీవే ॥సి॥

తే. గీ. అనుచు బల్కి రోషారుణి ♦ తాక్షుఁడగుచు
ధరకు లంఘింప దనయురః ♦ దమ్మునుండి
కేశవప్రేరితుండైన ♦ కీచకారి
రయమునఁ బట్టినిలుప బా ♦ ర్షతుఁడు పల్కె.

శా. రాని ఖిన్నాత్మని నిల్వరింపకుము బీ ♦ రమ్మెల్ల జూపింప ని
మ్మెన్నంజూతు, వివాదమేటికి ♦ పోనిమ్మంచు శాంతించుటల్
దానేమో ప్రకటించుకోదొడగె వా ♦ గ్దర్పమ్ము భూరిశ్రవుం
గా నన్నుం దలపోసెనో? విడువు మజ్ఞానమ్ము వారించెదన్.

చ. అనవిని పాండవాగ్రజుడు ♦ నంబుజనాభుడు వారినిర్వుర
న్ననివడి శాంతచిత్తుల నొ ♦ నర్చిరి, ద్రోణసుతుండు నయ్యెడం
గనుగవ నెఱ్ఱదామరల ♦ కైవడి కెంపుజనింప నుగ్రతో
వనుడయి రోజుచుం బ్రళయ ♦ భైరవుపోలిక బల్కె నీవిధిన్.

పూర్వకళ్యాణి - ఖండగతి

ప॥ భండనము తొలగిపో — కుండు డీనాటితో
బనిదీర్తు పాపులారా - పాండునందనులారా! ॥పని॥

అ॥ ప॥ దండనార్హుల రీ ర - పాండవము? గావించి
తండ్రిఋణ మీనాడు - తప్పకే దీర్చెదన్ ॥భం॥

చ ర ణ ము

జనకుజంపిన కోప - మున కుఠారముబూని
జనవిభుల దెగటార్చి - భృగురాముని పోలిక
జనకవధ సంజాత క్రోధ - మున నీద్రౌణి
సాయకాగ్నికి మిమ్ము - శలభముల గావి చు ॥భం॥

వ. ఇట్లుపల్కి,

సీ. బ్రహాండభాండంబు ♦ బ్రద్దలై పేడాత్తి
భోరున పిడుగులు ♦ మ్రోతలెత్త
జవ్వాడి ధారుణీ ♦ చక్రమ్ము దిర్దిరం
దిరుగ, మార్తాండుండు ♦ తేజమెడల,
దిక్సామజమ్ములు ♦ త్రెళ్ళ, చుక్కలు రాల,
గ్రహసమూహమ్ము చీ ♦ కాకుపడగ,
కులశైలములు గ్రక్క ♦ దల, నేడు వారాసు
లేకమై భూభాగ ? మెల్లపొరల

తే. గీ. నస్త్రగురు తనయుండు నా ♦ రాయణాస్త్ర.
మేయగా నది పెనుమంట ♦ లెగయ వచ్చు
టరసి సైనికులెల్లరుం ♦ బఱవ దొడగ
వడి జనార్దను డనె నెల్ల ♦ వారు వినగ.

క. నారాయణాస్త్ర మయ్యది
మీారాయుధములను విడచి ♦ మీావాహనములు
వీరముడిగి డిగ్గి నమ
స్కారము గావింతురేని ♦ కాల్చదు మిమ్ముల్.

వ. అనుటయు సకలజనంబు లట్లుగావించు నెడ వాయునందనుడు సైని
కుల కిట్లనియె.

చ. వణకి నమస్కరింపకుడు ♦ వాహనముల్డిగి శత్రుసాయక
మ్ముగ్న కదిశాస్త్రవర్గ శరణు ♦ బొందుటయే యగు భీతిమాను డే
నణచెద ద్రోణిసాయకద ♦ వానలకీలల రాచపుట్టువం
దిన మగవానికిం దగునె ♦ తేజము మాపుకొనంగ జూచుటల్.

మ. అని కుంతీసుతమధ్యముం డపుడు శం ♦ ఖారావముం జేసి ని
ల్చిన బ్రత్యర్థిశరానలంబు వెసగా ♦ ర్చిచ్చుంబలెం జుట్టు ము
ట్టిన గృష్ణార్జును లాయుధమ్ముగొని య ♦ ట్లై తేరిపై నుండి చ
య్యన నాభీముని డిగ్గద్రోసి రిల క ♦ య్యస్త్రంబు శాంతింగనెన్.

వ. అంత నశ్వత్థామయు గోపావేశంబున ధృష్టద్యుమ్న సాత్యకుల మూర్ఛనొంచి కవ్వడిం దలపడి.

శంకరాభరణము - త్రిశ్రగతి

ప॥ మాకడ విలువిద్య నేర్చి - మాపై దలపడెదవా ॥మా॥
అ॥ ప॥ పోకార్తు న్నేడు పారి - పోక నిల్వు మో క్రీడీ ॥మాక॥

చ ర ణ ము

కల్లలు బల్కించి ద్రోణు - గడతేర్చించితివి చెనటి
యిల్లలికిన బాడువయ్యె - నే ద్రోణాయుని లేడే ॥మా॥

తే. గీ. అనుచు బావక బాణమే ♦ యం గిరీటి
పరగ బ్రహ్మాస్త్రమున దాని ♦ సమయముజేసె
ద్రోణి విలుపాఱవైచి ర ♦ ధమ్ము డిగ్గి
యేగునెడ వ్యాసుడెదురై వ ♦ చించెనిట్లు.

మ. నరనారాయణు లాదిమానులు జగ ♦ న్మాన్యు ల్పుమస్తావనీ
భరముంబాపగ ధర్మమెల్లెడల ♦ నిల్పన్ జన్మము బొంది రి
ద్ధర గృష్ణార్జుననామము ల్వహించి స ♦ త్యబ్రహ్మ ల ♦ వ్వారె ని
ద్దరులైనం బరిమార్పజాలరు యథా ♦ ర్థంబిద్ది ద్రోణాయనీ!

వ. అనిపల్కి వ్యాసభగవానుం డంతర్ధానంబు నంద ద్రోణియు కురుపతి పాలికింబోవ బాండవులు సంతసమ్మున నిజశిబిరంబులకుం జనిరి.

శ్రీ

# మహాభారతము

## కర్ణప్రతాపము

భైరవి - ఖండగతి

ప॥ వినిపింతు కర్ణప్ర - తాపసత్కథ నేను
వినుడు పుణ్యాత్ములారా - సభాసదులార ॥వి॥

అ॥ ప॥ ధనువు చేతంగొన్న - ఘనులలో మొనగాడు
ననిమిషాదులకే - నజేయుండు కర్ణుండు ॥వి॥

చరణము

శరగురుండు గతింప - కురువిభుడు రాధేయు
సైన్యాధిపతిగ జేసె - దూర్యారావమ్ములు మ్రోయగ
నిరుపమ పరాక్రమము - నెఱపి రిపుసైనికుల
నుఱుమాడె తొలినాటి - బవరమున నంగపతి ॥వి॥

సీ. తగిన సారథిలేమి ♦ తలచి దుర్యోధనుం
డంగరాజునకు మ ♦ ద్రావనీశు
సారథ్యమొనరింప ♦ సంప్రార్థనము సేయ
విడక తోచినరీతి ♦ విచ్చలవిడి
నేమేమి పల్కిన ♦ నిచ్చగించు నిబంధ
నమ్మున శల్యుండు సమ్మతించె
నుభయసైనికులు ర ♦ ణోర్వి కేతెంచిరి
సంగరప్రారంభ ♦ సమయమునను

తే. గి. అశ్వహృదయజ్ఞుడగు శల్యు ♦ డట్లు తనను
సూతుడవొనటంచు మె ♦ చ్చుచు దినేశ

నందనుం డెంతయు న్మహా ♦ నాద మంది
పలికె నీవిధి మద్రభూ ♦ పాలుతోడ.

ఉ. సూతకులుండు వీడనుచు ♦ సుంతయు రోయకు మాత్మలో, బురా
రాతికి నల్వపోలిక, బ♦లారికి మాతలి కైవడిన్, మురా
రాతికిరీటికిం బలె, దు ♦ రమ్మున మద్రధ చోదకుండవై
ఖ్యాతిగడించి నాకు విజ ♦ యం బొడగూర్పుము మద్రభూవరా!

ఉ. కవ్వడిగాడు నేడు కట ♦ కంతుడె నిల్చిన నిల్చుగాక దా
దవ్వుల బాఱదోలి భుజ ♦ దర్పము సూపి విరోధివర్గముం
గ్రొవ్వడగించి శక్రసుతు ♦ గూల్చి సుయోధను నప్పుదీర్చెద
న్నవ్వులుగావు నానుడులు ♦ నమ్ముము సేయుము సూతకృత్యమున్

వ. అనిన శల్యుండును

కేదారగౌళ - రూపకము

ప॥ కుంతీతనయుల రణమున - గూల్తునన జగమునవ్వ ॥కుం॥

అ॥ ప॥ చింతింపుము మాటలకుం - జేతలకుం జాలదవ్వ ॥కుం॥

చరణము

కవ్వడితో నీకుఁ బోల్కి - కలదా? సూతకులీనా
యెవ్వరెఱుంగనిది నక్క - యేడ? నాకలోక మేడ ॥కవ్వ॥

సీ. కులమా, ప్రసిద్ధ వీ ♦ రుల కాలవాలమై
యలరారు నల భార ♦ తాన్వయమ్ము
బాహువిక్రమమా, భ ♦ వానీకళత్ర బి
డౌజాది సన్నుతి ♦ భాజనమ్ము
సాధనప్రకరమా, ♦ సర్వసుపర్వ ప్ర
సాదిత దివ్యాస్త్ర ♦ సంచయమ్ము
సారథియా, ♦ సమ ♦ స్త జగన్ని యామక
స్తవనీయదేవతా ♦ చక్రవర్తి

తే. గీ. నిరుపమాన ప్రభావుడ ♦ న్నిట గిరీటి
యాతనికి నీకు బోల్కి లే ♦ దరసిచూడ

గడ్డిపోచయు గదలింప • గా నశక్తు
లకు భవాదృశులకు ప్రగ • ల్భములు మెండు.

చ. భువనములెల్ల భస్మమగు • బూజ్యు డజాతశత్రుండె యుల్గుచో
బవనసుతుండు చేతగద • బట్టి రణంబున నిల్చెనేని వా
సవ వరుణాది దిక్పతులె • ప్రాణభయమ్మున పాఱజూతు, రా
కవలు నిరంకుశు స్సమర • కర్కశు, లెవ్వనిగూల్తు వీరిలో?

వ. అనవిని రాధేయుం డిట్లనియె.

మ. సరిలే సారధి చేయనైన యుపదే • శంబిద్ది యూ? క్రీడిమా
దిరి నేపోగలేనా? శౌరికరణిం • జే కేవు పోలాగనే
వా? రణోత్సాహము వాపె దేమిటికి? చా • వు ల్మర్మముల్ జెప్పి, పా
మరులై యట్లు తమంత నేపడిన భీ • ష్మద్రోణు లన్కొంటివో?

వ. అనిన శల్యుండును,

తే. గీ. దేవకీతనూజాతు మా • దిరి రథమ్ము
నడుపనేర్తు నేమూ కాని • నరునివోలె
నీవు యుద్ధమ్ము గావింప • లేవు, నిజము
నీకు జయమనుమాట కుం • దేటికొమ్ము

వ. అనిన విని కినలి రాధేయుం డిట్లనియె.

నాట - ఆది

ప॥ నోరుమూసుకొని- తేరువోనిమ్ము కాఱులాడి ప్రాణముల కు చెడకుము॥
అ॥ప॥ మేరమీరి పరుషోక్తులాడెదవు నారాప్రావితోనే నిను యూనాడు

చరణము

పరుసవాక్యలు దలంపక పురుషులు పనిశలుం గినజాతుఁడుగా దే
పరువుమాలి ఘలుపురకు బుట్టిన-పాపాత్ములు మీ ప్వరెటుంగను॥

తే. గీ సర్పసాయక భార్గవా • స్త్రములుగలవు
మాధవధనంజయుల బరి • మార్చి కెట్టు
లూరకేపోవు నయ్యది? • తేరునడపు
మీ నిరుత్సాహవచనంబు • లింక మాని.

వ. అనవిని శల్యుండు,

ఉ. పాయుదు రాప్తబంధువుల ♦ భార్యల నమ్ముగ జూతు రంగదే
శీయులు, వారికేలిక వి ♦ సీ కలు ద్రావితినన్న మాత్ర నా
కీయెడ బర్వ్వపోవునె? మ ♦ హీసుర శాపమునన్ రణావని
న్నియరదమ్ము గ్రుంగదొకో? ♦ నిష్ఫలమేగద భార్గవాస్త్రముల్?

శా. లేవో ద్రోవది పెండ్లినాడు సమరో ♦ ద్వేజిత్రసేనుండు గొం
పోవం గౌరవనాథు నీవచటలే ♦ వో? లేవొకో ఘోరతల్
గోవుల్దోలుకపోయినాడు? కుమతీ! ♦ గుర్తింపగా నేరకు
న్నావో పార్థునిలావు? క్రిందపడియు ♦ న్నావంచెమే యాడువే?

క. అనిన న్నవ్వి రాధేయుడు
వినవియాటు నటించి కృష్ణ ♦ విజయుల జూపిం
చినవారలకు ధనము పా
యనముగ నిచ్చెదనటన్న ♦ ననె శల్యుంకున్.

శ్రీరాగము-రూపకము

ప॥ ఎవరుంజూపగ బనిలే - దీ యపాత్రదానమేల ॥యె॥

అ॥ ప॥ విరమించుగదా గాండీవ - విముక్తశరపరంపరయె ॥యె॥

చరణము

దేవదత్త పాంచజన్య - దివ్యారవములె సూపును
కావలసిన కపికేతన - కాంతిపుంజమే సూపును ॥యె॥

సీ. వైశ్యపుత్రకులొక్క ♦ వాయసంబున కొంగి
ఘులువెట్టి మేపగా ♦ క్రొవ్వ్వెక్కి
రత్నాకరముపొంత ♦ రాయంచ నొకదాని
గాంచి నాతో బర్వ ♦ గా వచ్చెగు
మని మింటికెగసి పా ♦ ఱు, నొకంతకాయాస
పడి యీలాలించి య ♦ వ్వనధిముగ్గ
నంతలో గనుణించి ♦ హంసయు వీపున
నుంచుకొ కాకమ్ము ♦ నొడ్డజేర్చె,

తే. గీ. కురుకుమారులయొంగిళుల ♦ గుడుచు క్రొవ్వి
కొలదియెఱుగక కాకమ్ము ♦ వలెను రాజ
హంసయగు పార్థునెదిరించె ♦ దక్కుతమున
చేటువాటిల్లు నీకు ము ♦ మ్మాటి కిపుడె

చ. హరిణము కేసరిన్, శశము ♦ హస్తిని, సర్పము గృధ్రరాజముం
గరమెదిరించు చందమున ♦ గవ్వడితో బెనగందలంతు వీ
కరణి, పురారికి న్వశముగాదు ♦ కిరీటి నెదుర్కొనంగ, నీ
గరువతనం బెఱుంగనిది ♦ గాదుగదా మముబోటివారికిన్?

వ. అనిన కర్ణుండు కటకటంబడుచు గార్యభరంబున గోపమాపుకొని,

చ. అడిగితినే ధనంజయు బ ♦ లాశిశయ మ్మొగి జెప్పుమంచు ని
న్నుడుగక శాత్రవుం బొగడు ♦ టొప్పునె? మద్రప చోదకుండవై
చెడుగవు మిత్రవాచనము ♦ సేయదలంచితి వింతమాత్రనే
జడియుదునే? సుయోధనుని ♦ సఖ్యమెదం దలపోసి సైచితిన్.

వ. అని పల్కునంతలో యుద్ధ ప్రారంభమగుటు సంశప్తకులు సవ్య
సాచిం దలపడిరి. అశ్వత్థామయు ధృష్టద్యుమ్నాదులజంపి కాని
కవచమూడ్పనని పలుకుచు ఘోరమ్ముగ బోరుచుండె. భీమదుర్యో
ధనుండోరుం దాకిరి. కర్ణుండు పాంచాల కుమారులం జెక్కుండ్ర
జంపుచు బాండవసేనం గలంచునెడ సాత్యకి ప్రముఖులు భీమసేన
పురస్సరమ్ముగా సనుదెంచి రాధేయుం దాకునంత, కృపకృతవర్మా
దులు భీమాదులం దలపడి పోరుచున్నంత భీనసేనుం డంతకాకా
రుండై కర్ణనందనుండగు సత్యసేనుం దునుమ రాధేయుండును గనలి
పాండవసైనికులం గూల్చుచు సాత్యకి ప్రముఖుల విరథుల గావించి
ధర్మజుండాకి బిట్టలయించి సారథింజంపి కాందిశీకుం డగుచున్న
యుధిష్ఠిరు దవిలి నిలువరించి యిట్లనియె

దేవగాంధారి — రూపకము

ప॥ ఇంత చేతగానివాని - కేమిటి కీయనిసేత ॥ఇం॥

అ॥ కాంతలకుందీసిపోవు - గదా! నినోసటిృవాత॥యిం॥

చరణము

ఆచారపరుడవు నీకు - యాగాధ్యయనములు సెల్లు
రాచరికపు ధర్మమెంచి - రణమొనరుపరాకుము పొ ॥మ్మిం॥

ఉ. వచ్చినవాడ వేయులతి ♦ వారలతోడనొ కయ్యమాడ కీ
మచ్చున నన్ను బోటులను ♦ మార్కొన జూచెద, వింతసెల్లునే
పిచ్చితనంబు? తల్లికగు ♦ పింతువె కావలెఁ న్నగాని? వి
వ్వచ్చుని చెంత కేని సని ♦ ప్రాణములుండగ జూచుకొమ్మికన్.

మ. అన లజ్జించి యుధిష్ఠిరుండరిగె న ♦ య్యంగాధినాథుండు కో
పనుడై పాండవసేనపైబడియె దు ♦ ర్వారప్రతాపుండు పా
వని రాధేయునిదాకి తూపులగమి ♦ న్వర్షించ గర్ణుండు నా
తనివతుంబు నిశాతసాయకములం ♦ దాటించి నొప్పించినన్.

చ. కనుగవ కెంపుసోప నలు ♦ కం బవమానసుతుండు వజ్రమో
యనదగు ఘోరభల్లమున ♦ నంగనృపాలునురమ్ము సింప మూ
ర్ఛనుగనె సూతసూతి, పెలు ♦ చం జనిభీముడు వాని వాలుకం
దునియలు సేయగా దివ్వర ♦ తోడనె శల్యుడు వానికిట్లనెన్.

సారంగ - ఝంపగతి

ప॥ శాంతింపుమా భీమ - సమదశాత్రవభీమ ॥శా॥

అ॥ ప॥ సుంత కరుణించి తెగ - జూడ కీతని నాల్క ॥శా॥

చరణము

ప్రతినజేసె కిరీటి — రాధేయు గూల్తునని
శతమఖాత్మజు ప్రతి - జ్ఞాభంగ మగుగాన ॥శా॥

చ. అనవిని భీముడు న్విడిచి ♦ యంగవిభుణ్, శ్రుతవర్మముఖ్యులం
బనివడి పెక్కురంగెడపు ♦ పట్టున గర్ణుడుమూర్ఛదేఱి పా
వనిపయి నమ్ములం గుఱియ ♦ వాయుసుతుండును తీవ్రకోపుడై
ధనువునుద్రుంచి నారసము ♦ తత్క్షణమేసె నురమ్మునాడగన్.

చ. శకుని సుయోధను ల్దవిగి ♦ చయ్యన కోపనులై మదద్విప
ప్రకరము నావృకోదరుని ♦ పై బురికొల్పిన గూలనేసి ఘో

టకముల మూడు వేల్గతప్పి ♦ శాకమొయిన బలివెట్టె నుత్తమా
శ్వికుల రణోర్వికి న్భరత ♦ సింహుడు భీము డుదగ్రకోపుడై.

సీ. రాధేయుడా సౌబ ♦ లప్రముఖుల గూడి
పాండవోద్రేకమ్ము ♦ బాపదొడగె
సంశప్తకులు ధనం ♦ జయు జుట్టుముట్టి బి
ట్టలయించి రప్పోరు ♦ నస్త్రవితతి
శారద్వతుండు పాం ♦ చాలకుమారుల
జక్కాడె మారిమ ♦ సంగివిల్లు
ద్రోణతనూజుండు ♦ ద్రుపదతనూజాత
శివరులగ దాకి ♦ చిక్కుపఱచె

తే. గీ. శరవితతి భానుబింబము ♦ మఱుగు పడియె
భండనం బతిదారుణ ♦ భంగినొప్పె
గాంతివడికి వాసవి చెదు ♦ రొక్కసదలంచి
యస్త్రగురుతనయుం డిట్టు ♦ లనియె నల్గి

పూర్వకల్యాణి - త్రిశ్రగతి.

ప॥ బీరమున్న నయ్యెడ నిలు - మోరి రాచవాడా ॥బీ॥
అ॥ ప॥ పోరుమాన్పించ నేను - సేనాని నిలువాడా ॥పో॥

చరణము

అయ్యవారిగూడ కల్ల - లాడి కూల్చి నవా
కయ్యమాడు ద్రోణ తనయు - గనులువిప్పి చూడరా ॥బీ॥

చ. అని శరవృష్టిముంచె దను ♦ జారిసి ఖార్జుని ద్రౌణి, దాన న
య్యనిమిష రాజసూతి చటు ♦ లాంబకముల్ బ్రయోగించి త్రుంచె నిం
పిన. బొడిజేసివాని భృతి ♦ పిసుపు ముబ్బగ, గ్రీడి ద్రోణసం
దను విరథుంబొనర్చి రణ ♦ ధారుణి నిండ ప్రోలంగ జేసెనన్.

తే. గీ. ధర్మసూనుండు తన్నుగా ♦ ధాసుతుండు
తఱిమికొట్టంగ శిబిరమ్ము ♦ దారివచ్చె

నది యెక్కింగి మహోగ్రుండై ♦ యర్జునుండు
గదిసి కర్ణునెదఁ ద్రొక్కిని ♦ కయ్యమాడి

ఉ. భాను సహస్ర తేజమున ♦ భాసిలు కర్ణునెదిర్చి నిల్చితే
కానరు జెంతయున్నఁగని, ♦ యగ్రజుఁడైనను జూచినావు నీ
లోన శ్రమమ్ములగ్గునని ♦ లోదలపోసి ముకుందుఁ గూడి తో
తోడ్తో నరుదెంచి యన్నకుఁ గ ♦ డుం గడుభక్తి నమస్కరించినన్.

తే. గీ. ధర్మసూనుండు క్రీడి రా ♦ ధాతనూజు
గూల్చి వచ్చెనటంచు చెంచి ♦ కుతుకమంది
కర్ణు నీవు వధించిన ♦ క్రమము దెల్పు
మనిన "సెలవిమ్ము కర్ణు గూ ♦ ల్చు" నని పలుక.

వ. ధర్మజుండు నొచ్చియున్నక తమ్మునకలుక గదిలి కవ్వడితో నిట్లనియె.

హిం॥ తోడి - రూపకము

ప॥ సేమముడుగ వచ్చితివా _ చేతగానివాని నా ॥సేమ॥

అ॥ ప॥ చేమోడ్చి యిటుల శిబిరము . చేరిన యీయాతుదాని ॥సేమ॥

చరణము

రాధేయునకోడుదని సు - యోధనుండు మున్నె జెప్పె
యోధుడ నీవని నమ్మిట . వాదియాగాదే నేరము ॥సేమ॥

చ. చులకన జేసి నన్నలుల ♦ సూతసుతుండు శరాభవించిన
దులకు విచారమూనను న ♦ నుం జెయిజిక్కినవాని జంపకే
యలఘుదయామతి న్వదలి ♦ వంనుల కేప్చెద, సూతనందను
న్గనల జయింపలే కిటుల ♦ నన్గని నీవును నేడ్వ వచ్చితే?

తే. గీ. తలప నేనొకరుండ రా ♦ ధాత్రేయున
కోడితిన నంబనేమి? నే ♦ నోడితీవ
వాయుసుతుడును గెవ లిని ♦ వజ్జె యోడి
రిట్లు మనతోడ గూడి శ్రీ ♦ కృష్ణుడా...

చ. కరమున నున్న కార్ముకము ♦ గాండీవమ్ము, రథమ్ము జిందమున్
హరులు నిలింపులిచ్చినవి ♦ యౌంటు. పయిన్ త్రిచోదకుండు

హారియట, సూతనందనున ♦ కావహామం దిటులోడివచ్చితి
వరయహా లోకులెల్ల పరి ♦ హాసమొనర్తురటంచు గొంచెమున్॥

మ. ముచుముందేనును భీముడున్ సుతులమై ♦ పుట్టంగ, పై మాతృసూా
వనకాంతాకుతారమై నిలిచె గ ♦ ర్భంబేల మాయమ్మ కం
తని విచ్ఛిన్నముగాక యాడుదిగనై ♦ నన్ బుట్టగాబోక యే
మని జన్మించె నపుంసకుండితమ? క ♦ ర్మాధీనుడై పుట్టెబో!
మొనగానింబలె బట్టనేటికవిశేం ♦ బున్ జేత గాండీవమున్?

క. కరమున ధరియించుటచే
వరుణాగ్ని లొసంగు గాండి ♦ వంపుంబరువున్
మరమున సారథియగుటన్
హరిమర్యాదయు నశించె ♦ నౌరా! తుదకున్.

వ. అని పల్కు ధర్మజుంగని వాసుదేవుం డిట్లనియె.

శ్రీరంజని - రూపకము.

ప॥ కోపమెఱుగని నీకీ - కోపమేల తమ్మునిపై
అ॥ ప॥ నీపడినపరాభవమున - నీవిటులాడితివిగాక ॥కో॥

చ ర ణ ము

తలచినకార్యము సాధ్యమె - తక్షణమ్మె నెఱనేర్పగ ॥కో॥
తలపవలదె పరులకష్ట - ములు నైతము ప్రాజ్ఞుడవై ॥కో॥

చ. తెఱచుగ దాకుచుండు మము ♦ దగ్రుడినిజంపిన కోపతీవ్రత
న్గురుసుతు, డాత్రిగర్త రథి ♦ కుల్ బయివచ్చుటెఱింగుదేక దాళి
యురయగ సూతసూతి బాహు ♦ శాస్త్రధురంధరు, డట్లుగాన
పిఱివిడువంగ దీరిక ల ♦ భింపని మ మ్మిటులాడ బాడియే.

వ. అని పల్కు గోపాలువచనంబుల బాటింపక,

ఉ. చంపగ లేడితా డతడు ♦ చావ డికేమిటికోయి నీసమ
ర్థింపులు? నేటిదాకమని ♦ రే నభిమన్యు ఘటోత్కచుల్ కటా!
చంపక యుంచువారె తృణ ♦ సన్నిభునీశని జేసి? నన్నుగా
టెంపగలాడెసూతసుతు ♦ డేరి ననంబనిలేదు మాధవా!

ఉ. అస్త్రముల విద్యనేర్పిన మ ♦ హామహు ద్రోణుని కీర్తి సైతము
న్విస్మరించె, గాండివ మ ♦ వశ్యమునీకిడి తా రథమ్మునా
యమ్ముగ దోలనేని తెగ ♦ టార్పుమనేకద కర్ణు,కృష్ణ! క
య్యమ్మున కట్లు నీవు గల ♦ వంచుగదా ధృతిబూని వచ్చితిన్?

వ. అనిన న్విని కనలి విజయుండు వాలుబెఱికి గోవిందుంగని,

చ. ఎవడు శరాసనం బొరుల ♦ కిమ్మను వాని శిరమ్ము గూల్పని
కువ్రతముగ జేసితిం బ్రతిన ♦ కోపము గ్రమ్మంగితి నింతదనక్క వే
లవముగ నన్నుదిట్టిన ది ♦ రమ్మగు తాలిమిబూని, ధర్మ సం
భవుడవ్వగాక నాకిపు డ ♦ వశ్యము చంపక తీర దీతనిన్.

వ. అనుచు ధర్మజుమీది కుఱుకబోవు ధనుంజయుని వారించి వాసు
దేవుం డిట్లనియె.

తోడి - త్రిపుట

ప॥ బాలునిక శాంపిపు మర్జున - చనకునీకిది పాపవర్జన ॥చా॥
అ॥ ప॥ వాలుదూసెద పితరుకర్ణుడె - ప్రభుకు పితృసము డగ్రజన్ముడె॥

చరణము

శ్రీహరాభవశిష్యుడై ని - న్నున్నయుని పాటింపదగునే
చోటికిరే నికన్నదమ్ములు - తుదకు బ్రతీవలు దీర్చుకొనగా ॥చా॥

మ. సకలజ్ఞు ల్వచియింపగా వినవొ? హింస ♦ సాపూర్వకంబౌ ప్రతి
జ్ఞకు భంగమ్ముఘటింప దెన్న డటులం ♦ గావింపకున్నన్, మహా
త్మకులన్ దూరుటయు న్వధించుటయుగుర్ ♦ మారాడ కీధర్మపు
త్రకు వందింపుము నేమనీప్రతినదీ ♦ ఱక దక్కు నీయున్నయున్.

వ. అనవిని క్రీడియు ధర్మపుత్రు నీక్షించి,

ఉ. ఆయధపాణునై బవర ♦ మం దరివీరుల నొంచు భీమమా
ద్రేయుల కొక్కవేళ నను ♦ దట్టగజెల్లిన జెల్లుగాక రా
ధేయునకోడి దూఱి యల ♦ తిన్ శిబిరమ్మున నాడువాని య,
ట్లీమెఱ పాటుబోతవగు ♦ నీవును నన్నిటులాడ జెల్లునే?

గీతమాలిక

సుబలతనయునితో నట్లు - జూదమాడి
ధార్తరాష్ట్రులతో విరో - ధమ్ము, రాజ్య
నాశనమ్ము, మహారణ్య - వాస దాస్య
దైన్యము లెచ్చిపెట్టి యిం - తయును సిగ్గు
పడ, పయోజయైన ద్రౌ - పది కొలువున
బన్నమందుట, నేల్పుట - వ్వనిఁ బ్రతియగు
కుంతి పగవారికొంపల - గుడుచుటయును
నిరుపమాన మహాధను - ర్నిగమవేది
భరత కులదీపకుఁడు గుణా - కరుఁడు చేతి
కెదిగివచ్చిన పదపదా - తొండ్లకొడుకు
నేలపాలౌట యిన్ని నీ - మూలమున నె
మూడె నసిసేయజాలని - వాఁడ విట్లు
తాల్మిగని యుండకే ప్రల్ల - దములు వలుక
నేల? మున్నెన్నొ చేసితి - వింక నైన
చెడుగు పోకడలుడిగి సూ - చెప్పినట్లు
మెదలుకొనదగు నొకమూల - నొదిగియుండి

వ. ఇట్లు ధర్మజు దూలనాడి కౌంతవసికి పశ్చాత్తాపముఁ గాంచి కటకటం
బడుచు వాసుదేవున కిట్లనియె.

శా. రాధానందను గూల్పనైతి, వరధ ♦ ర్మాధర్మ విజ్ఞాతు నే
యోధాగ్రేసరు ధర్మజాతు నిటులే ♦ మోఁ ద్రేలి తూఁగాడుచా
గ్రోధిం గూలితి నొంతియున్నుగతికిన్ ♦ దూరుండనైతిన్ జగ
న్నాథా! నాశిరము త్తరించుకొనెదన్ ♦ దత్పాప నిర్ముక్తికై.

మంజరులు

అనినన్విని వసుదేవతనూజుం - డను పార్థా! యిదియేమి?
కొనకాత్మహత్య జేసికొనఁగ నీ - కు మతిపోయెనా యేమి?
కాకున్న గర్ణుగెల్వఁజాలఁ గీ - కరణి నూహించినావా?
నీకింతటి భీతియేమిటికి గాం - డీవధరుండవు గావా?

వ. అనవిని కిరీటియు,

సీ. రాజసూయమహాధ్వ ♦ రమ్ము సేయించితి
నితనిచే రాజుల ♦ నెల్ల గెలిచి
ఖాండ వారణ్యంబు ♦ గాల్పించితిని హవ్య
వహుచే మహేంద్రుని ♦ బ్రతిఘటించి
యుష్ణీషముల దెచ్చి ♦ యుత్తర కొసగితి
ద్రోణభీష్మాదియో ♦ ధులజయించి
ముజ్జగమ్ములను స ♦ మ్మోదింప జేసితి
గాలకేయాదిరా ♦ క్షసుల గూల్చి

తే. గీ. చించిచెండాడి వాడ గిం ♦ చిదవశిష్ట
మగు త్రిగర్తుల నీరణ ♦ మ్మున నెదిర్చి,
వెఱువ నొక్కింతయుంబుర ♦ హరున కేని
వెఱతునే సూతజునకు గో ♦ వింద ! నేడు.

వ. అని పల్కిన వాసవిం గని వాసుదేవుండును.

మ. అనిలో గర్ణుని గెల్తువో గులవవో ♦ యామాట లట్లుంచుమా
నిను నీవే నుతియించుకొంటి విది సి ♦ గ్గే చంపుకొన్నట్టు లౌ
ననుమానింపకు మగ్రజాజ్ఞ గొని లె ♦ మ్మా వేగమే సంగరా
వనికిం బోదము భీమసేనున కటుల్ ♦ భారంబగున్ ఫల్గునా !

వ. అనిన సవ్యసాచియుం దానుధర్మజు నొవ్వనాడినందులకు గటకటం
బడుచు నన్నకుం బ్రణమిల్లి నాతూల నాడినందులకు క్షమించి కర్ణుం
జంప సెలవీయవే యన ధర్మజుం డిట్లనియె.

చ. కలిగిన సిల్గులన్నిటికి ♦ గారణ మేను ... వే వన
బులు కొ త ... మ్మునర్చికొన ♦ బోదు సుఖమ్మునను ... డెల్లగం
గలన జయమ్ము గాంచెదవొ ♦ కర్ణుని గూల్చి ? సంగరావనిం
దో ... గెదొ ? వాని చేమడియు ♦ దో ? కురునాథు సమా ... శ్రయి ... తు వో ?

వ. అని పలి, శయ్య డిగ్గి మహారణ్య గమనోన్ముఖుండగు ధర్మరా
జు మాధవుండు వారించి ప్రసన్నుం జేయు ... పతండును కృష్ణార్జునుల
నాశీర్వదించి యనుప వారల నరద ... ంబెక్కి యుద్ధావనికిం జనిరి.

చ. సమరముమాని యాయుభయ ♦ సైనికులున్వెఱగందిచూడ ను
గ్రముగ జెలంగుచోఁ బ్రళయ ♦ కాలునిలీల గదన్ధరించి రో
సమున సుయోధనానుజుని ♦ చయ్యననేసె బకాంతకుండు వీ
రమువాసెడి నేలగూలె రుధి ♦ రమ్మును గ్రక్కుచు దుస్ససేనుడున్.

వ. అట్లు నేలంగూలిన దుశ్శాసనుంగదిసి మెడత్రొక్కి భీముండిట్లనియె.

అఠాణా - ఖండగతి

ప॥ చిక్కితివి రోరీ నా చేతికిన్నాళ్ళకిదె
చెల్లించుకొందు బ్రతిన కౌరవకులపాంసన ॥చి॥

అ॥ ప॥ మొక్కదకిబోయె దీవెవ్వాడు దిక్కు నీ
కీభీమసేనుడే నీపాలి యముడురా ॥చిక్కి॥

చరణము

కడిమిసెడి అగ్రజా - జ్ఞాపాశములచేత
కట్టువడి యున్నాడరా — బోనువడిన సింగమువలె ॥కడి॥
నేడుగ నీపనిదీర్ప చేకూరె - సమయమ్ము
గడముట్టదీర్తు నీ - కంఠకావర మెల్ల ॥చిక్కి॥

సీ. నడురేయి కాశికా ♦ నగరమ్ముఁ గాలక్క
యిల్లు గాల్పించిన ♦ ట్లిపుడులేదె
నిద్రితుం ద్రాటబం ♦ ధించి యగాధంపు
టేట ద్రోయించిన ♦ ట్లిపుడులేదె
నమ్మించి యట్టుల ♦ న్నమున విసమ్ము గ
ల్పించి పెట్టించిన ♦ ట్లిపుడులేదె
సతి నేకవస్త్రను ♦ సభకు ముందలపట్టి
యీడిచి తెచ్చిన ♦ ట్లిపుడులేదె

గీ. అన్నగాచునో? సౌబలు ♦ డడ్డపడునో?
కర్ణుడేవచ్చి తప్పింప ♦ గలడొ? యేది
పిలువు మొకపరి గొంతెత్తి ♦ పిల్కుమార్తు
నుండగావచ్చు మీవాన ♦ రొక్క చోట.

వ. అని పల్కి.

సీ. ఆవేశమున బొంగు ♦ చున్ కఠారము దూసి
జళిపి చిఱుపులవ ♦ క్షమ్ము జీరి
యుబికిన శోణితం ♦ బోగి దోయిటం గొని
ప్రతిన లోదలచి ♦ యేవమ్ము గొనక
తల్లిచన్బాల చం ♦ దమున చేవియుపోలె
చవికి మెచ్చుచు సంతో ♦ సమున ద్రావి
మొగమున నెన్నెల్ల ♦ మొగి జల్లికొని భయం
కరమూర్తి నరసింహు ♦ కరణి నొప్పి

తే. గీ. గెడపి దుశ్శాసనుం బిట్టు ♦ కేకలిడుచు
నాడుచుం గుబ్బుచు భుజమ్ము ♦ లప్పళించి
గొఱియలంబలె గురుసేన ♦ దఱిమితఱిమి
యొక్కచో నిల్చి పల్కెన ♦ త్యుగ్రలీల.

శా. రండీ! మాతులమీసముల్ గలుగుశూ ♦ రమ్మన్యశ్యాలీసేన ను
ద్దండు ల్లావుగలట్టియోధులు బళో ♦ దర్పమ్మునన్ నన్ను మ
ర్కొండీ యిఁక నేటి కీకరణి పా ♦ ఱుం బోతులై, సంతతా
ఖండోత్సాహ బలాతిధీరత మిముం ♦ గాఱింపకే పోకు నే?

తే. గీ. అనిన రోషించి కవచిమై ♦ డాదికురుకు
మారదశకమ్ము దాకస ♦ మీర తనయు,
భల్లదశకమ్మునన్ మహా ♦ బలసుతుండు
ధారుణిం గూల్లనేసె న ♦ వ్వారితలలు.

వ. అట్టియెడ కర్ణాది కౌరవసైనికు లెల్లరును సమరవిముఖులై వెలవెల
బాఱియుండ శల్యుండు రాధేయున కిట్లనియె

భైరవి - ఆది

ప॥ తెల్లవోయి చూచెదవేటికి ని - వల్లగాకనా? సూతనందనా ॥తె॥

అ॥ ప॥ యిల్లుదూఱియుండక వీరుడవని పొల్లుబీరమ్ము-లాడితివమ్మా॥

చరణము

సమ్మోకొన్నాడు కురునాథుడు పాం - డవులేవ్వర తెగటార్తు మీరనుచు
సొమ్ముదిన్న విశ్వాసము జూపుము - శూరాగ్రణివై నీవిటులూరక ॥తె॥

తే. గీ. అనిన సమరోన్ముఖుండయ్యె ♦ నంగనృపతి
యంతలో వృషసేనుడ ♦ య్యనిలతనయు
పైనుఱవడింప గోపించి ♦ ఫల్గునుండు
వాని మస్తకముగా ద్రుంచె ♦ బటుశరమున.

మ. తనయుం గూల్చుట సూచి కర్ణుడును క్రోధస్ఫూర్తిమై యుగ్రసం
దను నుద్వేగమువీఱ దాకి నిఖిలా ♦ స్త్రప్రాభవం బేర్పడం
బెనగం గ్రీడియు వాడితూపులగమిం ♦ బెల్లేసి రాధాతనూ
జుని నొప్పించి యొకంత కిట్టులనియెన్ ♦ శూరత్వ మేపారగన్.

ఉ. బాలకుచేతివి ల్విమక ♦ పాటున ద్రుంచి వధింపజేసి తీ
వాలమునం దధర్మముగ ♦ నందులకే వృషసేనుమూర్ధము
న్నేలకు ద్రొల్లనేసితిని ♦ నీవుగి సూడ బ్రతిజ్ఞ దీర్చుకో
జాలితి నాకికన్ మిగిలె ♦ సంగరమందు నిను వ్వధించుటల్.

క. అనిపల్కి ఖచరతండము
తనువినుతింపగ సురేంద్ర ♦ తనయుడు రాధే
యుని దాకునంత ద్రోణా
యని దుర్యోధనుని చెంత ♦ కరిగి యనెనిట్టుల్.

మోహన - ఆది

ప॥ నరనారాయణు లాకృష్ణార్జును - లరయు
మెందే నవధ్యు లజేయులు ॥నర॥

అ॥ ప॥ గురుభీష్మాదుల - కన్న నధికుడే
పరికింపుము నీవిమ్మన కర్ణుడు ॥నర॥

చరణము

సమ్మతింపు మిప్పుడేని సుయోధన - సంధి గావింతు కుడు పాండవులకు
కమ్మగా ననుభవింపు కెరి భాగమ్ము లవ్వాప పోరాల మిడిగి ॥నర॥

చ. నిలుపుము కర్ణునిన్ విజయు ♦ నిల్పుము, శౌరియు ధర్మజుండు నా
పలుకులు విశ్వసింతురు గ, క ♦ వ్వలికవైరియు ధర్మజాజ్ఞలో
మెలగుదు, రిల్లు మాన్యము స ♦ మీకము దాన సమస్తభూజను
ల్గలవాముదక్కి శ్రేయములు ♦ గాంతురు, నీజనకుండు ప్రీతుడౌ.

చ. అరయకుమీ యవధ్యుల మ ♦ టంచు గృపుం డనుచు నాధనంజయు
న్దురమున గూల్పనేర్తుమని, ♦ ద్రోణుడు భీష్ముం డవధ్యులేగదా!
హరికరుణాకటాక్షమున ♦ నా రధికు ల్వరుచె నడంగరే?
కర మడిబీరపుందులువ ♦ కర్ణుడు గూల్పగలాడె కవ్వడిన్?

ఉ. మాధవు డిట్లురా నెడగు ♦ మాటలు పల్కి విసంధి యే
మాదిరి నెట్ట వటన్న యను ♦ మానము వీడగదోయి! యించిశో
తే దిపుడేని యూకొనుము ♦ లెస్సయగున్ బ్రతుకంగ నేస్తు లెం
తేస్మృతి చీకటాయెగలు ♦ నీయలిదంపులు కౌంతేయవేశ్వరా!

వ. అనవిని దుర్యోధనుం డిట్లనియె.

చ. అనుజులు చుట్టములుగూడుకు ♦ లందఱు జచ్చినవెన్క యే ముఖం
బు పగవారితో నిపుడు ♦ పొందొనగూర్చుకొందు? నవ్వడే
నను జగమెల్ల కర్ణుని ధ ♦ నంజయు డొంచు రణంబునందటం
చనెదవు సంగమోటువడు ♦ నా యెపుడేనియు నక్కకూనకున్?

వ. అనిపల్కి సైనికులం బురికొల్పి సమరోన్ముఖుడయ్యె నయ్యెడ
కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం బవలోకింప సుర పితృ విద్యాధర
సంఘంబులును శచీపతిప్రముఖ దిక్పాలకులును నభోభాగమ్మున
నిలిచియుండ నత్యుత్సాహ లిద్దరుం దాకి పోరుచో గవ్వడి యేసిన
బాణమ్ము లన్నియును గర్ణుండు నాశించుచు దివ్యాస్త్రములన్నిటి
నుపసంహరించుచు గృష్ణార్జునులం జిక్కుపరచుచున్నంత గనలి
కమలాక్షుండు కౌంతేయున కిట్లనియె.

కాఫీ - ఆది

ప॥ ఏమివింతపార్థా దివ్యాస్త్రములెల్ల రాధేయుచే వమ్మైచనె ॥నేమి॥
అ॥ప! నీమనంబించట లేదో, భయమందితివో బడలితివో? యుపేక్షింతు॥

# కర్ణవధ

## చరణము

కావలసిన చక్రమ్ము నీకిపుడు-కంఠమీక్షణమ్మున దునుమాడుము॥
దేవదానవుల గెల్చిన నీకుం - దృణసముండుగాదా యీకర్ణుం ॥దే॥

మ. అనఁ గోపించి కిరీటి కర్ణుపయి బ్ర ♦ హ్మాస్త్రప్రయోగ మ్మొనర్చిన గర్ణుండు తదస్త్రముం జెఱచి మా ♦ ర్వేంద్రుంచి, నొప్పించె గృష్ణుని. నివ్వెచ్చుడు నారిఁగూర్చుకొని య ♦ చ్చో శల్యరాధేయులం దనుపు ల్గాడఁగ నేసె బాణవితతిం ♦ దన్నల్ల రగ్గింపఁగన్.

సీ. అశ్వసేనసమాఖ్యు ♦ డగు నాగపుత్రుండు
నాగముఖాస్త్రంబు ♦ నాతదనదు
పొగటనుండ బ ♦ సిండి యొఱంబెట్టి
యనుదినమ్మును దాని ♦ నర్చసేయు
చుండు గర్ణుండు, పా ♦ ర్థుండు మాపెడుభాటి
కాగలే కంగేశు ♦ డా శరమ్ము
వడి వింటసంధించి ♦ కకగంటికి న్గుత్తి
పెట్ట శల్యుం డంగ ♦ విభునకపుడు

తే. గీ. చిత్తవైకల్యముం గల్గ ♦ జేయదలచి
"సూటిచెడె, నేమిసంధాన ♦ పాటవమ్ము?
పరిగ సంధింపు" మన గోప ♦ సంభ్రమమున
సూతసుతు డంత మద్రభూ ♦ నేత కనియె.

చ. అనవసర ప్రసంగము ర ♦ వంతయు సేయక తేరుదోలు, వీఁ
పుననునుబోట్రిజోదునకు ♦ బోరున వంకలుపెట్టు వాడవే?
వినుమినుమాఱు బాణముచు ♦ వింటను గూర్పడు కర్ణుడెన్నడున్
జనములునవ్వగా, తెలియ ♦ జాల వొకింతయు మత్ప్రభావమున్.

వ. అని శల్కి భుజగాస్త్రం బేసిన

తే. గీ. నల్దెసల మంటలెగయ బ ♦ న్నగశరమ్ము
రా, మురారియు పంచాంగు ♦ శప్రమాణ
మరద ముర్వీస్థలిం గ్రుంగ ♦ నదుమునంత
పార్థుని కిరీటము హరించె ♦ బాపతూపు.

వ. అంత జంభాతకసూతి శిఖరరహితంబగు నీలగిరి చెల్వున నొప్పి తెల్లనివాగంజుట్టి క్రమ్మఱం దనపై గవియు సర్పంబు నాఱు బాణమ్ముల దునిమి కోపతీవ్రమ్ముగ కర్ణుందాకి చండకాండముల నొవ్వ నేయుచు కంకటమ్మునిరిచి మకుటకుండలమ్ములు డులిచి పెద్దపెట్టున పోరాడుచు దివ్యాస్త్రమ్ము లుపసంహరించుచున్నంత రాధేయుంకు భార్గవాస్త్రంబు ప్రతిభాసింపక చిత్తవైకల్యంబంది కుందుచో భూసురశాపమ్మున నాతని యరదంపుడాపటికల్లు క్రుంగిన నేటున కనువునెట కర్ణుండు రోషకషాయమ్ముల గన్నిరోలుక రథమ్మునడిగ్గి కవ్వడి కిట్లనియె.

ధన్యాసి - రూపకము.

ప॥ ఆగుమా ముహూర్తకాల - మర్జున నారథము క్రుంగె ॥నా॥

అ॥ ప॥ రాగధర్మడ వాకించుక - రథచక్రము నెత్తుకొందు ॥నా॥

నాట - ఆది

వీతరథునితో బోరుట - నీతిగాదు నినుబోటికి । పూతాన్వయ సంజాతుడ - వాతపురణధర్మవిహిత ॥నా॥

క. విరిదలవాని నిరాయుధు
విరథుని నీబోటి ప్రబల ♦ వీరు లెవరొక్కం
డురె? యేయుదు, రాహల్కుట
హారికిన్ మఱి నీకు వెఱచి ♦ యని వలపకుమా.

వ. అన విని కృష్ణుం డిట్లనియె.

చ. చదివిన ధర్మశాస్త్రముల ♦సారము నేటికి జ్ఞప్తికివచ్చెనే?
మదమును గర్వము న్దురభి ♦ మానము నేమయిపోయెనో? నీతికో
వివుడు విడౌజసూతి యొక ♦ వేళ నినుంగరుణించుగాక, చూ
పదుగద మృత్యుదేవతయు ♦ వశ్యము నీపయి ప్రేమ కర్ణుడా!

ఉ. వంచకులై యమాయకుల ♦ బాండుకుమారుల లక్కయింట గా
ల్పించుటధర్మమా? సభకు ♦ నీడిచి ద్రోపది కట్టుచీర లా

ల్పించుటధర్మమా? విరథు • నెల్లరు దాకి కిరీటిపుత్రు గూ
ల్పించుటధర్మమా? తగవు • లెన్నెద వియ్యెడ సూతనందనా!

వ. అనిపల్కు కర్ణుండు లజ్జించుచు వరదంబు పెకలించికొమ్ము క్రిందికి భుజమ్ములమోపి యెత్తినం బుడమి కులశైలకాననసముద్ర సహితం బాఱంగుళము లెగసె గాని రథచక్రంబులు కదలకుండుట జూచి రాధేయుం డిట్లు నిర్వేదపడె.

గీతమాలిక.

అక్కటా! కాల మాసన్న - మైనయట్లు
దోచు నాకింక దైవమా! - తుదకు నన్ను
పౌరుషవిహీనునట్లు జావ - వ్రాసినావె?
చినతనంబున లక్ష్యవే - ధనపు విద్య
నభ్యసించుచు జన్నపు - టావు జంపి
నట్టి సాధుహింసాఫలం - బనపహార్య
మగుచు కుత్తుక పైగత్తి - యై నటించె,
పుండు వ్రేల్పెట్టి కలగించు - పోల్కియయ్యె
శల్య సారథ్య మాశచీ - జాని కవచ
కుండలమ్ములు గొనిచనె. — గురుడు భార్గ
వాస్త్రము స్ఫురింపకుండ న - న్నటు శపించె,
మఱియుచున్నాడ కొంకకిట్లు - మానవ ప్ర
యత్నమునగాక దుర్విధి - ప్రాతికూల్య
మున రణావని నాసుమో - ధమునికొఱకు;
కన్నతల్లికి భారమై - గంగగలసి
గండముందప్పి వర్ణసం - కరతగాంచి
సోదరుల బాధపఱచు నే - చునకు, కడగి
యన్నదమ్ముల కిట్లు క - య్యములు వెట్టి
పార్థు డెగటార్చ ని ప్రగ - ల్భములు పల్కు
తమ్మిపూవులు కొలను చం - దమున నలరు

కురుకులం బెల్ల మాయించు - క్రూరకర్ము
నకు, దురాత్మునకు, న్నాకు - నలువుర నగు
బాటుగా నెట్లు విజయమ్ము - బడయనగును?
మిగుల నల్లాడు చీకటా - ల్మగల యుసురు
దగుల నెట్లుండును? సాధ్వి మ - తల్లి ద్రుపద
రాజసుతకు గల్పించు ప - రాభవాగ్ని
ననుదహింపక చల్లారు - నా తనంత?
పెంచి పెద్దగ జేసి నా - మంచిచెడ్డ
లరసి మోదించు రాధకు, - నంగరాజ్య
మొసగి మన్నించినట్టి దు - ర్యోధనునకు
ప్రియముగా సంచరించి జీ - వితము ధార
బోసితిని; దానకర్ణు డన - వాసి గంటి,
నిర్విచారమ్ముగా మర - ణింతు నింక.

వ. అని తలంచి గాండీవనిర్ముక్త శరపరంపరకు నోర్చుచు శల్యుంగని యరదంబునంగల గదాదండం బిమ్మన నమ్మద్రేశ్వరుం డెకసక్కె ముగ నిట్లనియె.

శంకరాభరణము - రూపకము.

ప॥ సిగ్గువిడి గదాదండము - చేకొని పోరాడెదవా ॥సి॥

అ॥ ప॥ బిగువుగా పలుకకు మిక - భీముం డిది వినునేమో ॥సి॥

చ ర ణ ము

శ్రమపడి నీనేర్చుకొన్న - శరవిద్యయె యిట్టులుండ
సమరమున గదం బట్టుట - సరిసరి! నగుబాటుగాదె ॥సి॥

క. గుఱిచెడియో గాకోదర
శరమని చెప్పినను వినవు ◆ సమరమున నికే
కరణి న్విజయుని గూల్చెద?
వరయుము, గదబట్టుకొంక ◆ హాస్యాస్పదమా

వ. అనవిని కర్ణుండు కటకటంబడుచు శల్యున కిట్లనియె.

తే. గీ. మణియని తలంచి చేసగ్ని ♦ కణము దాల్చు
నాకు దగుశాస్తి జేయుచు న్నాడ వీవు
వికటముగ బల్కుచున్. వ్యాధి ♦ పీడితునకు
పెదవి విఱిచిన వైద్యుని ♦ విధము దోప

క. అనిపల్కుచు గదకేలం
గొనె కర్ణుం డంతలోన ♦ కురువిభు డంపం
జని ద్రోణతనూజాతుం
డనియెన్ రాధేయుతోడ ♦ నాటోపమునన్.

బాగు — ఖండగతి

ప॥ విశ్రాంతిగొనుము కురు - విభు డంప వచ్చితిని
వెఱవ నేమిటికింక - విజయునకు రాధేయ ॥వి॥

అ॥ ప॥ అశ్రమంబున మాధ - వార్జునుల బడగొల్చు
నస్త్రవిద్యాపాట - వము జూపి నిన్నాతు ॥వి॥

చ ర ణ ము

నావకాశముగ రథ - చక్రముల నెత్తుకొని
సమరమొనరుప రమ్మ - సగర వీరాగ్రణీ!
భూవిభుడు నీమీద - భార మంతయు మోపి
భూమీవలయమెల్ల - నేలగా నున్నాడు ॥వి॥

ఉ. ఎక్కటిపోరు పోరుటయె ♦ యిచ్చోడ నీ తలపోట నూర కే
నొక్కెడ జూచుచుంటిని, సు ♦ యోధనుపిల్పున వచ్చినాడ నీ
యక్కఱదీర్ప, నికజను ♦ మయ్యెడ నించుక విశ్రమింపుమా
పెక్కులు పల్కనేమిటికి ♦ పీచమడంచెద పార్థ కృష్ణులన్.

వ. అనిన గర్ణుండు,

ఉ. ఏలితి నీ ధరావలయ ♦ మెల్ల సుయోధనుపేరిమీద, నీ
జాలితి యాచకప్రతతి ♦ సమ్ముదమందగ వాంఛితమ్ములన్,
వ్రాలితి సంగరావనిన ♦ భంగుర వీరరసైకమూర్తినై
కూలుదుగాక సాయపడ ♦ గోరుదునే యిక బాపనయ్యలన్?

చ. అనవిని ద్రౌణియుం జనియె ♦ నంగవిభుండు గదాధరుండునై
కినుకదలిర్పగా విజయు ♦ కృష్ణుల గూల్పదలచి యెంతయుం
బెనగదొడంగె నర్జునుండు ♦ వేగ మహాస్త్ర మొకండుదండినై
ధనువున గూర్చి వాకొనియె ♦ తామరసాక్షుని ప్రేరణంబునన్.

మోహన - ఖండగతి

ప॥ ఈమహాదివ్యాస్త్ర - మిపుడ రాధేయు శిర
మిల డొల్లగాజేయు - నేధీరుడనియేని ॥యీ॥

అ॥ ప॥ కామాది విషయవాంఛా - రహితుడనియేని
సోమశేఖర పాద - సేవా రతుడనేని ॥యీ॥

చ ర ణ ము

మాతల్లి కుంతి సా - ధ్వీతిలక మగునేని
మాయన్న ధర్మజుడు - సత్యవ్రతుండేని
నాతమ్ము లనవరత - నుత నీతియుతులేని
నారాయణుండె యీ - నాకు సారథియేని ॥యీ॥

వ అనిపల్కి యయ్యస్త్రమ్ము విడిచిన.

తే. గీ. రోదసీకుహరమ్ము మె ♦ ఱుంగులగమి
నించి సైనికుల స్వాగ్ర ♦ ముంచి సర్వ
భూతకంపన మొనరించి ♦ సూతిసూతి
శిరము తెగిపడ ద్రుంచె నా ♦ శరవరంబు.

ఉ. అంతట కన్నువిచ్చిజను ♦ లందఱు జూడగ దివ్యతేజ మ
ల్లంతనె యుద్భుతమ్ముగ ది ♦ నాధిపబింబమునందుసొచ్చె, న
త్యంతవిషాదభారమున ♦ నాత్మజు డట్లు గతించెనంచు భా
స్వంతుడు తక్షణంబ స నె ♦ పశ్చిమవార్ధి ధానమాడగన్.

సీ. జన్మింపు టావును ♦ జంపినందుల కల్గి
విప్రోత్తముండు శ ♦ పించ జేని
జమదగ్నిసూతి క ♦ య్యమున నస్త్రము ల న్మ
రింపబోవంచు శా ♦ సింప జేని

కవచకుండలములం ♦ గైకొన బాపడై
జేజేలతేకు యా ♦ చింపడేని
మిన్నేటికోడు కట్లు ♦ తన్నర్థరథు జేసి
బవరమం దవమాన ♦ పఱపడేని

తే. గీ. యాత్మజుల బ్రోవుమని కుంతి ♦ యడుగ దేని
చిత్తవిస్ఫూర్తి శల్యుండు ♦ చెఱుపడేని
కేశవుం డక్రమంబు ♦ సాగింపడేని
కర్ణుని వధింపజాలు వి ♦ ల్కాడు లేడు.

వ. అట్లు కర్ణుండువడ కాము బాసిన కమలమ్ముకరణినున్న యరదమ్ముం దోలుకొని శల్యుండు సుయోధనునికడకుంజన నక్కౌరవేంద్రుండును దీనాననుండై కర్ణవధ సంజనిత దుఃఖావేశమ్మున నిట్లు వాపోవ దొడంగె.

నీలాంబరి - రూపకము

ప॥ నమ్మికొన్న కర్ణుడువడె - నాకికేటిబ్రతుకు ॥న॥
అ॥ ప॥ బమ్మరాతి దర్పపుగ - వశమె మానవుడకు ॥న॥

చ ర ణ ము

పాండుతనయు లేవు రట్లు - బ్రతికియుండిరా
భండనమున నాతమ్ములు - ప్రాణ మెడసిరా ॥న॥

తే. గీ. మనసుగలసిన మేటి సా ♦ మంతరాజు,
మంచిచెడ్డ నెఱింగించు ♦ మంత్రి, నాగ
డీడు, వెన్నంటి తిరుగాడు ♦ తోడునీడ
వాడిగ-జోదు కర్ణుంబు ♦ నేడు లేడు.

వ. అని విచారించు కురుపతికి శల్యకృపాశ్వత్థామలు ధైర్యమ్ము నెవ్వుచున్నంత సంధ్యాకాలం బగుడు పోరుసాలించి కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తములు పూరించుచు శిబిరమ్ములకుం జనిరి.

శ్రీ

# మహాభారతము

## సామ్రాజ్యసిద్ధి

ఆనందభైరవి — రూపకము

ప॥ పాండవ సామ్రాజ్యసిద్ధి - భవ్యచరిత మాలింపుము ॥పాం॥

అ॥ప॥ పుండరీకనయనుని కృప - బొంది విజయమును గాంచుము ॥పాం॥

చరణము

కానీనుడు పడినయంత - కౌరవపతి కయ్యమ్మున

సేనాధిపతిత్వమునకు - జేసెను శల్యు నభిషిక్తు ॥పాం॥

సీ. శల్యుండు కౌరవ ♦ సైనికులం బురి

కొల్పి పెక్కుర నాజి ♦ గూల్చి కడకు

పాండవాగ్రజు డాకి ♦ ప్రాణముల్ గోల్పోయె

కురుసేన యంతయుం ♦ గూలె కలన,

కురునాథు డటభీతి ♦ గొని గదా కలిత మ

హా భుజుండై యొక్క ♦ డై చనిచని

ద్వైపాయనంబను ♦ దనదు హ్రదమున జ

లస్తంభనమ్మున ♦ డాగియుండె

తే. గీ. పాండుసుతు లయ్యది యెఱింగి ♦ పద్మనాభ

సహితముగ నయ్యెడకు జేరి ♦ సంతసమున

మడుపునందున్న నృపుని వె ♦ ల్వడగ జేయ

దలచు చో ధర్మజుడు సుయో ♦ ధనున కనియె.

కన్నడ - చతురశ్రగతి.

ప॥ కలహారందరి కలహ గూల్పించి జలమున మునిగినాడవా....॥క॥
అ॥ తులువనిజాడ తెలియజాలమని తలంచి కులుకుచున్నాడవా॥కల॥

చరణము

మానధనుడవను మాట నేటితో మాపుకొన నెంచినాడవా
హీనపుంజావు చావ బొల్పుడితి నిది మేలనుకొన్నాడవా ॥కల॥

చ. మనువునదాగిన తెబరిమార్పకయుందువె? క్షత్రధర్మమున్
విడిచితి వంతెగాక, పరు ♦ వే? కురువంశపు రాచవానికీ
నడవడి, లోకులెల్ల నిను ♦ నవ్వరొకో? మగవాడ వైన వె
ల్వెనము ప్రాణమ్మికై వదలు ♦ వారముగాదుసుమా, సుయోధనా!

చ. అవని సమస్తమేలుకొను ♦ మూలమునన్ మము గెల్చి, లేనిచో
బవరమునన్ మృతుండవయి ♦ స్వర్గసుఖమ్ముల జూఱగొమ్ము శా
స్త్రవులకు జంకి యిట్లిపావ ♦ రమ్ములకుం జెడనౌనె? రాజరా
జ, రణకోవిదుండవయి ♦ క్షత్రియగౌరవ మేటగల్పెదే?

వ. అని పల్కు ధర్మజునకు మానధనుండగు సుయోధనుం డిట్లనియె.

చ. అలసటనొంది వచ్చితి భ ♦ యంపడిగాదు రవంతనీకు; నే
వలు వివిధాయుధమ్ములును ♦ నాకడలే వొకరుండ నేవురీ
రలు బవరమ్ము సెల్లునె? య ♦ రణ్యములా దపమాచరింతు భూ
వలయము నీకొసంగితి నృ ♦ పాలుడవై చిరమేలుకొమ్ము కన్.

వ. అనవుడు పాండవాగ్రజుం డిట్లనియె.

చ. కలసిరి దానపూర్వకము ♦ గా గ్రహియింపగ మేము శాపన -
య్యాల మనుకొంటివా? కురుకు లాధమ! నిన్గలన న్వధించు చే
తలపగుగాని సర్వసుసు ♦ ధావలయం బిపు డేలుకొంట మా
తలపును గాదు నీకిచట ♦ తప్పదు మృత్యువు, లెమ్ము పోరికిన్

ఉ. తమ్ములు కర్ణసౌబలులు ♦ తాము రణమ్మున జచ్చు చీయుపా
యమ్ములను జెప్పిచచ్చిరె? నృ ♦ పాధమ! వల్కలధారివై యర
ణ్యమ్ములనైతముం జెఱతు ♦ వా? యపవిత్ర పదమ్ములుంచి, వే
నమ్ములు సాగవింగ భుజ ♦ సారము జూపుడు రమ్ము పోరికిన్.

వ. అనిపల్కు ధర్మజుని పోటుమాటలకు దుర్యోధనుండు చిత్తంబు త్తలపడ పుట్టలోపలి మహాభుజగేంద్రుంబలె రోజుచు జలస్తంబు డిపికొని మదువు సంక్షోభింప కాలదండంబు బోని గదాదండంబు నంస పీఠమ్మున నమర్చుకొని బయల్వెడలి యుధిష్ఠిరానుమతమ్మున గదాయుద్ధంబొనర్ప భీమసేనుం గోరుకొని యాతని దలపడు నెడ నవ్వార్త తీర్థయాత్రలు సేవించి వచ్చిన బలరాముం డేతెంచి ప్రియశిష్యుల గదాయుద్ధమ్ము సూడ నరుదెంచ కరువేర ధర్మజుం డెదురై యాదరించె నంత నెల్లరుం గలసి పోలికలనికిం జని భీమ దుర్యోధనుల యుద్ధభూమి న్నిలిపిరి. అంత వారిద్దరు వాసవ వృత్రాసురు లట్లొండొరుదాకి నేలవడంక లావును వేగంబును దర్పంబును జూపుచు వెఱగె బుట్టింప భోరుచో గొంతవడికి వాయుసూనుం డలసటం జెంది యోటుపడనున్నంత గుర్తించి కృష్ణానుమతమ్మున నర్జునుం డూరుతలమ్ము కరతలమ్మున నప్పళించి నన్నజేయ గ్రహించి భీమసేనుండు రిపువ్రం కెగసి పోరాడు కురునరేంద్రుని యూరుభాగమ్ములనేయ దుర్యోధనుండు తొడలు విఱిగిపడియె నట్లుపడియున్న సుయోధనుని శిరమ్మును బకారి వామపాదమ్మునం ద్రొక్కి పలువిధమ్ముల దూఱుచు నన్న ధర్మజాతుండు వారించినను వినక మజల నాతని శిరమ్మం దన్నునంత హలాయుధుం డల్గి ప్రళయరుద్రుంబలె మండిపడుచు నెల్లవారల కిట్లనియె.

బిలహరి — రూపకము

ప॥ చూచితిరే! కీచకారి - సూపిన పెనుదుండగమ్ము ॥చూ॥

అ॥ప॥ పీచమడతు వీని నొక్క - వ్రేటున మీరెల్లరు గన ॥చూ॥

చ ర ణ ము

న్యాయమే గదా రణమున - నాభికి దిగువం గొట్టుట?

యీ యధర్మయుద్ధము కను - లారఁ జూచి సైపనగునే ॥చూ॥

క. అని కోపవేగమున రథ
మున నున్న స్వకీయసీర ♦ ముం గైకొని భీ
మునిపై బడ నడ్డముసని
వనజాక్షుం డిట్టులనియె ♦ బలరామునకున్

ఉ. పాండుతనూభవుల్మనకు ♦ ప్రాణసముల్ మఱిగా ల్గలాఫ నా
పుండవు గాన నభ్యుదయ ♦ ల్నమకూర్పగ జెల్లు వీరికిన్
భండన భూమి నూరువుల ♦ భగ్నముసేయ ప్రతిజ్ఞ జేసిభీ
ముం డది నేటికిన్నెరవె ♦ మోసమునాగాను శమింపు మగ్రజా!

వ. అనవిని సీరపాణియు గృష్ణా! తలదన్నినందుల కేమి సమాధానము
జెప్పెదువన,

ఉ. తప్పిదమానుగాక తల ♦ దన్నుట, యీతని దుష్కృతాళి నీ
తప్పదు సేత పోల్పగ శ ♦ తాంశముగాదు, తలంపు మీ కలిం
దప్పక నాల్గుపాదముల ♦ ధర్మమెట్టుల్నడచున్? బకాంతకుం
డప్పుడొనర్చె నేమొ నృప ♦ నొదల దన్ను ప్రతిజ్ఞసైతమున్?

వ. అనిపల్కు గోపాలుని సమాధానమ్మున కేవగించుకొనుచు హాలా
యుధుండు సనె నంత ధర్మసూనుండు సుయోధను దుస్థితిం గని
జాలిపడి యతనిం గౌగలించుకొని,

ఉ. తమ్ముడ! నేడు నాదు పెద ♦ తమ్ము డొనర్చినయట్టి దుష్ట క
ర్మమ్ము సహింపు మేదికి ద ♦ రమ్మగు బూర్వకృతమ్ము దాటగా
నెమ్మెయి నీవె బల్ సుకృతి ♦ వెంతయు నీగతి బాంధుకోటి నా
లమ్మున జంపి చేకొనిన ♦ రాజ్యము మాకు సుఖం బొసంగునే?

వ. అని విచారించు ధర్మజునకు వాసుదేవుం డిట్లనియె.

తే. గీ. సమరవిజయమ్ము గైకొన్న ♦ సంతసమున
కడలు ప్రమోగించి విజయధ్వం ♦ కారమ్ము
కోరి సింహపు నైపై ♦ నూరుచున్న
కేతు వేమిటి కో యుధా ♦ యికపు శాఖా

వ. అని యిని ధృతరాష్ట్రుండును శోక విహ్వారమ్ములు ముప్పిరిగొన విలపించుచు మోము వ్రేలవేసి చేతుల భూతలంబు జూడికొని శోకాతురుండై యాకాశంబు జూచుచు నిట్లనియె.

సావేరి — రూపకము

ప॥ నల్లగొల్లవాడ గపట - నాటక మాడించినావ ॥న॥

అ॥ ప॥ చల్లగా దాయాదుల కిటు - సంగరమ్ము సంఘటించి ॥న॥

చ ర ణ ము

దూరమున మఱచుల కీమా - దిరి పొగవు బుద్ధినొల్లి
ధరణివలయు బళిలము . ధర్మజాతుల బట్టినాన ॥న॥

సీ. మోహారమ్మున చక్ర ♦ ముం దాల్పనసిలిగొ
 ప్రతిన వట్టియు నుచే ♦ పట్టి తీవు
కదనమందు శిఖండి ♦ నెనుట నిల్పించి క
 వ్వించి శాంతనవు గూ ♦ ల్చించి తీవు
సంగరమ్మున ధర్మ ♦ జాతుచే ననృతమా
 డించి కుంభజుని జం ♦ పించి తీవు
దూ రపంను క్రీడికి ♦ సారప దేశం బొన
 రించి కర్ణుని దుని ♦ మించి తీవు

తే గి. కొడుకు వనుగూడ రణమునం ♦ దొడలు విఱుగ
 నీ వృకోదరుచేత గూ ♦ ట్టించి తీవు
 భరతవంశమ్ము జెఱుప బా ♦ ల్పడితి వీవు
 కంసదాసకుమార! వి ♦ జ్ఞానదూర!

ఉ. నాలుగు వేదము ల్చదివి ♦ నాడ, మహేంద్రుసిలీల భూతలం
 బేలితి, నీప్సితమ్ముల ఘ ♦ టించితి నర్థులకెల్ల, జన్మముల్
 మేలుగ జేసితి న్యశము ♦ మింటను మేదిని నిండునట్లుగా,
 నాలమునందు గూలితి, ము ♦ రాంతక! నాకిక లోపమున్నదే?

ఉ. సంతసలేక, బంధులు ♦ సైనికులు న్మరిపెమ్ము లేక, వం
 శంపు బ్రశక్తి లేక, పరు ♦ షమ్ముగ కౌరవకాంత లెల్లదూ

పింగవ ధర్మసంభవుని ♦ చే గతిమాలిన పాడునేల మా
యింపుము; పెద్దకాల మిది ♦ యేగద నీదగుపూన్కి? కేశవా !

వ. అనిపల్కు దుర్యోధను వెనుకటి యకృత్యమ్ముల నిర్దేశించి యెత్తి
పొడుచుచు గృష్ణుండు సాత్యకి సమేతముగా బాండవులం దోడ్కొని
పాడటియున్న కౌరవ శిబిరమ్ములో బ్రవేశింపబోనదక్కు జోదులెల్లరు
దమతమ విడిదుల విడిసిరి. కౌరవ శిబిరమ్ములకడ గౌంతేయులు రథ
మ్ములు డిగ్గినెడ గాండీవాది సాధనమ్ములుగొని కృష్ణ ప్రేరణమ్మున
నర్జునుం డరదమ్ము డిగునంత బగ్గముల నొగలు ముడిచి శౌరియు
తేరు దిగునంత దక్షణం బారథమ్ము భగ్గునమండె నదిగని నరుం
డచ్చెరువంది కేల్మోడ్చి జనార్దనున కిట్లనియె

అఠాణ - రూపకము

ప॥ ఆనతిమ్ము బావా నా - కరదము మండిన కారణ ॥మా॥
అ॥ ప॥ ఏ నిదివినదగునదేని - యెంతయు నాశ్చర్యకం ॥బా॥

చరణము

కంటికి రెప్పవలె మమ్ము - గాపాడితి వింతదనుక
వెంటనంటి పెన్నె బుల - వంటపీవు కౌంతేయుల ॥కాన॥

సీ. అసిన మురారాతి ♦ యసిరొ వాసవి కిట్లు
ద్రోణ గాంగేయ క ♦ ర్ణుల మహాస్త్ర
పావకజ్వాలల ♦ బడియున్న దీని ర
క్షించితి నెట్టులో ♦ యింతదనుక
జగడంపుగ్రతు వింక ♦ సాంతమయ్యెం గాన
గడకిట్లు గాలగా ♦ విడచినాడ
మురము నారంభించు ♦ తఱి నాకుమధుపర్క
మిడి నిన్నుసూపి ర ♦ క్షింపు మనుచు

తే. గీ. ధర్మజుం డప్పగించె; యు ♦ ద్ధమున నీగ
నేసి నీపయి వ్రాలగా ♦ నీక విజయు

మందజేసి కృతార్థుడ ♦ నగుట కెల్ల
కారణము నాదు మేనత్త ♦ కడుపుజలువ

తే. గీ. అని సమాధానముం జెప్పి ♦ యచ్యుతుండు
వారి నార్వుర దోడ్కొని ♦ చేరె నోఘ
వతియనందగు నొక పుణ్య ♦ వాహినికడ
కచట నిల్లనె వారికి య ♦ మాత్మజుండు.

ఉ. కౌరవనాథు నక్రమము ♦ గా బడగూల్చితిమంచు మమ్ము గాం
దారికపించునే ముకా? జ ♦ నార్దన! నీవొకతూరి పోయి యా
వ్వారల నూఱడింపు మన ♦ వారిజనాభుకు సత్వరమ్ముగా
వారణపట్టణమ్ము నవి ♦ వచ్చె వెసం బనిదీర్చి యెంతెయుఁ.

క. వారిజనాభుడు పాండు కు
మారుల కనిదీర్చి సుఖము ♦ మై నుండ నటఁ
గౌరవపతి తలిదండ్రుల
పేరుకొనుచు నొంతయేని ♦ విలపించె నిటుల్.

ముఖారి - ఆది

ప॥ తొడ విఱిగి పుడమింబడి యు టిని ధూళిధూసరిత దేహుండవై తుది॥

అ॥ ప॥ చెడుగులై నకొడుకు మూలమ్మునగుడి చెవిరాక్షసము వార్ధకమున॥

చ ర ణ ము

చీకుటాల్మగలు విరాకింత నేడు—చేయూతగ నొకడైన లేకుండ
బోఖొకార్బంచినసుతుడ న్నిమ్ము—శోకార్ణవసర్మగ్నులం జేసి ॥తొ॥

ఉ. ఎందరి గన్ననేమి? తుద ♦ కిల్లసహాయు జేసు నేటికీ
కిం దొడగూర్చితిఁ విధవ ♦ కూతురు దిక్కుగ వార్ధకమ్మునఁ
బందుగులైన లేక పగ ♦ వారల కొంపల కంపి కూటికై
కంద సుయోధనుం తొడలు ♦ వాయు నిదే క నన్, క్షమింపుడీ.

వ అని విలపించుచు భానుమతిం దలఁచి.

చ అడయగ నొడక న్నాఱుగ ♦ నట్టె లతాంగిని, నేను ద్రోవదిం
బరిభవముం బొనర్చిన ♦ కమ్మున వాయుసుతుంబ కోపసం

భరమున మాలహాని సలు ♦ పం దలపెట్టునో నీకు? కావునన్
శరణము వేడుకొమ్మిప్పుడ ♦ జాతరిపున్ సమవర్తినందనున్.
గీ. ఇట్లు పలవించు ధరణీశ ♦ లేంద్రుకడకు
గృపుడు కృతవర్మ ద్రౌణియు ♦ నేగుదెంచి
సర్వము నెఱింగి బిట్టు వి ♦ చారపడిరి.
వారిలో ద్రౌణి పల్కె గో ♦ పమ్ముగదుర.

పూరి — ఆది

ప॥ నిష్కర్మయుద్ధమ్మున గూల్చిర నీటినుండి వెడలించి పాండవులు॥
అ॥ ప॥ అన్నన్నా! తలచన్నైనా? భీమా నవ్యాయంబని తలచక శివశివా॥

చరణము

నేడె పాండవము గావించి ద్రౌణి - నీమనోరథము దీర్పగా గలదు
వాడిసూపి రిపువారమెల్ల ను - గ్గాడువాడ నన్నభిషేకింపుము ॥ని॥

చ. అనవిని కౌరవేంద్రు డపు ♦ డాత్మపుఁజే జలమంది ద్రోణనం
దను నభిషిక్తు జేయ బ్రమ ♦ దమ్మున ద్రౌణియు సింహనాదముం
బొనరించి యాదవోత్తము కృ ♦ పుల్లన నయ్యెడ దోడుగాగ న
ల్లన చనె పాండుపుత్ర శిబి ♦ రంబుల పొంతకు, జారెసంజయున్.
ఉ. సైనికులెల్లను న్నిలుపు ♦ నం డి నుండు కెంబొంగి మువ్వురు
న్మానుగ కొం డ వ్వెరిగి ♦ మార్గమున న్వటభూజ మొక్కెడం
గానబడ న్సమీపమున ♦ కర్కశినా ధరణీ తలమ్మునన్
మేనులువైవ నిద్రవోడ ♦ మెన్ గృతవర్మకు ద్రౌణిమామకున్.
సీ. క్రోధాతిశయమునన్ ♦ గుహనందకుడు నిద్ర
పోవక యావ్వట ♦ భూజశాఖ
గనుగొనుచో నులూ ♦ కంబొండు కొమ్మపై
విహరించువాయస ♦ నివహములను
కంఠముల్ నులిపి ప ♦ క్షమ్ములు నలికి పొ
ట్టలు వ్రచ్చుచుఁ జంపు ♦ దిలకించి
కౌశికం బట్లుప ♦ దేశమిచ్చె నటంచు
దలచి యిరువ్వర మేలు ♦ కొలిపి తాను

తే. గీ. నావిధిం బాండవుల దెగ ♦ టార్తుననుచు
పాపభీతి సుంతయు లేక ♦ వదరుచున్న
భాగినేయుని సక్రమ ♦ పథమునందు
నిలుప శారద్వతుం డిట్లు ♦ పలికెనపుడు

అఠాణా — రూపకము

ప॥ నీకు వీరధర్మమగునె - నిద్రాసక్తుల గూల్చుట ॥నీ॥
అ॥ప॥ కాకమ్ముల జంపు నా — యులూకమా యుపదేశమిడుట ॥నీ॥

చరణము

1. అభిమతిపాత్రుండవె ద్రోణు - రాచార్యుని పుత్రుండవు
శుభకరుడవు భూసురుడవు - శూరజనాగ్రేసరుడవు ॥నీ॥
2. క్రోధగుణము పాపములకు - గుదురై వివేకము
క్రోధలోభముల దగిలిన - కురుపతి గూలుటెఱుంగవె ॥నీకు॥

మ. ఉపకారంబగునే? సుయోధనున కీ ♦ యుద్రేక మూహింపగా
నపకారంబగుగాక పాండవుల, కే ♦ లావంశ విచ్ఛేద మీ
విపు డన్యాయముగా నొనర్చెదవు? కా ♦ దేని న్సమీపంబునన్
రిపులం గూల్పు మెదిర్చియట్లయిన గీర్తింతుర్ జగంబుల్నినున్.

వ. అనిపల్కు కృపుని ధర్మవచనంబులు పెడచెవింబెట్టి సౌప్తిక సమయంబున బాండవుల జతురంగసమేతముగ సమయింప సమకట్టి ముందునకు నడువ శార్దూల చర్మధారియై సర్పహారమ్ములు గరిగి వాడికోఱల న్వెలిపుగొల్పుచు నోర్దెఱచి భయంకరాకారమ్ముగ నొక్క భూతమ్ము కట్టెదుర నిలువ గురునందనుండు భీతిల్లక ఘోరాస్త్రమ్ము లెన్నియేని ప్రయోగింప వాని నన్నింటి నబ్భూతంబు మ్రింగ మిగుల వగచి సేయునదిలేక రథమ్ముడిగి మునునున పార్వతీరమణుం దలంచు నాసీనుండై యుండ దన ముంగట నొక్క శిఖిజ్వాల గానంబడ నందు దనదేహం బాహుతి గావించుకొన నెంచినంత శివుండు ప్రత్యక్షుడై యొక్క ఖడ్గం బాశ్వత్థామకిచ్చి యతం డెఱుంగకుండ నతని తనువున నావేశించె నంత నశ్వత్థామ కృపాణధారియై రథారూఢుండై కృప కృత

పద్మాంగోదయాని శిబిరంబులకడ కరిగి తొల్త ధృష్టద్యుమ్ను
డున్న చోటు జని శిష్యుని దలంచుచు,

సీ. ఇరుగాల పెడయు పై ♦ న్నురము ద్రొక్కి బిరాన
పసుగుంచె ద్రుపదభూ ♦ జా తనయు
దలపట్టి యీడ్చుచు ♦ దక్కు పాంచాలుర
నల్లర వధియించె ♦ హేతిధార
కరితురంగము పై ♦ కుజికి మూరలు చెక్కి
పీనుగుపెంటగా ♦ వింపగొడగ
కోపవేగమున ను ద్దీపించి పైబడి
ద్రౌపదీతనయులం ♦ దవిలి సంపె

తే. గీ. వేగుజామున కెల్లరన్ ♦ వెస వధించి
తత్క్షణం బెగి యది సుయోధనున కెఱుక
పఱుప హర్షించి యతడు జీ ♦ వముల విడిచె
ద్రౌణి వ్యాసాశ్రమము జేరె " తప మొనర్ప.

చ. తెలతెలవార నయ్యెడి యుధిష్ఠిరముఖ్యు లెఱింగి కుందుచో
జలరుహనాభుగూడి పటు శౌర్యమునన్ విజయుండు భీముడుం
జలమున ద్రౌణి యున్నెడకు సత్వర మేగి తదాశ్రమంబునన్
లలి జపమాల ద్రిప్పుకొను ♦ రక్కసుబోలిన ద్రోణనందనున్.

వ. కనుగొని కోపపరంభులై,

పాట - చతురశ్రగతి.

ప॥ దోసమనక పసిబాలురంజంపి-దొంగజపము గావించుచున్నావ॥దో॥

అ॥ప॥ నీసగుణవంతయు నేగలసెనా - నిద్రాణుల నిసివేళ వధింతువ॥

1. పాండుసుతుల కపకార మొనరించి-ప్రాణములకు జెడకుండుదువీవెట్లు
దుండగీడవై నీ వీనాటికి - ద్రోణుప్రతిష్ఠయు గంగగల్పితే ॥దో॥

2. గురుసుతుండవనుమారియాదన్నిను- బరిమార్పకుండ మేమురకున్నను
యురకుండవుగదయు గ్గాండివం-బ్రోవిప్రాధమ! లేచిరావేమి ॥దో॥

తే. గీ. అనినవిని ద్రోణనందనుం ♦ డాక్షణంబ
బ్రహ్మశిరము లోదలంచియు ♦ పాండవంబు
గా దృణంబొందు మంత్రించి ♦ కన లివిడువ
మండుచును దశమ్ము గవియుచో ♦ మాధవుండు

ఉ. కవ్వడిచే దదస్త్రమును ♦ గ్రన్నన సేయగ జేసె నస్త్రముల్
జివ్వకు సిద్ధమైనయటు ♦ చెచ్చెర దాకిన భస్మరాశిగా
నవ్వసుధాతలమ్ము కల ♦ నారదముఖ్యమునివ్రజమ్ము రా
దవ్వులనుండివచ్చి వసు ♦ ధాసురపార్థుల నుద్దలించుచున్.

తే. గీ. ఇరువు రస్త్రమ్ము లుపసంహరింపుడనగ
నర్జునుం డట్లొనర్చె ద్రో ♦ ణాత్మజాతు
డొప్పకుండంత వ్యాసాదు ♦ లప్పుడతని
మందలించుచు యత్నించి ♦ సంధిసేయ,

వ. బ్రహ్మశిరంబు ఉంగరంపు రత్నంబును పాండవమధ్యమున క్షిప్పించె నంత
గోపమ్ము విడువక గురునందనుం డయ్యస్త్రమ్ము నుత్తరాగర్భమ్ము
జెరుచుగాక యనుచు కల్కి ప్రజ్వలి పజేసిన శౌరియు జక్రంబడ్డిడి
తదస్త్రము వారించి పరీక్షితునకు ప్రాణంబిడి మూడువేలేండ్లు
వస్త్రమ్ములు లభింపక దుర్గంధ దూషిత దేహుండవై యుండుము
గాకయని యశ్వత్థామకు శాపంబిచ్చి శిరోరత్నంబును పాండవు
లచే ద్రౌపదికిప్పించి యూపె నూరార్చె నంత ధర్మజుండును
గాంధారీ ధృతరాష్ట్రముఖ్యుల నెల్ల నూరడించి కుంతివలన గర్ణుండు
తనకన్న యనివిని సోదరులందరును జలమిచ్చి యెల్లవారికి దర్ప
ణాదులొసంగి యనంతరంబొక్క శుభదినమ్మున శ్రీకృష్ణానుమతిం
బున బట్టాభిషిక్తుండై యెల్లగతుల గన్నులకానంద మొనర్చి యంప
శయనమున్న భీష్మునివలన సమస్తధర్మాధర్మములు తెలిసి యయ్యు
నఘుండంత మాఘమాసమ్మున శుక్లపక్షమునందలి యేకాదశినాడు
శ్రీకృష్ణునం దైక్యమ్మునందగా హస్తిపురమ్ము సేరి వ్యాసాదులయను

సుస్థిరంబున నశ్వమేధం బొనర్చి సుఖమ్ముగ బెద్దకాలమ్ము రాజ్య
పాలన మొనర్చెనో సకల సద్గుణగణ ప్రపూర్ణుడగు మాధవుని కీర్తులెల్లరు
మంగళమ్ము పాడిరి.

**మణిరంగు - మిశ్రగతి.**

ప॥ హారతిగో కులబాల నేడు _ మాశ్రితజనానుకూల కృష్ణ ॥హార॥

అ॥ నీరజభవసేవితపద _ నిర్జరపాల నవ — సారసదళలోచనయుగ
సత్యాత్మవిలోలా - గోపాల కళ్యాణశీలా ॥హార॥

**చ ర ణ ము**

హేమసంగరతరాజిత - చైద్యమాగధవార ప్రమథావనదు - ర్వార
ప్రతిభావిభాసిత భీష్మకరాజాత్మజా _ హృ - చ్ఛోరనందకు-మార
దురిత వి-దూర కౌస్తుభహార జాంబవతీవరా-వర కామిత జనకల్ప
కా - పాహిమాం సకలాగమస్తుత లీల - కాంచనచేల దానవ -
జాల నతసుర - జాల నీరద - నీలదేహజనార్ధనా పావనా - దేవ
ముని సంభావనా - సద్గుణనిధాన ॥హార॥

క. గిరిజామనోంబుజమహాం
భర ! విశ్వంభర ! మహేశ ! పాపవినాశా !
కరుణన్ మత్కృతభారత
చరితము గైకొనుము దీని చంద్రార్కధరా!

# ప్రశంసా లేశము

1 తత్తద్గాథారస మనుగతం ధాతతే శబ్ద జాలం
మార్గః ప్రత్నం నవమపి మహః సంవిధత్తే సమస్తం
సారం నీత్వాఽమృత మహహా! దదన్ భారత శ్రీరవాక్షే
సుబ్రహ్మణ్య! ప్రమద మతులం సార్థ కీ భూతనామా.

2. రస విసర సార సాహితీ ♦ ప్రసృత సత్క
థా రచన శక్తి, సత్సభా ♦ స్థలుల గాన
కళలు వెలయించి వినిపించు ♦ గరిమ గలుగ
కథక వాచస్పతిత్వ మ ♦ గ్గలపు బిరుదె?

3. హరికథాకథనమున నీ ♦యుక్తులశక్తి
స్వర్ణ కంకణ ఘంటికా ♦ స్వనమె తెలుపు
కొలిచి యమృతంబు దేవతా ♦ వళికినిచ్చు
చంద్రునకు నీవిధమ్ముల ♦ జను ఘటించు.

4. ఇతోఽప్యధిక మాధురీ మృదుళ బంధ సంధానభా
క్ఞునోహర కథాదికం బహుళ మోద మాపాదయోః
విరచ్య కవిచంద్ర! తద్విగిభ దంత భూషాయితాం
యశో విమల మల్లికాకుసుమ మాలికాం ప్రేంఖికాం.

ఏలూరు,
18—11—47

శ్రీ వెంకట పార్థసారథీ కవులు.
శతావధానులు.